# ఫారెక్స్®
# మొట్టమొదటి ఎంపిక!

## ఎందుకంటే క్రొత్త మేలుపర్చబడిన ఫారెక్స్® మొదటు మొదటు ఘన ఆహారాలకు మారే పాపాయికి సహాయకరంగా అత్యావశ్యక పదార్థాల సమ్మేళనం.

**ప్రొటీన్లు మరియు క్రొవ్వు పదార్థాల సరియైన కలయిక**

ఫారెక్స్ పాపాయి బలంగా మరియు ఆరోగ్యవంతంగా పెరిగేలా తోడ్పడటానికై ప్రొటీన్లతో సమృద్ధమైనది పాపాయి యొక్క సున్నిత జీర్ణశక్తికి అనువుగా సరియైన పాళ్లలో క్రొవ్వు పదార్థంతో ప్రత్యేకంగా రూపొందించబడినది

**పాపాయి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచడానికి తగినంత ఐరన్**

నాల్గవ నెలప్పటికి పాపాయి యొక్క ఐరన్ నిల్వ తరిగిపోతుంది పాపాయి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచి రోగాలను ఎదుర్కోడానికి సహాయకరంగా తగినంత ఐరన్ కల్గినది ఫారెక్స్

**కాల్షియం-ఫాస్ఫరస్‌ల ఆదర్శవంతమైన నిష్పత్తి**

దిన దినమూ పాపాయి ఎముకలు బలంగా మరియు ఆరోగ్యవంతంగా పెరిగేలా తోడ్పడటానికి ప్రత్యేకంగా రూపొందించబడిన ఫారెక్స్‌లో కాల్షియం ఫాస్ఫరస్‌లు ఆదర్శవంతమైన 2 1 నిష్పత్తిలో కలవు

మరి మీరు పాపాయికి పెట్టే ప్రతి చెంచాడు పోషణ తత్వ యుక్త ఫారెక్స్ మరింత రుచికరం కలపడానికి మరింత సులభం




క్రొత్త మేలు ఏర్పబడిన ఫారెక్స్®

పాలు చేర్చ అవసరం లేదు
కేవలం నీటిలో కలిపి పెట్టండి

# మార్పు సహజం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ప్రజలు ఎలాగైతే మారుతారో అలాగే రాజకీయ పక్షాలూ, అవి నడిపే ఇతర సంస్థలు కూడా మారుతుంటాయి. నేటి సగటు భారతీయుడు నాటి గాంధీ, ఇంకా చెప్పాలంటే నెహ్రూ కాలం కన్నా పూర్తిగా భిన్నమైనటువంటి వాడు. ఇప్పుడు అతను ఎంతో నిర్మొహమాటం కల, మరింత కార్య వాది అయిన, ఏళ్ళతరబడి నిలకడలేని రాజకీయ వాదులని చూసిన అనుభవంతో రాటు తేలిన సునిశితమైన రాజకీయ పరిజ్ఞానం ఉన్నటువంటి వ్యక్తి. ఆ కారణంగానే త్రిపాఠీలతో, ప్రణబ్ ముఖర్జీలతో సర్దుకు పోవటం రాజీవ్‌కి కష్టంగా ఉన్నదంటే నాకేమి ఆశ్చర్యం అనిపించటం లేదు. నా మిత్రుడు సహ పత్రికా రచయిత ఎం వి కామత్ తాను వంశపారంపర్య సూత్రానికి వ్యతిరేకి అయినా రాజీవ్ విషయంలో మాత్రం దానిని సహించటానికి పైగా సమర్థించటానికి వెనుకాడనని అంటూ ఉంటాడు నాదృష్టిలో అది అర్థం లేనటువంటిది అసలు మూల సిద్ధాంతమే తప్పు అయినప్పుడు ఇకదాని మీద ఆదారపడి ఉన్నటువంటిది ఏదైనా తప్పే అని నా బావం రాజీవ్‌గాంది అదికారంలోకి రావటానికి ఆయనకి ఉన్న ఒకే ఒక అర్హత ఆ తల్లికి కొడుకు కావటం ఒక ప్రజా స్వామ్యవాదిగా ఆయనని నేను సమర్థించలేను అందుకు ఆయన తగిన వ్యక్తి కారు ఒక వేళ తగిన వ్యక్తే అయినా ఆయనకి నేను మద్దతు ఇవ్వను

అసలు విషయం వదిలేసి ఇంకేదో చెబుతున్నాను నేను చెప్పదలచుకున్న అంశం ఏమిటంటే రాజకీయపక్షాలకి వాటి గత చరిత్ర ఆదారంగా మంచివా చెడ్డవా అని నిర్ణయించ కూడదు ఎందుకంటే నేనింతకుముందు చెప్పినట్లు కాలంతో పాటు మిగతా విషయాలు కూడా మారుతూ ఉంటాయి సఫారి సూట్లు ధరించి కంప్యూటర్‌తో ఆడుకునే వారు ఇప్పుడు కాంగ్రెసులో గాంది టోపి దరించి సేవా పరాయణులైన వారి స్థానంలోకి వచ్చారు ఈ సఫారి తరం పూర్తిగా కంప్యూటర్ మీదే నడుస్తున్నట్లు కనిపిస్తున్నది మనం గమనించ వలసింది ఏమిటంటే ఇప్పటి రాజీవ్ కాంగ్రెసు ఆయన తల్లి పార్టీ కంటే భిన్నమైనటువంటిది మహాత్మా గాంది కాంగ్రెసుకి నెహ్రూ కాంగ్రెసుకి ఉన్న తేడా లాగే శ్రీమతి గాంధి కాంగ్రెసుకి రాజీవ్ కాంగ్రెసుకి చాలా తేడా ఉన్నది ఒక రకంగా అదే ఆపార్టీని నిలబడేలా చేసిందని చెప్పవచ్చు సోవియట్ రష్యాలో స్టాలిన్ కమ్యూనిస్టు పార్టీ ఈ కాలానికి ఎలా పనికి రాకుండా పోయిందో అలాగే మహాత్మాగాంధీ కాంగ్రెసు కూడా పాతబడి పోయింది

ఎంతో మంది గమనించినట్లు కనిపించటం లేదు కానీ బారతీయ జనతా పార్టీ కూడా మారిపోయింది ఇప్పుడది ఒకప్పటి జన సంఘంలా లేదు జనతా ప్రయోగంతో ఆ పార్టీ పూర్తిగా మారిపోయింది ఇప్పుడది చిన్న వ్యాపారస్తుల వాణిజ్య వేత్తల పార్టీ కాదు. ఎవరైనా ఒక సర్వే లాంటిది జరిపితే ఇప్పుడు ఆ పార్టీలోని సభ్యత్వ స్వభావం తెలుసుకోవచ్చు. నేను ఇటీవల జరిగిన ఆ పార్టీ జాతీయ సదస్సులో చూసిన దానిని బట్టి ఇప్పుడు దానిలో వ్యాపారస్తులు, వాణిజ్య వేత్తలు తక్కువగా ఉన్నారనిపించింది. బహుశ 10 నుంచి 15 శాతం ఉండవచ్చేమో. ఇప్పుడు భా. జ. పా. యువతీ యువకుల పార్టీ. ఆ సదస్సులో లోక్‌దళ్ తప్ప మిగతా పార్టీలలో లాగే ఆపార్టీలో కూడా ఆగ్రహావేశాలు కలవారు ఉన్నారు. ఇకముందు అది పట్టణాలకి మాత్రమే పరిమితమైనటువంటి పార్టీ కాదు. లోక్‌దళ్ కంటే తక్కువ మంది రైతులు సభ్యులుగా బా జ పా లో ఉండవచ్చు జాం ఆర్వెల్ తనగురించి చెప్పుకున్నట్లుగా నేను దాని వివరిస్తాను దిగువ పై మద్య తరగతి వారు ఉన్న పార్టీ అది చాలా పార్టీలు ఆ వరంలో నించే మంచి వక్తలైన వారిని ఆకర్షిస్తాయి ఆహ్వానిస్తాయి ఆ వరం వారే అమెరికాలో హారిట్రూమన్‌ని వదిలేసారు కాని కెన్నెడిని కాదు అలాగే ఇంగ్లాండులో అట్లీని కానీ మాక్‌మిల్లన్‌ని కాదు

అది మత పరమైన పార్టీ అన్నదానికి నేను చెప్పేది ఏమిటంటే బా జ పా మత పరమైన పార్టీ అయితే మనం అందరమూ మతపరమైన వాళ్ళమే అది హిందూతత్వం నించి స్ఫూర్తిని పొందుతూ ఉంది విశాల దృక్పథంతో ఆలోచిస్తే హిందూ తత్వం అన్నది విశ్వ వ్యాప్త మైనటువంటిది అది బారతదేశంలో కానీ మరొచోట కానీ ఉన్న ఏ ఒక్క జాతికి పరిమిత మైనటు వంటిది కాదు యూరోప్‌లో చాలా పార్టీలు క్రైస్తవ పార్టీలు అయినా వాటినెవరూ మతపరమైన పార్టీలని అనరు విశాలదృక్పదంతో ఆలోచిస్తే మనది హిందూ దేశం అయినట్లే వారివి క్రైస్తవ దేశాలు కానీ యూరోప్ లోని దేశాలన్నీ లౌకిక రాజ్యాలుగానే ఉన్నాయి బా జ పా హిందూ పార్టీ కాదు ఎందుకంటే మనందరిలాగే విశ్వవ్యాప్తమైన సిద్ధాంతం లోని హైందవ తత్వానికే అది కట్టుబడి ఉన్నది కాబట్టి

బా జ పా రాజకీయాలలోని ఈ సందేహాల గురించిన చర్చకి అర్థం లేదు అరబ్బులు ఒక జాతిగా ఒక వరంగా ఉన్నప్పుడు హిందువులు ఒక జాతిగా ఎందుకు ఉండకూడదో నాకు అర్థంకాదు సంకుచితంగా ఆలోచిస్తే మాత్రం ఆ పదానికి అర్థం ఉండదు దేశం వేగంగా మార్పుకి లోనవుతున్నప్పుడు జాతి అంతటినీ కలిపి ఉంచటానికి మనం దగ్గరివారమన్న భావం కలగాలి బా జ పా దానిని సాధించ గలుగుతుంది కలగాపులగం అయిన పార్టీ కాబట్టి రాజీవ్ కాంగ్రెసు దానిని సాదించ లేదు దానికి ఒక ప్రయోజనాత్మక దృష్టి కానీ ఆలోచనలు కానీ లేవు మార దర్శకంగా ఉండే శక్తిని ఆ పార్టీ కోల్పోయింది అన్ని విదాలా మనకి కంప్యూటర్‌లు ఉండవలసిందే ఆదునిక సాంకేతిక శాస్త్ర విజ్ఞానం అవసరమే వాషింగ్ టన్ పారిస్ మాస్కోలనించి కొత్త ఊహలని ఫాషన్‌లని తెచ్చుకో వలసిందే కానీ అవే మనకి చాలవు ఎన్నో దేశాలు నశించి పోవటం వల్ల మనకి ఆ విషయం అర్థం అవుతుంది జపాన్ ఇప్పుడున్న స్థితిలో ఉండటానికి కారణం అది సాదించిన ఉన్నత శాస్త్ర సాంకేతిక విజ్ఞానం అని రాజీవ్ వాణిజ్య వేత్తలైన ఆయన మిత్రులు అనుకోవచ్చు ప్రపంచంలో జపాన్ అత్యంత విజయవంతమైన దేశమే కాకుండా ఎంతో శాంతి కలదేశం కూడా అందుకు కారణం అది తన ప్రాచీన తత్వాన్నీ సంప్రదాయాలని తూ చ తప్పకుండా ఆచరిస్తూ ఉండటమే ఆదునికీకరణ వల్ల ఉత్పన్నం అయే దుష్ఫలితాల నుంచి సంస్కృతి తత్వం సంప్రదాయాలకి సంబందించిన మూల సిద్ధాంతాలే దేశాన్ని రక్షిస్తాయి చెట్టు ఎంత ఎత్తు ఉంటే దాని వేళ్ళు అంతలోతుగా ఉండాలి బారత దేశంలో వాటికి మూలాదారం హైందవ తత్వం

ఇదంతా ఆ సదస్సులో చెప్పలేదు ఎందుకంటే అలాంటి అవసరం లేదు బా జ పా సభ్యులకి ఏది తప్పో ఏది ఒప్పో గ్రహించగల జ్ఞానం సహజంగానే ఉన్నది నాకు తెలిసిన మిగతా పార్టీలలో వారికన్నా ఏది నీతో ఏది కాదో తెలుసుకునే శక్తి వారికి ఉన్నది అది ఒక ఉద్యమం స్థాయి పార్టీ కాకపోవచ్చు ఇంగ్లాండులోని లేబర్ కన్సర్ వేటివ్ పార్టీలు అదికారం హస్తగతం చేసుకోటానికి ఏర్పడ పార్టీలు ఏజన్సీలు కావు అలాగే బా జ పా కూడా అదికారాన్ని హస్తగతం చేసుకోవాలన్న లక్ష్యం కలిగినటువంటి పక్షంకాదు లేబర్ టోరి తత్వాల లాగే బా జ పా కి కూడా తనదైనటువంటి లక్షణం ఒకటి ఉన్నది ఆ లక్షణం ఉన్న అది ప్రస్తుతం కాక పోయినా ఎప్పుడైనా ఒక బ్రహ్మాండమైన రాజకీయ ఉద్యమంగా మారినప్పుడు దానిలో పాలు పంచుకోవటం ఆపార్టీలో ఉన్న మనలో కొందరికి అదృష్టంగా బావించే సమయం వస్తుంది అందుకు తగినటువంటి రాజకీయ సంస్కృతి ఆ పార్టీకి ఉన్నది

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1986 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము గత ఏడాదికంటే ఈసారి బహుమతుల మొత్తాన్ని పెంచాము గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాది క్రమంలో ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలో ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము

**ముగింపు తేదీ : 16 ఆగష్టు 1986**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్క దానికి రు 700/ చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి రెండవ మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 750 రు 650/ రు 550/ వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్క దానికీ అదనంగా రు 350/ చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము

## నిబంధనలు

1 కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ వ్రాత ప్రతి పన్నెండు అర రావు (ఎక్సర్ సైజుపుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి వ్రాతప్రతిపై 1986 దీపావళి కథల పోటీకి అని మొదటి పేజీ పై భాగంలో స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు అనుసరణలు కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన రేడియోలో ప్రసారం అయిన ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు

4 రచయితలు రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము తరువాత బాల... ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము

6 పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో... విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది

7 రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

8 పోటీకి పంపే కథలు 16 ఆగస్టు 1986కి గానీ ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు జతపరచి పంపనవసరం లేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేస్తాము ... స్వీకరించ...

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహ...

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938 1972)

13 19 జూన్ 1986

శ్రీ అక్షయ నామ సం జ్యేష్ఠ శు షష్ఠ

సంపుటము 78 సంచిక 40

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు 2 50

పోస్టులో 6నెలల చందా రు 71 50

పోస్టులో 12నెలల చందా రు 143 00

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధినగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం

దేవీ పూజ లో సుధ

(ఫొటో ఎన్ శివన్నారాయణ)

### కథలు



### సీరియల్ నవలలు



### వ్యాసాలు శీర్షికలు






### ముఖచిత్రం

9-15 మే సంచిక కొత్త గెటప్ ముఖచిత్రం చాలా బాగుంది -డి నాగరాజరావు పుష్ప కదిరి

* * *

విశ్వవిఖ్యాత నటసార్వభౌమ నటరత్న పద్మశ్రీ కళాప్రపూర్ణ కథానాయక ఆడపడుచుల అన్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా నందమూరి తారక రామారావుగారి ముఖచిత్రం కనులను మిరమిట్లు గొలిపే విధంగా వుంది

-బందిగి బాలరాజు నారాయణపేట

* * *

ఆంధ్రప్రదేశ్ మెడికల్ యూనివర్సిటీ చాన్సలర్ హోదాలో తెలుగు వారి రాజకీయ జీవిత చరిత్రలో నాలుగు అద్భుత నూతనాధ్యాయాలు లిఖించి చరిత్ర సృష్టించి గిన్నిస్ బుక్‌లోకి కూడా ఎక్కిన తెలుగుజాతి ఆత్మగౌరవ పరిరక్షణాధినేత తెలుగు ప్రజల ప్రాధయాధినేత తెలుగు సినీ ప్రేక్షకుల ఆరాధ్య దైవాధినేత అయిన ప్రస్తుత మన ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు గారి ముఖచిత్రం పత్రికకొక్క కన్నుల పండువగా నిలిచింది

-హరిదాస్యం దేవానంద్ బాబు హనుమకొండ

* * *

చాలా కాలము తర్వాత మన ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీయార్‌ను మన పత్రికపై ముఖచిత్రంగా చూచి చాలా ఆనందించాము సినినటుల ముఖచిత్రాలతో విసిగిపోయిన మాకు అప్పుడప్పుడు వెరైటీ ముఖచిత్రాలను అందించగలరని ఆశిస్తున్నాము

-అనురాధ నిర్మల సరస్వతి

ఉమాదేవి ఉషారాణి లావణ్య

ఎమ్మిగనూరు

### కథలు

శ్రీ ఎన్ టి ఆర్ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది భయం అట్టహాసం కథలు బావున్నాయి

-ఎలుబాని శేషగిరిరావు విశాఖపట్నం

* * *

శ్రీ ఎన్ టి ఆర్ ముఖచిత్రంతో వెలువడిన సంచికలో శ్రీ పులికంటి కృష్ణారెడ్డి గారు వ్రాసిన అట్టహాసం కథ నాకెంతగానో నచ్చింది కంట్లో పడి బాధపెట్టే ఇసుక రేణువును కనుపాప దగ్గరగా చూస్తే అదొక కొండలా కనిపిస్తుంది ఆ ఇసుక రేణువు లాంటి రాజా గారి పాత్ర అట్టహాసాన్ని చాలా హృద్యంగా చిత్రీకరించారు నిజాయితీతో వ్రాసిన కథ ఇది వాస్తవ చిత్రం అద్భుతంగా వుంది

-యం సత్యనారాయణ విశాఖపట్నం

### ఇద్దలు

28 మే 86 వారపు సంచికలో శ్రీ రాగం గారు ఇడ్లీ- ఇడెన గురించి వ్రాస్తూ కన్నడంలో బొగుని ఇడ్లి అంటారని తెలుస్తోంది అని వ్రాశారు ఇది సరికాదు కన్నడ బాషలో బొగును ఇద్దలు లేక ఇజ్జలు అంటారుగాని ఇడ్లి అని అనరు మనము తినే ఇడ్లీని ఆ బాషలోనూ అదే పేరుతో పిలుస్తారు 30-40 సంవత్సరాల క్రితం వరకు తెనుగులో కుడుము (ఆవిరికుడుము) అంటూ వుండిన విధముగానే కన్నడంలోనూ కడుబు (హబెకడుబు) అనేవారు

ఇటీవల పత్రికను సినిమా పత్రిక కింద మారుస్తున్నారనే భావం కలుగుతోంది సినిమాల సినీ హీరో హీరోయిన్ల గురించే ఎక్కువ పేజీలు కేటాయిస్తున్నారు సినీ పత్రికలకు తెలుగులో కరువులేదు పత్రికలో దానికి పేజీలు పెంచకండి శ్రీమతి వైశాలిరెడ్డి బ్రూక్లు లాంటి వ్యక్తుల గురించి పేజీల్ని వృధా చేయక మన భారతదేశపు మంచి వ్యక్తులు గురించి మంచి స్థలాల గురించి ప్రచురిస్తే బాగుంటుంది పనికివస్తుంది అని నా భావన

-రామశేషశాస్త్రి అనంతపురం

### రాష్ట్ర స్థాయి పోటీలు

మద్యపాన నిషేధము - యువత కర్తవ్యం అన్న అంశముపై మూడు అరఠావు పేజీలకు మించని రచనలు ఈ క్రింది చిరునామాకు జూలై 31వ తేదిలోగా పంపాలి రచనలు వ్యాసము / కధానిక నాటకలలో ఏ ప్రక్రియలోనైనా వ్రాయవచ్చు ప్రతి ప్రక్రియకు ఒక్కొక్క ఉత్తమ బహుమతిగా రూ 116/-లు చొప్పున పారితోషికము ఈయబడుతుంది

ఎ మోహన్ సలహా అధికారి

అంతర్జాతీయ మద్యపాన నిషేధ సంస్థ

కొరుకొండ- 531 214 విజయనగరం జిల్లా

### మినీ కథల పోటీ

సాంస్కృతి సమాఖ్య కాకినాడలో జూలై 16వ తేదిన నిర్వహించబోయే రాష్ట్రస్థాయి రచయిత(త్రు)ల మహాసభల సందర్భంగా ఒక పేజీకి మించని మినికథల పోటిని నిర్వహిస్తోంది కథ అరఠావుకు ఒక వైపు మాత్రమే ఉండాలి ఈ పోటిలో పాల్గొన్న రచయిత (త్రు) లందరికి ప్రశంసా పత్రాలివ్వబడతాయి రెండు ఉత్తమ కథలకు సమాఖ్య షీల్డులివ్వబడతాయి కథలు 20-6-86 తేదిలోగా శ్రీ వేమల శ్రీరామశర్మ కార్యదర్శి సాంస్కృతి సమాఖ్య శివాజీనగర్ నిజామాబాద్- 503001 అను చిరునామాకు అందాలి వివరాలకు - పృద్వి సుబ్రహ్మణ్యేశ్వరరావు కన్వీనరు సాంస్కృతి సమాఖ్య తూ గో జిల్లా విభాగం 15-9-4 మంగళవారపు పేట పెద్దాపురం-533437 అను చిరునామాను సంప్రదించవచ్చు □

సీరియల్

# సర్ప యాగం

శీలా వీర్రాజు

(గత సంచిక తరువాయి)

దేవరకొండ గ్రామంలో వీదికి దక్షిణం వేపున్న రాములు గుడి వరండాలో కొంతమంది మగాళ్ళు కూర్చుని లోకాభిరామాయణం మాట్లాడు కుంటున్నారు ఆ వరండా ఆ వూరికి రచ్చబండ గుడి పక్కనే వున్న వూరబావి లోంచి నీళ్ళు తోడుకుని కడవలతో మోసుకు పోతున్నారు కొందరు ఆడపడుచులు

అది యింటర్వెల్ టైం కనుక బడి ఎల్లలంతా వీదిలో చేరి ఆడుకుంటున్నారు పంతులు గుర్నాదం మాత్రం గుడి వరండాలో కూర్చుని బాతాఖానీలో మునిగి పోయాడు వీర్రాజు మాత్రం ఆ వీదిలో నీళ్ళ కడవలు మోసుకు పోతున్న ఆడపడుచుల వేపు అదే పనిగా చూస్తూ విలాసంగా ఎడి కాలుస్తున్నాడు

అన్నట్టు వీర్రాజూ! నీకు ఈ విషయం తెలుసా? – అడిగాడు పంతులు గుర్నాదం

యే విసయం?

సర్పంచులకు యెన్నికల్ని త్వరలోనే పెట్టేటట్టు యిటీవల మంత్రుల సమావేశంలో నిర్ణయమై పోయిందట – అన్నాడు గుర్నాదం అపూర్వమైన విషయం చెప్పేవాడిలా

అట్టాంటిదేఁవీ లేదే ఆ మద్య నేను అయిద్రాబాద్‌లో మంత్రుల్ని కల్సినప్పుడు వాళ్ళిలాంటి మాటలేఁవీ నాతో సెప్పలేదే – మంత్రులు తీసుకునే ప్రతి నిర్ణయమూ తప్పకుండా తనకు తెలియపరచబడే వాడిలా అన్నాడు వీర్రాజు

నాకూ ఖచ్చితంగా తెలియదు ఈ రోజు బస్‌లో వస్తుంటే ఎవరో ఈ సంగతి గురించి మాట్లాడుకుంటూ వుంటే నేను విన్నాను అంతే – అన్నాడు గుర్నాదం

ఆఁ అయ్యన్నీ వొట్టి మాటల్లే – తను మాత్రమే గట్టి మాటలు చెప్పేవాడిలా అన్నాడు వీర్రాజు

జరిగిన కథ 5 దేవరకొండ గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో పంతులు గుర్నాదం వీర్రాజు గుర్నాదం మాట్లాడుతుండగా స్కూలు బయట పాము వచ్చిందని పంతులుతో చెప్తాడు బాలయ్య బాలయ్య పాములనుపట్టే యానాదివాడిని ఎలుచుకు రావటానికి వెళ్తాడు ఇంతలో నాగరాజు అక్కడికి చేరుతాడు ఆ గ్రామంలో మంచి పలుకుబడి ఉన్న వ్యక్తి నాగరాజు వెంకట్రాముడు వచ్చి పాముని పట్టేసాడు నర్సయ్య కొడుకు గోవిందుడికి నాగినితో పెళ్ళి నిశ్చయమవుతుంది వెంకట్రాముడు తానుకూడా పెండ్లి చేసుకోవాలనే ఉదేశ్యంతో జాతర జరిగే రోజున గోవిందుడిని వెంటపెట్టుకుని మనువులబండ దగరికి వెళ్తాడు గౌరి వెంకట్రాముడి బార్య అయింది గోవిందుడి నాగిల పెళ్ళి జరిగిపోయింది గౌరిని పాము కాటువేస తప్పించుకొని పోయింది గౌరినితన పాకదగరకి తీసుకుపోయాడు వెంకట్రాముడు

అంతే నంటావా?

అంతగాక యేఁవుంది మరి సర్పంచుల యెన్నికలు యిప్పుడల్లా జరగవని మంత్రులంతా అనుకుంటా వుండారు యిదే సంగతి యీ మద్య పేపర్లో పస్టు పేజీలో యడ్‌లైన్స్‌లో పడింది మిరెవురూ పేపర్ సూసుండర్లే – అన్నాడు వీర్రాజు

వొకయాళ సర్పంచుల యెన్నికలు గాని జరిగితే మన రాజుగారేఁవన్నా యీసారి నిలబడే సూచన్లేవన్నా వున్నాయా? అని సందేహంగా అడిగాడొకడు

యెవరు మన నాగరాజు గారా

మన నాగరాజుగారే

యిదవ సర్పంచ్ పదవెందు కాయనకు ఆయన అనుకుంటే యం ఎ గా గెల్సి ఢిల్లీ కెళ్ళిపోయి సెంటర్లో క్యాబినెట్ మంత్రి అయిపోగల్డు ఆయనకు పదవులంటే పడదు అసలు ప్రెజాసేవంటూ సెయ్యాలంటే మంత్రి కావాల్సిన పన్లేదు గాంది గారు మంత్రిగా పనిసెయ్యఁ లేదు మన రాజు గారి దంతా గాంది వొరసే – అన్నాడు వీర్రాజు

అన్నట్టు వీర్రాజూ! నువ్వు అయిద్రాబాద్ మళ్ళీ యెప్పుడెళ్తావు – శినయ్య ప్రశ్నించాడు

యల్తా మినిస్టర్తో కొంచెం పనుండాది వొచ్చే నెల్లో పోతా – చెప్పాడు వీర్రాజు

నిజఁవేనా

సర్దాకు సెప్తావుండానని అనుకొంటూ వుండావా యేంది అది సరే నీగూడా అయిద్రాబాద్లో యేఁవన్నా పనుందా

అవ్

యెవుర్తో

నీతోనే

నాతోనా? సెప్పు మరి

కొంత సాయం సేస్తావా

సూద్దాంలే సెప్పు

ఎదుటి మనిషి అడిగిన దానికి చూదాంలే అని సింపుల్‌గా తలాడించే పద్ధతి ప్రజానాయకుల కంటే వీర్రాజుకు బాగా పట్టుబడి పోయింది

మరేం లేదు వీర్రాజూ నేను కొత్త యింటిని కట్టే సంగతి నీకూ తెల్సుగదా కొందాఁవంటే సిఁవిటీ (సిమెంట్) దర జాస్తిగా వుంది నీకు తెల్సినోళ్ళు అయిద్రాబాద్‌లో ఎవురన్నా వుంటే అన్నాడు శినయ్య

యెవురన్నా వుంటే అని అనబోక నాకు అయిద్రాబాద్లో తెలనోళ్ళు లేరు మంత్రులంతా మనోళ్ళే సిమిటీ శానా కరువై పోయుండాది బ్లాకుల్లో గూడా దొరకాటం లేదు యిదే సంగతి ఈ మద్య పేపర్లో పస్టు పేజీలో యడ్‌లైన్స్‌లో పడింది మిరెవురూ పేపర్ సూసుండర్లే – అన్నాడు వీర్రాజు

యట్నో కొంచెం సాయం సెయ్యి వీర్రాజూ

యీ మద్య అయిద్రాబాద్లో నీ మాదిరిగానే తెల్సినోడు కనిఎంచి సిఁవిటీ

కావాలంటే యిన్నూరు (రెండు వందల) బస్తాలిప్పించినా సరే నేను పొయ్యేటప్పుడు గురుతు సెయ్యి ట్రయ్ సేస్తా - అంటూ కోతలు కొయ్యసాగాడు వీర్రాజు

ఆడవాళ్ళు అందులోనూ యుక్త వయస్సులో వున్న వాళ్ళు అగుపిస్తే వీర్రాజు కోతలు కొయ్యడంలో ఉత్తర కుమారున్ని మించి పోతాడు ప్రస్తుతం ఆ వీదిలో పూరబావి నుండి ఆడపడుచులు నీళ్ళ కడవలు మోసుకు పోతున్నారు

అందుకే వాళ్ళందరికీ బాగా వినబడేలా హైదరాబాద్‌లో తనకేదో గొప్ప పలుకుబడి వున్నట్లు మంత్రులందరితో తనకు గొప్ప సాన్నిహిత్యమున్నట్లు వీర్రాజు కోతలు తెగ కొయ్యడం ప్రారంభించాడు పాలకొండ నాగరాజు లాంటి వాడు తప్ప తక్కిన వాళ్ళంతా చాలా వరకు వీర్రాజు మాటల్ని నమ్మేస్తారు

దండాలు సావి

వీర్రాజు చటుక్కున తలతిప్పి దండాలు పెట్టింది ఎవరా అని చూశాడు ఆ గుడి ముందు ఓట్లకోసం రాజకియ నాయకుల్లా చేతులు జోడించి ముగురు మగవాళ్ళు నిలబడి వున్నారు వీర్రాజు యిది వరలో ఆ ముగ్గురినీ ఎక్కడా చూసినట్లు గుర్తులేదు గుడి వరండాలో వున్న వాళ్ళంతా వారి వేపు ప్రశ్నార్థకంగా చూశారు

మాదీవూరు కాదు సావి - ఆ ముగురిలో ఒకడు వీర్రాజుతో వినయంగా చెప్పాడు

ఆ మాట నువ్వు సెప్పక్కర్లేదు మీ మొకాల్ని సూస్తుంటేనే అది తెలస్తావుంది - అన్నాడు వీర్రాజు

మేవు యానాదోళ్ళం సావి

అయితే?

మాది శానాదూరం

యే వూరో

బంద పాకాల - చెప్పాడు యానాదివాడు

యేం గావాల మీకు - వీర్రాజు ప్రశ్న

మేవు యీ వూరి రైతుల కాడికి న్యాయం కోసం వొచ్చినాం సావి - అన్నాడో యానాది వాడు

న్యాయం కోసం మావూరు రైతుల దెగిరికి వొచ్చినారా? మీవూళ్ళో రైతులెవ్వరూ లేరా?

లేకేం సావి మొస్తుగా (దండిగా) వుండారు - చేతులు కట్టుకుని చెప్పాడు వాడు

అయితే మీ వూరి రైతుల్ని కాదని మీరు న్యాయం కోసం మావూరికెందుకొచ్చినట్టు?



# సర్పయాగం

"మాను అనా యిం సేఎంది మి వూళ్లోని మనుసులే సాంవి"- చెప్పాడు వాడు

మా వూరి మనుషులా అన్నాడు వీర్రాజు ఆ వూళ్లో అన్యాయాలు చేసేవాళ్ళు బొత్తిగా లేనట్టు

అవును సాంవి మి వూరి మనుసుల వల్లే మా కన్యాయం జరిగింది అందుకే మేంవు మికాడికి న్యాయానికొచ్చినాం అన్నాడు యానాదివాడు ఆ వూళ్లో వాళ్ళంతా వర్మరాజులైనట్టు

యెవురు యెవురు వాళ్ళు? మికు అంత అన్యాయం సేసనోళ్ళు అడిగాడు వీర్రాజు

మి వూరి యానాదోళ్ళు సాంవి

మా వూళ్లో యానాది కాపురాలు రొండు కాపురాలే వున్నాయి నర్సయ్యదొకట యంకట్రావునిదొకట

వోడే సాంవి మాకన్యాయం సేసింది

యెవురు నర్సయ్యేనా?

కాదు సాంవి ఆ యంకట్రాంవుడు సాంవి చెప్పాడు యానాదివాడు

నాకు తెల్సు ఆ యంకట్రాంవునికి ఔల్లకు పట్టినట్టు బాగా కొవ్వు పట్టుండాది కొవ్వుబట్టిన యంద్రకాయగానీ కొవ్వుబట్టిన యానాదోడుగానీ వొక పట్టాన వుండలేరు వుండేదానికి సోటిస్తే పండుకునేదానికి మంచం అడిగేటోడు యంకట్రాంవుడు అంటూ కసిగా తిట్టసాగాడు వీర్రాజు

ఇంతకూ వెంకట్రాముడు ఆ యానాదులకు చేసిన అన్యాయమేమిటో వీర్రాజుకు తెలియదు అయినా వీర్రాజు వెంకట్రాముడిని బూతులు తిట్టసాగాడు అందుకు కారణం, ఒకనాడు సారా కొట్టు ముందు నువ్వొక కొజ్జావాడివి అంటూ వెంకట్రాముడు వీర్రాజును పరోక్షంగా తిట్టడమే

అనాడు వెంకట్రాముడన్న ఆ మాట వీర్రాజు చెవుల్లో గింగురుమంటూనే వుంది నాటి నుండి వీర్రాజుకు వెంకట్రాముడి మిద గొంతు వరకు కసి పెరిగిపోయింది అందుకే తన కసిని తీర్చుకోడానికి ఆ రోజు నుండి అవకాశం కోసం వీర్రాజు ఎదురు చూస్తూనే వున్నాడు

పూర్తిగా కాకపోయినా ఆ అవకాశం కొంతవరకైనా యిప్పుడు దొరకడంతో వీర్రాజు చాలా ఆనందపడ్డాడు దొరికిన అవకాశాన్ని అతడు జారవిడుచుకోదలచలేదు గుడి ముందున్న యానాదులకు న్యాయం చేకూర్చడం వీర్రాజు అభిప్రాయం కాదు ఆ సాకుతో వెంకట్రాముడిని అవమానంగా మాట్లాడడమే అతడి ఉద్దేశ్యం

ఆ గుడి ముందు నిలబడి వున్న ఆ ముగ్గురు యానాదివాళ్ళలో ఒక యువకుడున్నాడు. అతడికి పాతిక సంవత్సరాలుంటాయి. మిగిలిన యిద్దరికి యాభైపైనే వుంటాయి. వాళ్ళ ఒంటిపై నున్న బట్టలు బాగా మాసిపోయి కంపు కొడుతున్నాయి. ఆ యువకుడు చిరుగులుపడ్డ చొక్కా, గళ్ళ లుంగి ధరించి వున్నాడు.

ఆ పెద్దవాళ్ళు మాత్రం గోచిలు పెట్టుకుని ఒంటి చుట్టూ పాత దుప్పట్లు కప్పుకుని వున్నారు బోజనం ముఖం చూసి మూడు దినాలైనట్టుగా వాళ్ళ కళ్ళు ముఖాలు బాగా ఎక్కుపోయి వున్నాయి ఈ దేశంలోని దారిద్ర్యానికి ఆ యానాదులు ఛాయా చిత్రాల్లా వున్నారు

ఇంతకూ వెంకట్రాముడు మికు చేసిన అన్యాయమేమిటో ఆ విషయాలన్నీ వివరంగా చెప్పండి అంటూ బీడిని నోట్లో పెట్టుకున్నాడు పంతులు గుర్నాదం

సెప్తాం సాంవి మిరు మాకు యెట్టయినా న్యాయం జరిగేటట్లు సూడాలి మిమ్మల్ని నమ్ముకుని శానా దూరం నుండి వొచ్చినాం సాంవి అన్నాడా యువకుడు దీనంగా

మేంవు గూడా కడుపుకు కూడు తినే రైతులంవే మాకూ న్యాయం అన్యాయం తెల్సు అన్నాడు వీర్రాజు

మాకు మిరొకిటి యంకట్రాంవు దొకిటి కాదు మాకు యిద్దరూ సంవానంవే న్యాయానికి యెవురైనా వొకిటే మా కట్టాంటి బేదాల్లేవు అన్నాడు శీనయ్య

అసలు యింతకూ జరిగిన కథేమిటో చెప్పండి అన్నాడు గుర్నాదం బీడీ వెలిగించుకుంటూ

మి వూరి యంకట్రాంవుడు జంగాలపల్లి జాతర్లో వొక ఆడదాన్ని తొడుకొనొచ్చి యింట్లో పెట్టుకుని కాపరం సేస్కుంటూ వుండాడు సాంవి యీడే దాని మొగుడు అంటూ ఆ యువకుడివేపు చేయి చూపెట్టాడా పెద్దాయన

అది యీనితో కొన్ని దినాలు కాపరం సేసి యీడంటే యిస్టం లేక వొదిలేసిపోయింది సాంవి సరే దానిస్టం అది మేంవు కాదనం అయితే దాని పెండ్లికి మేంవు వొలి యిచ్చినాం అంతేగాక దానెమ్మకు సరార్లైకా తీసిచ్చాం పెండ్లికి యాబయి రూపాయలు కర్సుపెట్టినాం అన్నాడు మరో పెద్దాయన

ఆ యంకట్రాంవుడు గవుర్ని తెచ్చుకొన్నందుకు నాకు బాదలేదు సాంవి అయితే వోడు దాన్ని పెండ్లాంగా ఎట్టుకునే ముందు గవురికిచ్చిన వొలి దాని పెండ్లికి మేం పెట్టిన కర్సులూ అన్నీ మాకు సెల్లించాల అది మా కులాశారం కానీ యంకట్రాంవుడు మాకు పైసాగూడా యియ్యలేదు సాంవి చెప్పాడా యువకుడు

అంతా విన్న పెద్దలు న్యాయ విచారణ కోసం వెంకట్రాముడినీ గౌరిని తొడుకుని రమ్మని బాలయ్యను పంపించారు




## 7

వైవాహిక వ్యవస్థకు సంబంధించి యానాది తెగలో మరో విచిత్రమైన సాంప్రదాయముంది అదేమిటంటే వొలి ఖర్చు మిగిలిన పెళ్ళి ఖర్చులనూ పెళ్ళికొడుకుకు తిరిగి చెల్లించడం అయితే ఆంధ్ర దేశంలోని అన్ని ప్రాంతాలలో జీవించే యానాది వాళ్ళ ఆచార సాంప్రదాయాలు అన్నీ ఒకేలా వుండకపోవచ్చు

ఒక యానాదివాడు భర్తతో తెగ తెంపులు చేసుకున్న యానాది స్త్రీని రెండో పెళ్ళి చేసుకోవచ్చు పెళ్ళి చేసుకోకపోయినా భార్యగా స్వీకరించి ఆ స్త్రీతో సంసారం చేసుకోవచ్చు అయితే ఈ పని చేసే ముందు ఏ స్త్రీని భార్యగా స్వీకరిస్తాడో ఆ స్త్రీని మొదట పెళ్ళి చేసుకున్న మగాడికి పెళ్ళి ఖర్చుల్ని మొత్తం విడిగా చెల్లించాలి

యానాది వెంకట్రాముడు గౌరిని మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు చేసుకోకపోయినా భార్యగా గౌరిని స్వీకరించి ఆమెతో సంసారం చేస్తున్నాడు గౌరిని మొదట ఏ యానాది వాడు పెళ్ళి చేసుకున్నాడో అతడెంత వొలి యిచ్చాడో పెళ్ళికి ఎంత ఖర్చు పెట్టాడో ఆ మొత్తాన్ని వెంకట్రాముడు గౌరి మొదట భర్తకు విడిగా చెల్లించాలి అది వాళ్ళ సాంప్రదాయం

అలా చెల్లించిన తరువాతే గౌరిని అతడు భార్యగా స్వీకరించాలి అయితే యానాది వెంకట్రాముడు ఆ విధంగా గౌరి మొదటి భర్తకు పెళ్ళి ఖర్చులను

కొన్ని క్షణాలు
టిక్ టిక్ మంటూ
కలకాలము
లయదప్పని కవితా
నాదాలను పలికిస్తుంటాయి






# సర్పయోగం

చెల్లించకనే గౌరిని తసుకొచ్చి తన యింట్లో పెట్టుకుని సంసారం సాగిస్తున్నాడు అంటే వెంకట్రాముడు తమ జాతి సాంప్రదాయాన్ని అతిక్రమించాడన్నమాట

అయితే ఈ సాంప్రదాయ ఉల్లంఘన అతడు కావాలని చే సిన పని కాదు గౌరి మొదట భర్త ఎక్కడున్నాడో వెతుక్కుంటూ వెళ్ళి అతడికి డబ్బు

చెల్లించడానికి వెంకట్రాముడు బద్ధకించాడు తన భార్యను మరొకడు పెళ్ళి చేసుకొన్నా వెంకట్రాముడు తన పెళ్ళి ఖర్చుల్ని వసూలు చేసుకోలేకపోయాడు

దేవర కొండ గ్రా మ నివాసి అయిన యానాది వెంకట్రాముడితో ప్రస్తుతం గౌరి కాపురం చేస్తోందని ఆమె మొదటి భర్త ఎలాగో వాకబు చేసి కనుక్కున్నాడు అందుకే యిప్పుడు వాళ్ళు వెంకట్రాముడి వద్ద నుండి పెళ్ళి ఖర్చులను వసూలు చేసుకోవాలనే ఉద్దేశ్యంతో టే తమ సమస్యను గురించి రైతులకు వివరించి చెప్పారు

పాము కాటు తిన్న గౌరి గుడిసె లోపల బొంత మీద వెల్లకిలా పడుకుని వుంది వెంకట్రాముడు గౌరి పక్కనే కూర్చుని నాగముష్టి చెక్కను ఒక్కొక్క ముక్కే త్రుంచి గౌరికి అందిస్తున్నాడు గౌరి ఆ ముక్కల్ని నోట్లో బుగ్గన పెట్టుకుని నములుతూ ఆ సారాన్ని మింగుతోంది

"నువ్వు రానంటివి నేనే బలంతాన నిన్ను నాతో తొడుకునిబోతి యిన్నాళ్ళనుంచి కసి పెట్టుకుని వున్నిందో ఆ దొంగ నాయాలి పాము నిన్ను కర్సింది నీకిప్పుడెట్టుంది? సలుపులు యెక్కడం లేదుగదా? సుఁవారుగానే వుండాదిగదా"- అంటూ వెంకట్రాముడు ఆందోళనపడసాగాడు

"నాకేఁవీ కాలేదులే యిసఁవెక్కలేదు నాకు మాఁవూలుగానే వుంది నువ్వెందుకంత ఆత్రపడిపోయ్యేది? అయినా యానాది కులంలో పుట్టి పాము కాటుకు నువ్వింతగా అగడం సేస్తే ఎట్టా?" మెల్లగా నవ్వుతూ అంది గౌరి

"నన్ను సూస్తేనే పాము బయపడిపోతాది నేను పాముకాటుకు బయపడ్తానా?నన్నుగాని పాము కరిస్తే నాకు పుల్ల గుచ్చుకున్నంత లెక్క గూడా వుండదు నా బయఁవంతా నీగురించే! నీకేదన్నా అయితే నా గతి యట్టా? నాకు దిక్కెవురు సెప్పు?" అన్నాడు వెంకట్రాముడు గౌరి కళ్ళలోకి చూస్తూ

అతడా మాట అనగానే గౌరి కళ్ళల్లో కోటి నక్షత్రాల మెరుపు మెరిసింది ఆమె గుండెల మీద అమృతపు జల్లు కురిసింది పరవశంతో గౌరి మనసు వరదలా పొంగింది కేవలం ఒక్క గౌరి మనసే కాదు అటువంటి రసమయ క్షణాల్లో ప్రతి స్త్రీ మనసు క్షణ కాలం సముద్రం కన్నా మిన్నగా ఉప్పొంగుతుంది

వాళ్ళిద్దరి నడుమ ఉన్నది కొనుగోలు ప్రేమ కాదు అమ్మకాల అనురాగం కాదు కేవలం సంపాదనా పునాదుల మీద కట్టుకున్న దగుల్బాజీ అనుబంధం కాదు ఆత్మన్యూనతా భావాలతో వంచనతో మిళితమైన తుచ్ఛమైన దాంపత్యం కాదు వెంకట్రాముడికి గౌరికి మధ్యగల ఆ అనురాగం చాలా స్వచ్ఛమయినది

అనురాగంతో అల్లుకుపోయిన చూపులతో తన వేపే చూస్తున్న వెంకట్రాముడిని గౌరి ఉన్నట్టుండి చేతులు చాపి గాఢంగా కౌగిలించుకుని తన గుండెలకు బలంగా హత్తుకుంది ఎన్నో యుగాల అనంతరం తన ప్రియుడిని కలుసుకున్న ప్రేయసి మనసులా గౌరి ఆనంద డోలికల్లో వూగిసలాడింది

"నా పెండ్లాన్ని తప్పించుకుని పోయిన ఆ పాము యాడికి బోతాదో సూస్తాను అదెప్పటికైనా నా కంట్లో పడకపోతాదా? దాని సావు నా సేతుల్లో రాసిపెట్టుంది దానికి యెప్పటికైనా నేనే యముణ్ణి" అన్నాడు వెంకట్రాముడు

ఇంతలో తనను పాక బైలుపలి నుండి ఎవరో పిలవడంతో వెంకట్రాముడు బయటికొచ్చి చూశాడు అతడికి పాక ముందున్న బాలయ్య కన్పించాడు

"నీ పెండ్లాంతో పాటు నిన్ను తొందరగా బయల్దేరి వూళ్లో రాములు గుడికాడికి రమ్మని పెద్దోళ్ళంతా నాతో సెప్పి పంపించినారు" అని చెప్పేసి వెంటనే వెళ్ళిపోయాడు బాలయ్య

ఊళ్లోని పెద్దలు తననూ, తన భార్యనూ అంత అర్జెంటుగా ఎందుకు రమ్మన్నారో వెంకట్రాముడికి అంతుబట్టడం లేదు కారణం అడిగి తెలుసుకుందామనుకునే లోపలే బాలయ్య తిరిగి వెళ్ళిపోయాడు పాము కాటు తిన్న గౌరిని తీసుకుపోవడం వీలు కాదని తనొక్కడే ఊళ్లోకి ప్రయాణమయ్యాడు వెంకట్రాముడు

"గవురీ! నేను వూళ్లోదాకా పొయ్యొస్తా పెద్దోళ్లెందుకో నిన్నూ నన్నూ రాములు గుడికి కాడికి యంటనే రమ్మన్నెప్పి మనిసిని పంపించినారు పాము ముట్టిందానివి నువ్వెట్టొస్తవు? నేను వొకడే యెళ్ళి సంగతేందో తెల్సుకుని వొచ్చేస్తా"- అని గౌరికి చెప్పి ఊరి వేపు నడక సాగించాడు వెంకట్రాముడు

ఊళ్లోకి అడుగెట్టిన వెంకట్రాముడికి రాములు గుడి వరండాలో చాలా మంది గుంపుగా వుండడం కన్పించింది గౌరిని తీసుకుని రాకుండా ఒంటరిగా వస్తున్న అతడిని చూడగానే వీర్రాజుకు ఒళ్ళు మండి పోయింది ఇద్దరూ రావాల్సిందిగా చెప్పినప్పటికి అతడు తన మాటను లక్ష్య పెట్టలేదని వీర్రాజు మండి పడ్డాడు

"వొరేయ్ యంకట్రాఁవా! యిట్రారా"- అంటూ వెంకట్రాముడిని దగ్గరకు పిలిచాడు వీర్రాజు

"యేఁవన్నా! పిలిపించింది?"

"కారనం సెప్పాల్సిందేనంటావా? అయితే యినుకో యీ తూరుపు రాజ్జెంలో బతికే యానాదోళ్ల లోనంతా నువ్వు శానా సొక్కఁవైన (నిజాయితీ గల) యానాదోడివని మాకు తెల్సు యింత సొక్కఁవైన యానాదోడి యోగం యట్టుంటాదో సూద్దాఁవని పిలిపిస్తిఁవి" అన్నాడు వీర్రాజు చాలా వెటకారంగా

అతడా మాట అనగానే గుడిలో వున్నవాళ్ళంతా పగలబడి నవ్వారు వెంకట్రాముడి మనసు చివుక్కుమంది

"నా కాయకష్టం మీద నేం బతకతా వుండా వొకరింటికి కన్నం యేసినోన్నిగాదు అన్నం కోసం యింటింటికి తిరిగి అడక్క తినేటోడ్ని గాదు నాకు తెల్సినంత వొరకు నేను శానా సొక్కంగానే బతకతా వుండా వొకరి సంగతి మాత్రం నాకు తెలవదు"- వీర్రాజు కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు వెంకట్రాముడు

ఆ మాటతో పెకు నిండా నిప్పులు తెచ్చి, ఎవరో తన ఒంటిపై పోసినట్లయింది వీర్రాజుకు బోజనం వేళకు వీర్రాజు ఎవరింటికో ఒకరింటికి వెళుతుంటాడు ఎవరో ఒకరు అతనికి వేళకంత తిండి పెట్టేస్తూ వుంటారు

ఆ విషయాన్ని దృష్టిలో వుంచుకునే అన్నం కోసం యింటింటికి తిరిగి అడక్క తినేటోన్ని కాదు అని వెంకట్రాముడు యిందాకా ఆ మాట తననుద్దేశించే అన్నాడని ఎవరూ చెప్పకుండానే వీర్రాజు గ్రహించగలిగాడు ఆ సమయంలో కోపంతో ఆకాశం వేపు చూసి ఉమ్మేసినట్లయింది వీర్రాజు పరిస్థితి

"వొరేయ్! నేను యీ తూరుపు రాజ్జెంలో యెందర్నో యానాదోళ్ళను సూసుండాను అయితే నీ మాదిరి తిఁవురు (గర్వం) వుండే యానాది నాకొడుకును మాత్రం నేనియ్యారవకు యాడా సూల్లేదు రైతుల మాటంటే నీ యింటిక్కి జఁవ (ఖాతరు) లేకుండా పోయింది" అన్నాడు వీర్రాజు కోపాన్ని దిగమింగుకుంటూ

"నేను రైతుల మాటను యెప్పుడు జఁవ సెయ్యలేదో సెప్తేగదా"- వెంకట్రాముడన్నాడు

"నీతో పాటుగా నీ పెండ్లాన్నిగూడా యీ గుడికాడికి తొడుకొని రమ్మని సెప్పి పంపించినాం రైతుల మాటను జఁవ సేసే వోడవైతే నువ్వు నీ పెండ్లాన్ని తొడుకోని రాకుండా వొంటరిగా వొద్దువా? నీ పెండ్లాం అందం సూసిడెవురూ మూర్చపోరులే"- అన్నాడు వీర్రాజు చాలా హేళనగా

"దాన్ని నాగుపాము కర్సింది అందుకని అది యింట్లో పడుకోనుంది పాము ముట్టిన ఆడదాన్ని యింత దూరం నెనెట్ట తొడుకొని వొచ్చేది? మీరైతే తొడుకొనొస్తారేఁవో సెప్పండి? యానాదోడ్నిగదాని యెట్టంటే అట్ల మాట్లాడితే సరిపోతాదా?"

"యట్టంటే అట్ల నిన్ను యిప్పుడు మేఁవు యేం మాట్లాడేసినాఁవబ్బా? నీ

# గడుసులోకం —బాబు







పెండ్లాన్ని యెందుకు తీసుకొని రాలేదని అడగటం నాది తప్పంటావు అంతేగదా? అయితే పెద్ద మనుసుల్ని ఎలిపించి పంచాద మాట్లాడి నా తప్పుకు అపరాదం వెయ్యబ్బా '- చాలా నిష్టూరపోయిన వాడిలా అన్నాడు వీర్రాజు

వెంకట్రాముడు బదులు మాట్లాడలేదు

' నీ పెండ్లాన్ని పాము కర్సిన సంగతి మాకేం తెల్సు? మాకేవన్నా కలొచ్చెనా వాసనొచ్చెనా? అన్నాడు చేతులు వెటకారంగా తిప్పుతూ వీర్రాజు

' పొగులు మాటలు పనికి పంచేటు రెయ్యి మాటలు నిద్రకు పంచేటు పనికిరాని మాటల్ని కట్టిపెట్టి అసలు సంగతి మాట్లాడండి''- అన్నాడో పెద్దాయన

''వెంకట్రామా! అక్కడ నిలబడి వున్న ఆ ముగ్గురు యానాది వాళ్ళెవరో నీకు తెలుసా?'' వరండా ముందు బాగంలో నిలబడి వున్న యానాదులను చూపెట్టి ప్రశ్నించాడు గుర్నాధం

ఆ ముగ్గురి యానాదుల వేపు పరిశీలనగా చూశాడా వెంకట్రాముడు ఎక్కడా చూసినట్లు అన్పించలేదతనికి అందుకే తెలియదు అన్నట్టు పెదవి విరిచేశాడు వెంకట్రాముడు

''ఆ కుర్రోడు నీ పెండ్లాంక మొదట మొగుడు ఆ పెద్దాయన ఆ కుర్రోడి నాయన అంటే నీ పెండ్లానికి మావ'' అంటూ వాళ్ళని వెంకట్రాముడికి పరిచయం చేశాడు వీర్రాజు

''వొరేయ్ యంకట్రావా! మియానాదోళ్ళ ఆశారాలన్నీ నాకంటే నీకే బాగ తెల్సు ఆ ఆడదాన్ని పెండ్లాంగా నువ్వు యింటికి తెచ్చి పెట్టుకునే ముందు నువ్వు దాని మొదట మొగుడైన యీ కుర్రోనికి వోలి కర్సు, పెండ్లి కర్సులూ నయా పైసలతో బాటు పూర్తిగా నవ్వు కట్టియ్యాలగదా''- అడిగాడు శీనయ్య

'అవును కట్టియ్యాలి' అన్నట్టుగా తలను ఆడించాడు వెంకట్రాముడు

''మరి నువ్వెందుకు ఆ ఖర్చులన్నింటిని ఈ కుర్రాడికి తిరిగి చెల్లించలేదు?'' ప్రశ్నించాడు గుర్నాధం

ఆ ప్రశ్నకు వెంకట్రాముడు జవాబును చెప్పలేకపోయాడు తప్పు చేసిన వాడిలా తల వంచుకున్నాడు కాలి బొటన వేలితో నేల మీద రాస్తూ, మౌనంగా నిలబడిపోయాడు పరాయి మనుషుల ముందు తప్పును ఒప్పుకున్నట్టు అలా నిలబడటం వెంకట్రాముడి జీవితంలో అదే మొదటిసారి

''దాన్ని నువ్వంతగా యిష్టపడినోడివైతే దాని మొగుడికి పెండ్లి కర్సులన్నీ యిచ్చేసుండాల దుడ్లు (డబ్బులు) లేకపోతే నోర్మూసుకుని వుండాల యెండిన మోడుకు యెర్రపూలు తగిలించినట్లు సేతిలో పైసా లేని సవటకు పెండ్లాం యెందుకురా?'' అంటూ వీర్రాజు వెంకట్రాముడి పేదరికాన్ని ఎత్తిపొడిచాడు

''మి కులాచారాన్ని వదిలి నువ్వు వీళ్ళకు డబ్బులు చెల్లించకుండా అన్యాయం చేశావు న్యాయం చెప్పమని వీళ్ళు యిప్పుడు మా దగ్గరకొచ్చారు నిన్ను పిలిపించింది కూడా ఈ న్యాయం గురించి మాట్లాడడానికే అన్నాడు గుర్నాధం

''వొక తప్పు సెయ్యనేల? వొకని ముందు తలొంచుకుని నిలబడనేల? నగ్గు సెరం (రోషం) అనేవి బొత్తిగా లేకండా మనిషి యెన్నేండ్లు బతికితే యేం లాభం? ఎద్దుగా యేడాది బతకడం కంట ఆంబోతుగా ఆర్నెల్లు బతికేది మేలు థూ అంటూ వీర్రాజు వెంకట్రాముడి వేపు చూసి నేలపై ఉమ్మేశాడు

వెంకట్రాముడిని తిట్టే అవకాశం దొరికిందని వీర్రాజు నోటికొచ్చినట్లు తిట్టసాగాడు అతడు తిడుతున్న ప్రతి తిట్టూ వెంకట్రాముడి మనసును అగ్ని కణంలా తాకుతోంది అయినా తనకు యిప్పుడు కాలం కాదని వెంకట్రాముడు మౌనం వహించాడు

''మేము అడిగేదానికి సమాదానమేమి చెప్పకుండా తల వంచుకుని నిలబడితే ఎలా? మాకింకేంమి పని లేక నిన్ను అడుగుతున్నామా? గద్దించాడు గుర్నాదం

''వొదేం మాట్లాడ్తాడు నీతి లేనోడు నీతుండేవోడైతే యిట్టాంటి పన్జేస్తాడా? మీరెన్నయినా సెప్పండి యెలిక నోట్లో యేనుగు దంతాలు పట్టవు యానాదోడి జాతిలో నీతి నియమాలుండవు' అన్నాడు వీర్రాజు గొప్ప సత్యం కనిపెట్టేసినవాడిలా

రెండు క్షణాలు మౌనంగా గడిచాయి

''గవురి పెండ్లికి యీళ్ళెంత వోలిచ్చినారో, యెంత దుడ్డు కర్సుబెట్నారో అడగండన్నా ఆ కర్సులన్నీ యిప్పుడు నేనిచ్చుకుంటా'' అన్నాడు వెంకట్రాముడు గుర్నాదం వేపు చూసి

''యేంవిరా యానాదోడా! గవురి పెండ్లికి మీరెంత వోలిచ్చినారో, యెంత కర్సు పెట్నారో యిలావరిగా సెప్పండి యెంత సెప్పినా యిచ్చేస్తాడ్లే అని నోటికొచ్చినంత తప్పుడు లెక్కలు మాత్రం సెప్పొద్దు ' అన్నాడు శీనయ్య గుడి ముందు నిలబడి వున్న ముగ్గురు యానాది వాళ్ళ వేపు చూస్తూ

''యీ పొద్దు మేంవు తప్పుడు లెక్క సెప్పితే రేపు మీకు నిజం తెలిస్తే మీరు మీ యడంకాలి మెట్లతో మమ్మల్ని కొట్టకుండా వుంటారా సావి? తప్పు సెప్పనోడెప్పుడూ బాగుపడడు'' అన్నాడు యానాదివాడు రాజకీయనాయకుల విషయం విస్మరించి

''ఆ పొద్దు గౌరి పెండ్లికి మేంవెంత కర్సులు పెట్నావో అది గవురి గ్గూడా తెల్సుగదా మేవు వోలిగా యిచ్చింది రొండుంకాలు రూపాయి (రెండ్రూపాయలా యిరవై అయిదు పైసలు) యింగ వోళ్ళమ్మకి కొత్త సిరా రైకా తీసిస్తివి పెండ్లి కర్సులు కొన్ని మొత్తం కలుపుకుంటే నూటపది రూపాయలు'' చెప్పాడు యానాది యువకుడు

''ఏరా వెంకట్రామా? వాడు చెప్పింది నువ్వూ విన్నావు కదా గౌరికి యిచ్చిన వోలి, బట్టల ఖర్చు, మిగిలిన ఖర్చులూ అన్నీ కలిపి నూట పది రూపాయలట యిప్పుడు నువ్వు ఈ డబ్బును మొత్తం వాళ్ళకు వెంటనే చెల్లించాలి '- అన్నాడు

# విజ్ఞానాభివృద్ధి




# ధర్మపథం

భగవంతుడు మానవులకిచ్చిన గొప్ప బహుమతి ప్రజ్ఞ. దానివల్లనే యుక్తాయుక్త వివేకం, జ్ఞానాభివృద్ధి కలుగుతాయి. మానవాభ్యున్నతి దానివల్లనే సాధ్యమవుతుంది. మానవాభివృద్ధికి అనుగుణంగానే భగవంతుడిలా ఏర్పాటు చేసినట్లు గ్రహించాలి. మన చరిత్రను బట్టి చూస్తే రాతియుగంనాటి మానవుడు

ఇతరములైన వస్తువులనూ, ప్రాణులనూ తనకై ఉపయోగించుకొని

క్రమాభివృద్ధిని పొందుతున్నాడు. అనాగరిక దశ నుంచి నాగరికతతో ముందంజ వేసి, తన తెలివితేటల వల్ల తన సౌకర్యాలను పెంచుకొంటున్నారు నేలపయి అతి వేగంతో ప్రయాణం చేసే సాదనాలను సమకూర్చుకొనడమే కాకుండా గగనంలో కూడా ప్రయాణం చేయగలుగుతున్నాడు చంద్ర మండలంలో ప్రవేశించాడు దూర శ్రవణం, దూర దర్శనాలను సాదించాడు

ఈ విదంగా తన విజ్ఞానాన్ని అనుక్షణమూ అబివృద్ధి చేసుకొనుటకే సర్వదా, సర్వవిదాలా ప్రయిత్నిస్తున్నాడు

విజ్ఞానం అబివృద్ధి పొందుతున్నందుకు సంతోషించ వలసనదే! అది సౌకర్యాలను ఎక్కువ చెయ్యడం ప్రశంసనీయమే! ఇది మానవాభ్యుదయానికి సహకరిస్తున్నది ఆ రీతిగానే మానవుల విధ్వంసక చర్యలకునూ సహకరిస్తున్న సంగతి అందరికీ తెలుసు దీని దుర్వినియోగం అనేక ఉపద్రవాలకు దారితీస్తున్నది సర్వమానవ శ్రేయస్సు నాగరికులు కోరదం దర్మం విజ్ఞానాన్ని అభ్యుదయానికే ఉపయోగించాలి గాని అటః పతనానికి ఉపయోగించకూడదు ఈ విజ్ఞానం వల్ల సంపాదించిన అణుశక్తి అభ్యుదయ సాదనాలకంటే మారణాయుదాల నిర్మాణానికే ఎక్కువ ఉపయోగింప బడుతున్నట్లు అనుకోవలసివస్తున్నది విజ్ఞానవంతులు తమ విజ్ఞానాన్ని సద్వినియోగం చేసి మానవాభ్యుదయానికే సర్వవిదాలా తోడ్పడుటయే మానవధర్మం ఉత్తమ ధర్మం

-బులుసు వేంకట రమణయ్య

# సర్పయాగం

గుర్నాథం.

అది వినగనే వెంకట్రముడి గుండెలు దడదడలాడాయి కారణం నూట పది రూపాయలంటే వాడికది వేయి రూపాయలతో సమానం ప్రస్తుతం అడి దగ్గర అంత డబ్బు లేదు నాగుపాముల చర్మాలను సంతలో అమ్మగా వచ్చిన డబ్బు కొంత వెంకట్రాముడి దగ్గర వుంది

అయితే అది సరిపోదు అదంతా కలిసి డెబ్బయి రూపాయలుంటాయి మరో నలభై రూపాయలు కావాలి అంత డబ్బు యిప్పుడు తనకెవరిస్తారు? ఎవరిదగ్గర అప్పు దొరుకుతుంది? వెంకట్రాముడు ఆలోచనల్లో పడిపోయాడు

నువ్విప్పుడు ఆ డబ్బు మొత్తం తెచ్చి యీళ్ళకు యియ్యకపోతే నువ్వు నీ పెండ్లాన్ని యింట్లోంచి యిప్పుడే బయటకు పంపించెయ్యాల కనుక నువ్విప్పుడు వాళ్ళ కర్చుల మొత్తాన్ని వాళ్ళకు సెల్లిస్తావో లేక నీ పెండ్లాన్ని వొదులుకుంటావో యేదో వొకటి నువ్వే నిర్నయించుకో అన్నాడు శీనయ్య

గౌరి కోసం వంద రూపాయలే కాదు వెయ్యి రూపాయలైనా యివ్వడానికి వెంకట్రాముడు సిద్ధమే డబ్బుకు బయపడి గౌరిని వదులుకునే స్థితిలో వెంకట్రాముడు లేడు

సరే ఆ కర్చులన్నీ నేను సెల్లించేస్తాను మా యింటికెళ్ళి దుడ్డు తీస్కొని యిప్పుడే వొస్తాను అంటూ అక్కడి నుండి వెంకట్రాముడు బయలుదేరాడు

తన పాకకు చేరుకున్న అతడు గౌరికి జరిగిన తతంగం గురించి చెప్పి దొంతిలో దాచి పెట్టిన డెబ్బయి రూపాయల్ని తీసుకున్నాడు పక్క గుడిసెలో వున్న నర్సయ్య వద్దకు వెళ్ళి ఆ తతంగం గురించి ఆయనకు కూడా చెప్పి నలభై రూపాయలు అప్పుగా తీసుకుని తిరిగి వూళ్ళోకి వెళ్లాడు వెంకట్రాముడు

(ఇంకా ఉంది)

# భారతి

సాహిత్యాభిమానులకు చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు 48

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు 51

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు 40 చందా మొత్తాన్ని ఆంధ్రపత్రిక (గాందినగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చంధా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




---

నేను భారతి మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను చందా పైకము రు 40 డి డి / ఎం ఒ ద్వారా పంపుతున్నాను

పేరు ______________________

చిరునామా ______________________

______________________

చందాదారుని సంతకం

# రిటైర్మెంట్

కె.వి.వి. సత్యనారాయణ రాజు

అప్పటికే తను పెట్టిన శెలవు కరిగిపోవడంతో పెళ్ళైన తరువాత హానీమూన్‌కుగాక బార్య అనుపమతో సహా తనుద్యోగంచేసే ఊరికి ప్రయాణమయ్యాడు శ్రీకాంత్

చేసేది మూడో తరగతి ఉద్యోగమైనా ఒకటో తరగతి ఉద్యోగిలా ప్రవర్తించడం - ఉద్యోగంలో చేరినప్పట్నుంచీ అతణ్ని పట్టి పీడిస్తున్న అలవాటు. ఆఫీస్‌లోనే కాకుండా ఇంటా బయటా కూడా తన దర్పాన్ని నిత్యమూ చాటుకుంటూ తృప్తిపడడం అతడి బలహీనత ఎదుటివాడు తొడుక్కున్న విమల్ సూటు ఖరీదులో మాత్రమే గొప్పదనీ తనవంటిమీదుండే ఖద్దరు బట్టలు సౌకర్యం దృష్ట్యా వెలకట్టలేనివని తరచూ ఎదుటివారిని నమ్మించడానికి కృషి చేస్తూండడం అతడి కాలక్షేపాల్లో ఒకటి మాత్రమే!

వందసార్లకు తక్కువ గాకుండా పెళ్ళిచూపుల్లో నటించి ఆ అనుబవంతో తన కెంత దర పలుకుతుందో ఒక నిర్ణయాని కొచ్చాక ముప్పైసార్లు రాయబారాలు జరిపి ఈధరకు ఒప్పుకోకపోతే ఇహ ఈ జన్మకు పెళ్ళి కాదేమోనని నిశ్చయించుకొని అయిష్టంగానే వాళ్ళిస్తామన్న కట్నానికి ఒప్పుకొన్నట్టు మొహం పెట్టి పరిచయస్తులతో తనకు కట్నంమీద పెద్దగా మోజు లేదని వాళ్ళడక్కపోయినా చెప్పుకొని పద్ధి రోజులక్రితం అనుపమ మెళ్ళో తాళి కట్టాడు శ్రీకాంత్

కట్నం తీసుకొనే మగాణ్ని పెళ్ళి చేసుకోనని అనుపమ ఎవరితోనూ అనలేదు సరికదా తన మనసులో కూడా ఎప్పుడూ ఆ ఊహకు తావివ్వలేదు, కన్నారు కాబట్టి పెళ్ళిచేసే బాధ్యత తల్లిదండ్రులదే! అని అనుకొనే వాళ్ళల్లో ఆమెకూడా ఒకర్తె

అందుకే పెళ్ళికి ముందు కట్నం గురించి జరిగిన రాయబారా లామె దృష్టికి వచ్చినా ఇంటర్వ్యూకి ఎటెండ్ అయిన నిరుద్యోగి యువకుడు తన సామర్థ్యానికి పలితంగా ఉద్యోగం వస్తుందనే నమ్మకం కోల్పోయి తండ్రి ఏదో రకంగా అప్పో సప్పో చేసి తనకా ఉద్యోగం వచ్చేలా చూడగలిగితే అదే పదివేలని రోజూ గుబగుబలాడే గుండెలతో ఎపాయింట్‌మెంట్ ఆర్డర్ కోసం ఎదురు చూసినట్టుగా పెళ్ళి ముహూర్తం ఎప్పుడు పెట్టిస్తారోనని ఆలోచించడం ఓ దినచర్యగా మారింది అనుపమకు పెళ్ళి చూపులయిన మర్నాటినుంచీ

ఆ శుబ కార్యం కాస్తా జరిగాక పెళ్ళికి ఎరువు తెచ్చిన నగలు స్వంతదారులకు అందజేసి కన్నెతనపు కోరికలతో భర్తతో ప్రమాణమయింది ఊరికి చేరేవరకూ వివరిస్తూనే ఉన్నాడు శ్రీకాంత్ తన గొప్పదనం గురించి - అతడంటే వాళ్ళ ఆపీసర్ కెంత ఇష్టమో, తోటి ఉద్యోగుల కెంత గౌరవమో క్రింది ఉద్యోగుల కెంత బయమో, ఇరుగు పొరుగుల కెంత ఆప్యాయతో!

అవన్నీ విన్నాక అనుపమ మనసు ఆనందంతో పరవళ్ళు తొక్కింది అతడికి బార్య కావడం కోసమే బహుశః ఇంతకుముందు జరిగిన పెళ్ళి చూపులు ఫలించి ఉండవని సంతోషపడింది గతంలో జరిగిన పెళ్ళిచూపులు పెయిల్ కావడానికి కారణం కట్నమేనని ఓ వైపు మనసు గుర్తు చేస్తున్నా

భర్తతో సహా ఇంటికి చేరిన అనుపమకు ఆ ఇంట్లో ఏ ప్రత్యేకతా కనబడకపోయినా ఇంటికి కావల్సిన హంగులు సమకూర్చడానికి తానెంత కష్టపడ్డాడో తనక్కాబోయే బార్య కోసం ఏ యే సౌకర్యాలు ఏర్పాటు చేశాడో భర్త వివరించాక అతడి సామర్థ్యంమీద అబిమానం కలిగి ఇల్లంతా తిరిగి చూసుకొంది తృప్తిగా

ఇంటి ఆవరణలో క్రమ పద్ధతిలో నాటబడిన పూల మొక్కలను చూపించి పువ్వులంటే నీ కిష్టమని నేనే వేశానివన్నీ! అన్న భర్త వైపు మురిపెంగా చూసిందే తప్ప, పెళ్ళికి ముందు తన మొహం చూడ్డం మినహా తనకు పువ్వులంటే ఇష్టమనే విషయాన్ని తెలుసుకోడానికి భర్త కెంత అవకాశం ఉందో ఆలోచించలేదామె ఆడమనసు

కొన్ని రోజులు గడిచాక వాళ్ళాఫీసులోని ఉద్యోగులందరూ ఒక ఉద్యోగికి ప్రమోషన్ వచ్చిన సందర్భంలో పార్టీ ఏర్పాటు చేసిన రోజు ఇంటి కొచ్చి గర్వంగా అన్నాడు శ్రీకాంత్ పెళ్ళికి ముందు ఇటువంటి పార్టీలు మిస్ అయ్యేవాణ్నికాదు కానీ నువ్వొచ్చాకా కూడా అటువంటి పార్టీల్లో పాల్గొని తెల్లవార్లూ తాగి తందనా లాడాలంటే ఎందుకో నీమీద ఉన్న ప్రేమ నన్ను నీ దగ్గరే గడపమంటోంది ఏదో పెళ్ళిగాకముందు అలా రాత్రీ పగలూ లేకుండా తిని తిరగడాన్ని కొంతవరకూ ఒప్పుకోవచ్చేమో కానీ మా కొలీగ్స్‌లో మరో రెండు మూడేళ్ళలో రిటైర్ అయ్యే వాళ్ళతో పాటు, నిన్నగాక మొన్న పెళ్ళయిన వెధవలు కూడా పెళ్ళాలిళ్ళ దగ్గర ఎదురు చూస్తుంటారన్న కనీసజ్ఞానం లేకుండా ప్రవర్తించడం నా కెందుకో నచ్చదు అనూ!

అనుపమ దృష్టిలో భర్త ఎంతో ఎత్తు ఎదిగిపోయాడు

మరోరోజు పక్కింటి నారాయణ పెళ్ళాన్ని కాపురానికి తీసుకొచ్చిన రోజే ఇల్లు పెళ్ళానికి వప్పజెప్పి ఆ రాత్రంతా ఆఫీస్‌లో పెండింగ్ ఫైల్స్ చూడడంలో గడపడాన్ని రసవత్తరంగా వర్ణించాడు. తనెప్పుడూ పని పెండింగ్ ఉంచడనీ, తను పని విషయంలో సిన్సియర్ కావడంవల్లే ఏ రోజూ ఆఫీసర్ తనని ఆఫీస్ టైమ్ దాటాక పని చేయమని ఆజ్ఞాపించడం కాదు కదా, కనీసం అభ్యర్థించను కూడా లేదని చెప్పాడు.

ఒంటరి మనస్తత్వం గల వాళ్ళకేమో గానీ, తాము పొందిన ఆనందాన్ని తమలోనే దాచుకోవడం సామాన్యులకు సాధ్యం కాదు కదా? అందుకే భర్త మాటల ద్వారా తను పొందుతున్న ఆనందాన్ని నారాయణ భార్యకుకూడా పంచితేనే గాని తన తట్టుకోవడం కష్టమనిపించి ప్రతి రోజూ తన భర్త గొప్పలు సుజాతకు చెప్పేది ఆమె తను అనుపమ ద్వారా విన్న మాటలు యదాతథంగా భర్తతో చెప్పడం అప్పట్నుంచీ ఓ అలవాటుగా మారింది సుజాతకు

భర్తతో మొదట్లో మామూలుగానే చెప్పినా తరువాత త్వర్వాత 'ఆ శ్రీకాంత్‌ను చూసైనా నేర్చుకోరాదూ పెళ్ళాన్నెలా ప్రేమించాలో? అనే బావం అంతర్లీనంగా వ్యక్తమయ్యేది పక్కింట్లోకి వాళ్ళు రాక ముందు తన భర్తలాంటి వ్యక్తి ఏ ఆడదానికైనా భర్తగా లబించడం కంటే అదృష్టమేముంది? అని అప్పట్లో బావించిన సుజాత మాటల్లో

బార్య చెప్పే సోది వినడం, భర్త విద్యుక్త ధర్మాల్లో ఒకటని గాడంగా నమ్మే నారాయణ క్రమంగా బార్య మాటలు సోది స్థాయి నుంచి దెప్పడం అనే స్థితికి చేరుకున్నామనిపించడంతో కొంచెం కలవరపడ్డాడు

సైన్సులో డిగ్రీ సంపాదించుకోవడం కోసం తను చదువుకున్న న్యూటన్ గమన సూత్రాల్లోని మూడో దాని ఉపయోగ మేమిటని అప్పట్లో మధనపడ్డ నారాయణకు దాని ఉపయోగాన్ని ఆచరణలో పెట్టే అవకాశం వచ్చింది

తత్ఫలితంగా మర్నాటినుంచీ కేవలం అనుపమ చెప్పే మాటలు విని తలూపడం తప్ప ఏమీ చేయని సుజాత తను చెప్పే మాటలు కూడా అనుపమ వినే రీతిలో సంబాషించడం ప్రారంబించింది

రోజూ తను చెప్పే మాటలు విని తలూపే సుజాత గత కొద్ది రోజులుగా తను చెప్పే విషయాలకు విరుద్ధమైన మాటలు చెప్తూండడంతో తట్టుకోలేక ఒక రోజున భర్తను అడిగింది అనుపమ మీ ఆఫీసర్‌కు మీరంటే ఇష్టం లేదటగా! అందుకే ఏమాత్రం బరువు బాధ్యతల్లేని పెద్దగా తెలివి తేటలు చూపించే అవకాశం లేని సీట్లో మిమ్మల్ని పడేశాట్ట, అవునా?

శ్రీకాంత్ కిది షాక్! ఇన్నాళ్ళూ అతడికి యాక్ట్ చేయడం తప్ప కౌంటర్ యాక్షన్ ఎలా ఉంటుందో అనుబవంలోకి రాలేదు

అనుపమ అక్కడితో ఊరుకోకుండా పెళ్ళి గాక ముందు మీ ఆపీస్‌లో ఓ అమ్మాయితో చనువుగా ఉండేవారట నిజమేనా?! అంది

నువ్వే చెప్పు అతని భుజాలు పట్టుకుని ఉద్వేగంగా వూఎంది సరోజ

నీ మాటల నేర్పుతో నన్ను మూగవాణ్ని చేస్తున్నావు సరెతె నేను వెళ్లమన్న పేరి అండ్ కొ కి వెళ్లావా? అడిగాడు రవి

ఊ॰ అక్కడ కూడా నా దురదృష్టమె నన్ను వెంటాడింది ఇహ ఉద్యోగమొస్తుందన్న ఆశ నాకు తెదు

నువ్వు మరి దిగాలుపడిపోకు ప్రయత్నిస్తే సాదించతెనిదేది వుండదు

పద పోదాం చీకటిపడుతోంది తెచాడు రవి

సరోజ యాంత్రికంగా అతణ్ని అనుసరించింది

## 5

గోడ గడియారం టంగ్ టంగ్‌మంటూ పదిగంటలు కొట్టింది

రోజూ గంట తెటుగా వచ్చే జోగినాదం ఆ రోజు అరగంట ముందే ఆపీసుకు రావడం విశేషం

ఇంకా స్టాప్ ఎవరూ రాతెదు

మేనేజరు ఆ వేళ ఎందుకో చాలా ఎర్లీగా వచ్చి తన రూములో కూర్చుని పైల్సు చూస్తున్నాడు

జోగినాదం ఆ ఆపీసులో సీనియర్ క్లార్క్ వయసు నలభై ఐదేళ్ళుంటాయి ఎప్పుడూ సంఎల్‌గా వచ్చే జోగినాదం ఆ రోజు పేంటు షర్ట్ టక్ చేసుకుని బూట్లు చప్పుడుతో హుందాగా అటూ ఇటూ తిరుగుతూ వుంటే తికమకపడ్డాడు మస్తాన్

మస్తాన్ మరెవరో కాదు ఆ ఆపీసు బంట్రోతు మేనేజరుకు కుడి భుజంలాంటి వాడు

నువ్వీ రోజు నా డ్రాయరు శుభ్రంగా అద్దంలా తుడవాలోయ్ ప్యూన్ని ఉద్దేశిస్తూ అన్నాడు జోగినాదం

అతని మాటంకు మరింత ఆశ్చర్యపడ్డాడు మస్తాన్ క్షణం గట్టిగా ఆలోచించాడు వాడి మెదడు పాదరసంలా పనిచేయసాగింది ఆవలి[illegible] పేగులు లెక్కపెట్టేపటం అంతే జోగినాదంలో మార్పుకి కారణంకనిపెట్టేసాడు

నమస్కారం జోగినాదంగారూ! ఆఎసులో కడుగుబెడ్తూ విష్ చేసాడు వామనరావు

వామనరావు జోగినాదం కంటే జూనియర్ ఇంకా పెళ్ళి గిళ్ళిలాంటివేం కాలేదు

ఎమిటో యీ తెల్లవారకుండానే ఆఫీసుకొచ్చేసావు? ఏమిటి కత?

జోగినాదం మాటలకు నవ్వుతూ

అదే నేనూ అడగాలనుకుంటున్నాను సార్ ఎన్నడూ తెనిది తమరి రోజు పెళ్ళికొడుకులా ముస్తాబైనాకంటి ముందొచ్చి

అతడి మాటలు పూర్తికాకుండానే అందుకొని నోర్ముయ్యవోయ్ కుర్రకుంకా అన్నాడు జోగినాదం వెటకారంగా



అదికాదు సార్ తమరి వయసులో ఏదో అనబోయాడు వామనరావు

నా వయస్సుకేమోయ్ మహా వుంటే

అబ్బో ఎంతో వుండదు నా కంటే పదేళ్ళు చిన్న వ్యంగ్యంగా పలికాడు వామనరావు

అలా అని మరి పాపాయిని చేయకోయ్ మొన్ననేగదా నాలుగో పదిలో పడ్డాను

సరేలెండి ఇంతకూ విషయం చెప్పారు కాదు వూరుకోకుండా మళ్ళీ కూపి

## కాల్ గర్ల్

లాగడానికి ప్రయత్నించాడు వామనరావు

విషయానికేముంది ఈ రోజు లగాయతూ మనమందరం ట్రిమ్‌గా తయారై నీటుగా రావాలి హాటు హాటుగా కొత్త కార్యక్రమాలు చేపడుతూ పాత పద్ధతులకు స్వస్తి చెప్పాలి మన సంస్థ గౌరవమర్యాదలు కాపాడుతూ దానికి పేరుప్రతిష్టలు తేవడానికి ప్రయత్నించాలి దాదాపు ఉపన్యాసమిస్తున్నట్లుగా అన్నాడు జోగినాదం

అసలు సంగతి దాటవేస్తున్నారు

పాలకొచ్చి ముంత ఎందుకోయ్ దాస్తావ్? నీ వేషాలునా దగ్గరా?

అమాయకంగా ముఖం పెట్టాడు వామనరావు

అదేనోయ్ నీకు తెలుసునో తెలీదో ఇవాళ మన ఆపీసులో కొత్త లేడి టైపిస్టు రాబోతుంది

ఓహో అదా సంగతి ఐతే

ఐదే గియితే ఎమిటి ఈ కాలం కుర్రాళ్లకు రొమాన్సు బొత్తిగా తెలీదు మెల్లగా గొణుక్కున్నాడు జోగినాదం

రొమాన్సా బారెడు నోరు తెరిచాడు వామనరావు

అదేనోయ్ అవర్ లేడి టైపిస్టు ఈజ్ యంగ్ అండ్ అన్ మేరిడ్ పెయిర్ అండ్ లౌలీ నిన్ననే ఎపాయింట్ చేసారు

అలాగా

అంచేత మనం ఇప్పుడేం చేయాలో తెలుసా?

ఉ హు బుర్ర అడ్డంగా త్రిప్పాడు వామనరావు

ఇద్దరం ప్రయత్నిద్దాం ఎవరి వలలో నైనా పడకపోతుందా?

పెద్దవారై వుండి అవేం మాటలండి ఇన్నాళ్లకు మన కార్యాలయంలో మరో తెలుగు ఆడబడుచు అడుగుపెడుతూ వుంటే హారతి పట్టి ఆశీర్వదించ డానికి బదులూ

ఊఁ ఆశీర్వదిద్దాం మన చేయి దాటి పోకుండా వుంటే సగంలో అందుకున్నాడు జోగినాదం

ఎవండోయ్ వచ్చేస్తున్నట్టుంది హామనథావ్ కంఠంలో గాబరా ధ్వనించింది

ఎవరోయ్ కుతూహలంగా గేటు వైపు చూసాడు

అదేనండి మీరన్న ఆ లేడి టైపిస్టే

ఎమిటీ వచ్చేస్తోందా నా సీతాకోకచిలుక ఆఎసు తెరవకుండానే నా వన్నెల విసనికర్ర వచ్చేస్తోందన్న మాట కళ్లజోడు సవరించుకుంటూ మరింత ఉత్సుకతతో చూసాడు జోగినాదం




సరోజ వయ్యారంగా హేండ్‌బేగ్ తిప్పుకుంటూ లోపలకొచ్చింది

గుండ్రటి ముఖం చిక్కని తెలుపు ముత్యాల్లాంటి పలువరుస చిన్ని నోరు నల్లని జుట్టూ ఎ అవయవానికా అవయవం తీర్చిదిద్దినట్టున్న ఆమె శరీరం జోగినాదం కళ్లకు ఒక్క రబ్బరు బొమ్మలా అనింది

అందరికంటే ముందుగా పలుకరించి పరిచయం చేసుకోవాలని ఆమెకెదురు వెళ్లాడు

ఆమె అతడిని గమనించనట్లు సరాసరి మేనేజరు రూములో కెళ్లింది

చిన్నబోయిన ముఖంతో తన సీట్లో కెళ్లి కూర్చున్నాడు

సరోజ అందచందాల్ని చూసిన వామనరావుకు కూడా మతిపోయినట్లైంది గుడ్లప్పగిస్తూ ఆమె వెళ్లిన వంకే చూస్తూ వుండిపోయాడు

కొంతసేపు మౌనంగా వున్న జోగినాథం వామనరావుతో అన్నాడు ఇది పొద్దంతా అక్కడే గడిపేలా వుంది అతడి ముఖంలో చిరాకు చేతికందిన వస్తువు దూరమైపోయినప్పుడు కలిగే బాధ ప్రస్ఫుటితమౌతున్నాయి

తొందరపడకండి జోగినాదంగారూ వస్తుంది కాస్సేపు వోపిక పట్టండి మీరు మరి కుర్రాళ్ళైపోతున్నారు అన్నాడు వామనరావు అతని అధుర్దాను గమనిస్తూ

అది కాదోయ్ నా బాధ

మరైతే ఇప్పుడొచ్చిపడిన ఇబ్బందేమిటని?

ఆ మేనేజరుకుగాని ఈ పాల ఎట్ట మీద మనసు పడిందో ఇక మనం పెదిమ విప్పడానికి వీలుండదు

మానేజరు అలాంటివాడు కాదండి లెటర్స్ ఏమైనా డిక్టేట్ చేస్తున్నాడో యేమో

ఏడిసాడు అసలీ అమ్మాయిని పనికోసమే పెట్టుకున్నాడంటే నాకెందుకో నమ్మబుద్ధి కావడంలేదు ఎందుకైనా మంచిది వాడేం చేస్తున్నాడో ఆ తలుపు సందులోంచి చూడు

అది సభ్యత అనిపించుకోదండి బుద్ధి చెబుతున్నట్లుగా అన్నాడు వామనరావు

వెళ్లవోయ్ నీకంత సిగ్గైతే నేనే వెళ్లి చూస్తాను తలుపు సందులోంచి తొంగి చూసొచ్చి నువ్వన్నది కరక్టేనోయ్

అంతలో మస్తాన్ అక్కడకొచ్చి అయ్యా! మిమ్మల్ని సీట్లో కూర్చుని పనిచేసుకోమంటున్నారు మేనేజరుగారు అన్నాడు అతన్ని ఆట పట్టించాలని

ఈ గడుసుపిండం తన చేష్టలు గమనించి వుంటాడు వెదవకు మరేం పని ఇంతకీ వాడినని ఎం లాభం? ఆ మేనేజరుగాడికుండాలి కొండంత అలుసిచ్చి నెత్తికెక్కించుకుంటున్నాడు అని నాలుగు తిట్లు మనసులోనే తిట్టుకుంటూ తెలుసులేవోయ్ నీ పనేదో నువ్వుచూసుకో తన సీట్లోకెళ్లిపోయాడు జోగినాదం

వామనరావు కూడా అతని సీట్లోకొచ్చి కూర్చున్నాడు మరి మారు మాట్లాడకుండా

మరో ఐదు నిముషాలలో సరోజ నోట్ పుస్తకంతో బయటకొచ్చి తిన్నగా తన సీట్లోకెళ్లి టైపు చేయడానికి మిషను మీద కాగితమెక్కించింది

అదే మంచి అదుననుకుని జోగినాదం లేచి ఆమె దగ్గరకు వెళ్లబోయాడు

జోగినాదంగారూ! మిమ్మల్ని అయ్యగారు రమ్మంటున్నారు అన్నాడు మస్తానొచ్చి

వీడికి మరేం పనిలేదు సమయం సందర్భం అంతకన్నా లేదు చిరాకుపడుతూ లోనికెళ్లాడు

ఇదే మాంచి సమయమనుకుని ఆమె వద్దకు వెళ్లబోయిన వామనరావు మస్తాన్‌ను చూసి ఆ ప్రయత్నం విరమించాడు

ప్యూను ఏదో ఫైలు తెచ్చి అతని బల్లమీద వుంచి వెళ్లిపోయాడు

అంతలో కళ్లజోడు సర్దుకుంటూ జోగినాదం బయటకొచ్చాడు

అతని ముఖం చూడగానే మేనేజరు బాగా చీవాట్లు పెట్టినట్టుంది అనుకున్నాడు వామనరావు

అరగంట తర్వాత ఆపీసులో ఎవరూ లేకపోవడం చూసి వామనరావు జోగినాధం కలిసికట్టుగా సరోజ దగ్గరకెళ్లి చెరో వైపూ నిలబడ్డారు



# తల్లి పాలు బిడ్డకు అన్నిటికీ మించిన పోషకాహారమేకాక ఎంతో మానసిక సంతృప్తిని కూడా కలుగచేస్తాయి

తల్లి పాలు తాగటం వలన మాతా శిశువుల ఆత్మానుబంధం ఎంతో దృఢతరమవుతుంది తల్లి ప్రేమను బిడ్డకు పంచి పెట్టేందుకు యిదే ప్రకృతి సిద్ధమైన పద్ధతి శిశువు సంతోషంగా సంతృప్తిగా పెరిగేందుకు దోహద పడుతుంది

కేవలం తల్లిపాలు మాత్రమే బిడ్డకు కావలసిన పోషకాహారాన్ని సమపాళ్ళలో అందించ గలుగుతాయి



మీ బిడ్డను మీ చనుపాలతోనే పెంచండి అదే ప్రకృతి నిర్దేశించినది, మీ శిశువుకు కావలసినది

కాని ఏదైనా అనుకోని ఇబ్బంది వచ్చినపుడు అంటే ఏదైనా జబ్బు చేసినప్పుడో పాలు సరిపడనప్పుడో విజయ స్ప్రేను వాడండి – చక్కగా పరీక్షించబడిన నమ్మకమైన శిశు ఆహారం. మీ బిడ్డ ఆరోగ్యం కాపాడడానికి డబ్బా మీద వ్రాసిన సూచనలను క్షుణ్ణంగా చదివి, అమలు పెట్టండి.

శిశు సంరక్షణ కొరకై, విజయ స్ప్రే తయారీ దారులైన
ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య వారిచే విడుదల చేయబడినది

## కాల్ గర్ల్

వారి వంక అయోమయంగా చూసింది సరోజ

నా పేరు జోగినాదం ఈ ఆఫీసులో సీనియర్ క్లర్కుని

నమస్కారం అందామె అప్రయత్నంగా లేచి నిల్చుని

పనిలో మీకేమైనా డౌట్సుంటే నిరభ్యంతరంగా నా దగ్గరకు రావచ్చు మొహమాటమేమి పడకండి మీకన్నీ నేర్పుతాను

అలాగే నవ్వుతూ అన్నది సరోజ

మరి నా గురించి చెప్పాలంటే చాలా వుంది నా పేరు వామనరావు వయసు ఇరవై నాలుగు హైట్ ఐదుపాయింటేడు చెస్ట్ ముప్పైమూడు సినిమాలు చూడడం హాబీ ఇంకా పెళ్ళికాలేదు స్టూడెంటు టీచరుకు పాఠం అప్పజెప్తున్నట్లు అన్నాడు వామనరావు

మళ్ళీ నమస్కారం అందామె మరింత వినయంగా

ఊరుకోవోయ్ పెళ్ళికాకపోవడం కూడా ఒక పెద్ద క్వాలిఫికేషనులా చెబుతున్నావు అన్నాడు జోగినాదం ఇంటర్వ్యూలో ఫెయిలయిన అభ్యర్థిలా ముఖంపెట్టి

అతడి మాటలతో తనపైగల అక్కసును గ్రహించిన వామనరావు మరి ఉన్నవన్నీ చెప్పాలి గదండి ఇహపోతే నేనేయినకంటే జూనియర్ని అలా అని నన్ను మరి అండరెస్టిమేట్ చేయకండి మీకే సహాయం కావాలన్నా సంకోచించకుండా నా దగ్గరకొచ్చేయండి అన్నాడు నవ్వుతూ

అలాగే మరి మీరు వెళితే నా పని చూసుకుంటాను అంది కుర్చీలో కూర్చుంటూ

ఆమె మాటలలో చిరాకు గ్రహించి అలాగే వస్తాం ఇక్కడే వుంటాం కదా మళ్ళీ కలుసుకుందాం తర్వాత తీరిగ్గా అన్నీ ముచ్చటించుకుందాం అంటూ అక్కడ నుండి వెళ్ళిపోయారు జోగినాదం వామనరావు

వాళ్ళ సంభాషణతో విసుగు చెందిన సరోజ కర్చీఫ్‌తో ముఖం అద్దుకుని ఎదో జ్ఞాపకమొచ్చిన దానిమల్లే మేనేజరుండే గదిలోకెళ్ళింది

మళ్ళీ లోపలకెళుతుందోయ్ కుర్చీలోంచి సగం లేస్తూ అన్నాడు జోగినాదం

జాస్ కాల్ చేసాడేమో

"అది కాదోయ్ నా బాధ ఆప్యాయంగా రమ్మన్నా మన దగ్గర టిక్కు చేస్తోంది వాడు ఎలవకుండానే పరుగులు తీస్తోంది

మిమ్మల్ని నన్ను పట్టుకుంటే దానికొరిగేదేముంది? మానేజర్ని మంచి చేసుకుని వాడి కనుకూలంగా మసలుకుంటే మంచి జీతం మీద ఎ ఎ గా ప్రమోట్ చేయొచ్చు

వామనరావు మాటల్లోని నగ్నసత్యాన్ని గ్రహించిన జోగినాదం బాగా చెప్పావు మగాడికి ప్రమోషను కావాలనుకుంటే ఆమ్యామ్యా ఆడదానికైతే శీలం సమర్పించుకోవలసిన పాడు రోజులొచ్చి పడ్డాయి ఎం చేస్తాం? అన్నాడు విరక్తిగా

* * * *

సరోజ ఆ ఆఫీసులో చేరి రెండు నెలలయింది జోగినాదం వామనరావు ఒకరికొకరు పోటీగా ఆమెను ఆకర్షించాలని ఆమె మనసు దోచుకోవాలని విశ్వప్రయత్నాలు చేశారు కాని ఆమె ప్రవర్తనలో మార్పు రాకపోయేసరికి కోపం కూడా వచ్చింది వాళ్ళకి

ఒక రోజు సరోజ మేనేజరు డిక్టేట్ చేసిన లెటర్స్ టైపు చేద్దామని మిషిను దగ్గరకు వచ్చింది

జోగినాదం ఆమె దృష్టిని తన వైపు మళ్ళించే ప్రయత్నంలో ఆమెనో మారు వోరగా చూస్తూ చిన్న దగ్గు దగ్గాడు

అతని చేష్టలకు కొర కొరా చూసింది సరోజ అది గమనించిన జోగినాదం జోరుగా ఫైలు చూడడం మొదలుపెట్టాడు

సరోజగారూ! వామనరావు పిలుపుకు టైపు చేయడమ్మాపి ఎందుకన్నట్లుగా అతని వైపు చూసింది

వామనరావు కించిత్ తత్తరపాటు పడుతూ అదేనండి మీ దగ్గరకొచ్చి ఎవేవో చెప్పాలనుకుంటాను తీరా మీ ముఖం చూసాకా ఎమి చెప్పలేక పోతున్నాను

చాలా చిత్రంగా మాట్లాడతారే అందామె నవ్వుతూ

ఆ మాటలకు పొంగిపోతూ ఐతే నేను మీకు నచ్చానన్న మాట అన్నాడు వామనరావు రసిమని

ఆ జోగినాదం కంటె కాస్త బెటర్

అతనికి నాకూ పోలికేమిటండి నక్కకూ నాగలోకానికంత తేడా వుండదూ!

వామనరావ్" వాళ్ళు సంభాషించుకోవడమిష్టం లేనట్లు గట్టిగా పిలిచాడు జోగినాదం

అయ్యా!

నీ సీటు వదిలేసి ఆవిడతో హస్కేమిటి? డోంట్ పర్ గెట్ దట్ ఇట్ ఈజ్ ఆఫీస్

వామనరావు గట్టిగా అబ్బే మరేం లేదు సార్ సరోజకేవో డౌట్సుంటే క్లారిఫై చేస్తున్నాను అంటూ కాస్త తగ్గు స్వరంలో చూసారా వాడి ఉడుకుబోత్తనం మనమేదో మాట్లాడేసుకొంటున్నామేమోనని తెగ బాధపడి పోతున్నాడు అన్నాడు నిష్ఠూరంగా

డౌట్స్ క్లియర్ చేసావా? మళ్ళీ గట్టిగా గావుకేకపెట్టాడు జోగినాదం

అప్పుడే ఎక్కడ? కొంపలు మునిగిపోతున్నట్లు తమరు ఎలిచేస్తున్నారుగా

వామనరావుగారూ! మీకు పనేమి లేకపోవచ్చు నాక వతల అర్జంటుగా టైపు చేయలసిన పేపర్సు ఎన్నో వున్నాయి మీరిక్కడ నుండి

సారీ మీ వర్కు డిస్టర్బ్ చేసినట్లుంది సాయంత్రం తీజరుగా మాట్లాడుకుందాంలెండి తన సీట్లోకెళ్ళిపోయాడు వామనరావు

సాయంత్రం కలుస్తాడట పిక్చరు ప్రోగ్రామేదైనా వేస్తాడు కాబోలు సరోజకు వినిపించేలా గట్టిగా అన్నాడు జోగినాధం

ఆ మాటలకామె అతని వంక ఎర్రగా చూసి మళ్ళీ తన పనిలో లీనమైంది సరోజ

(ఇంకా ఉంది)

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆదారంగా)

వృత్తులన్నింట కర్షక వృత్తి మేలు
జగతి చక్రమ్ము తిరుగు కర్షకుని వలన
కాన నాగలి రైతన్న లేని యెడల
ఈ ప్రపంచమ్ము కష్టాల నెట్లు దాటు?

వినుము సున్నమ్ము లేనట్టి విడెముపొల్కి
విందు మేళాలు లేనట్టి పెండ్లి బంగి
వాలుకాసీమ బోసిన పాలవోలె
రమణి లేనట్టి ఇల్లు నిరర్థకమ్ము

అప్పు దొరికిన సమయాన అమరుల గవి
క్షీరముల్ త్రాగిన విదాన జెలగు నరుడు
అప్పు దీర్చెడి సమయాన కుప్పగూలి
నడుము విరిగిన చందాన నలుగు నరుడు

— కనమలూరు వెంకట శివయ్య



డాక్టర్ ఎన్ అశోక్‌కుమార్ డాక్టర్ నిర్మల

## ఇద్దరూ ఉద్యోగస్తులైతే

మనిషన్న తరువాత ఎదో ఒక వ్యాపకం ఉండాలి చదువుకుని కూడా ఉద్యోగం సద్యోగం చెయ్యకుండా తిరుగుతుంటారు కొంతమంది తాత ముత్తాతలు సంపాదించి పెట్టిన ఆస్తి ఉంది కదా తిని కూర్చొవచ్చు అనుకుంటారు మరి కొంతమంది

ప్రేమానురాగాలకు దూరమైన పిల్లల్లో యెరాస్మస్ జబ్బులు రావడం కద్దు బార్యాబర్తలిద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్న వారి పిల్లల్లో అనవసర బయాలు పెరగడం తిండి సరిగ్గాతినకపోవడం వల్ల చిక్కి శల్యమవడం చిన్న చిన్న దొంగతనాలకు

విధానం కూడా తెలుసుకుంటే మంచిది. ఉద్యోగాలు చేసేవారు పిల్లల్ని ఆయాలమీద వదిలివెయ్యడమో లేక పెద్దవాళ్లకు వారి బాధ్యత అప్పజెప్పడమో చేస్తూ ఉంటారు. మా పరిస్థితి కూడా అలాంటిదే అయినా మా పర్సనల్ సూపర్‌విజన్ ఎల్లలమీద ఎక్కువ చూపిస్తాము నేను డాక్టరుగానే కాక ఒక మామూలు స్త్రీగా చెబుతున్నాను మనల్ని ఉద్ధరించాలనుకొని కనే ఎల్లల్ని వ్యక్తిగత శ్రద్ధతో పెంచితే తప్పకుండా ఉద్ధరిస్తారు' అంటున్న నిర్మలాకుమార్‌లకు ఒక బాబు పాప

# అర్ధం చేసుకునే భర్త దొరకటం అదృష్టం!

అలాంటి వారికి న్యూరోటిక్ అనే మానసిక వ్యాధి వస్తూ ఉంటుంది స్త్రీకైనా పురుషుడికైనా ఎదో ఒక వ్యాపకం ఉంటేనే మంచిది ' అంటారు డా ఎన్ అశోక్‌కుమార్ ఈయన విజయవాడ గవర్నమెంట్ హాస్పిటల్‌లో అసిస్టెంట్ సైకియాట్రిస్ట్‌గా పని చేస్తున్నారు

డా అశోక్‌కుమార్ బార్య డా నిర్మల విజయవాడ రైల్వే హాస్పటల్‌లో గైనకాలజిస్టుగా పని చేస్తున్నారు

ఉద్యోగం చేసే బార్యను అర్ధం చేసుకునే బర్త దొరకడం అదృష్టంగా బావించాలి ముఖ్యంగా మా వారు మోస్ట్ అండర్‌స్టాండబుల్ హస్బెండ్

వృత్తిరీత్యా యమర్జన్సీ కేసులుంటే అర్ధరాత్రి కూడా హాస్పిటల్‌కు ఎటెండ్ అవ్వాల్సి వస్తుంది అప్పుడప్పుడు నైట్ షిఫ్టులు కూడా చెయ్యాల్సి వస్తుంది అలాంటి సమయాల్లో ఆయనే ఎల్లల బాధ్యత వహిస్తుంటారు ఆయనలో విసుగూ విరామం నేనెప్పుడూ చూడలేదు" అన్నారు డా నిర్మలాకుమార్ ఎంత బిజీ లైఫ్ గడుపుతున్నా పిల్లల విషయంలో శ్రద్ధ చూపించకపోతే వారిలో మానసిక బలహీనతలు అలవడతాయి

అలవాటుపడటం న్యూలు ఎగ్గొట్టి షికార్లు కొట్టడం హైపర్ యాక్టివిటీ వచ్చి ఇంట్లోంచి పారిపోవడం లాంటి మానసిక సంక్షోభాలు ఎన్నో వస్తుంటాయి చాలామందికి ట్రీట్ చేశాను కూడా

అలాగే ఉద్యోగం చేసే బార్య మీద అనుమానంతో ప్రవర్తించే బర్తలు బార్య ఉద్యోగం చేయకపోయినా ఇంట్లో ఎం చేస్తోందోనన్న అనుమానంతో చేసే పనిని నిర్లక్ష్యం చేసి ఎచ్చివాళ్లయ్యే బర్తలు బార్య ఉద్యోగం చేస్తూఉంటే ఇంట్లో తిని కూర్చునే బర్తల్లో ఇన్‌ఫీరియార్టీ కాంప్లెక్స్ పెరిగి మత్తుపదార్ధాలకు బానిసలై పెడత్రోవ పట్టి సంసారాలను నాశనం చేసుకుంటూ ఉంటారు

బార్యాబర్తల్లో ఎవరు ఎక్కువ? ఎవరు తక్కువ అన్నది ఆలోచించకుండా ఒకరినొకరు అర్ధం చెసుకుంటె జీవితం సుఖమయం అవుతుంది వారి ఎల్లలు కూడా ఆరోగ్యంగా పెరుగుతారు ముఖ్యంగా ఉద్యోగం చేసుకునే దంపతులు దీనిని పాటించాలి అంటారు డా అశోక్‌కుమార్

ఎల్లల్ని కనంగానే సరికాదు వారిని పెంచే

నా బార్య చెప్పింది అక్షరాలా నిజం ప్రస్తుతం చాలా మంది అనవసర టెన్షన్లు పెట్టుకుని ఆపీసు నుండి ఇంటికి రాగానే ఎల్లల్ని చీదరించుకుంటారు' బార్యమీద బర్త బర్త మీద బార్య పోటిపోటి మాటలనుకుంటుంటే అమాయకులైన ఆ పసి మనస్సులో ఆందోళన చెలరేగుతుంది దాని పర్యవసానాలను ఊహించలేము ఇలాంటి వారికి సైకియాట్రీలో ఫ్యామిలీ థెరపీ ట్రీట్‌మెంట్ చెయ్యాలి ప్రతి మనిషి యోగ ప్రాక్టీసు చేయడమో రోజు కాసేపు మెడిటేషన్ చేయటమో మంచిది టెన్షన్లను కొంతవరకూ తగ్గించుకోవచ్చు అంటారు డా అశోక్‌కుమార్

అందుకేనేమో ఎప్పుడూ నవ్వుతూ సరసంగా మృదువుగా సంబాషిస్తూ మానసిక రోగాలకు సుస్మితంగా చురకలేసి నయం చేసేస్తున్నారు డా అశోక్‌కుమార్ అన్నాను

అంతేకాదండోయ్ ఆయన హిప్నోథెరపిస్ట్ కూడా ' అన్నారు డా నిర్మల'

-కృష్ణాజీ

# "ఆదర్శం మాటున...'

## కిశోర్

ఆ రోజు సీత మనసంతా ఎన్నడూ లేనంత ఆనందంతో నిండి వుంది. దానికి కారణం లేకపోలేదు.

వివాహమై అత్తవారింటికి వచ్చాక తొలిసారిగా పండక్కు భర్తతో కలిసి పుట్టింటికెళుతుంది ఆ ఆనందం ఆమెను ఒక చోట నిలువనీయడంలేదు మద్యాహ్నం నుండి హడావుడిగా అటూ ఇటూ తిరుగుతుందే గాని ఏ పని ముందు చేయాలో అర్థం కావడంలేదామెకు సర్దినవే సర్దుతుండి పోయింది

ఆ రాత్రి భోజనాలయ్యాక ఇల్లంతా సర్దుకుని పడకగదికి చేరిన సీతను దగ్గరకు తీసుకుంటూ

సీతా! మన పెళ్ళయ్యాక వచ్చిన మొదటి పండుగ ఇదే కదూ! అడిగాడు మూర్తి

అవునండి! అందునా ఇది సంవత్సరాది పండుగ కావడం నాకెంతో సంతోషంగా అనిపిస్తుంది అంది సీత సంతోషం నిండిన కళ్ళతో అలా మెరుస్తున్న ఆమె కళ్ళల్లోకి చూస్తూ

నిజమే. అందునా ఇది మన తెలుగువారికి నూతన సంవత్సర ప్రారంభం కూడాను" అని క్షణమాగి

సీతా! మరి క్రొత్త సంవత్సరం ఈ క్రొత్తల్లుడి కోసం మీ నాన్నగారిని ఏమిమ్మని అడుగుతావ్?

ఆ మాట వినగానే ఆశ్చర్యంగా చూసిందతని వైపు సీత

ఏమిమ్మని అడిగేదేమిటి! మనకిద్దరికి క్రొత్త బట్టల కోసం వెయ్యి రూపాయలిమ్మని అడుగుతాను అంది ఒకింత గర్వంగా

వెయ్యి రూపాయలా? ప్చ్ అంటూ పెదవి విరిచాడు మూర్తి

వెయ్యి రూపాయలు ఎక్కువే అనుకుంటున్నా నేను మీరెందుకలా తీసి పారేసినట్లుగా అంటున్నారో నాకర్థం కావడంలేదు అంటూ విస్మయంగా వర వైపు చూసింది కానీ అతని అంతరంగమేమిటో అర్థం కాలేదామెకు

"అదికాదు సీతా!. తన మనసులోని మాటనెలా చెప్పాలో తోచలేదతనికి

"ఏమిటండీ! ఈ రోజు మీరేమిటో క్రొత్తగా మాట్లాడుతున్నారు" అంది సీత అతని అంతరంగమేమిటో బోధపడక

"క్రొత్తగా మాట్లాడేందుకేముంది సీతా! తనను తాను సంబాళించుకుని తిరిగి ఇలా అన్నాడు

"సీతా! మన పెళ్ళికి నేను పైసా కట్నం కూడా తీసుకోలేదు. అవునా?

కాదనగలనా చెప్పండి? అందుకే మీలాంటి ఆదర్శమూర్తి భర్తగా లభించినందుకు గర్వించని క్షణమంటూ లేదు.

అలా అంటున్న సీత కళ్ళల్లో ఒకింత గర్వంతో పాటు ఆనందం కూడా తొణికిసలాడింది

నిజమే సీతా! మొదటి నుండి నాకు కట్నం తీసుకునేవారంటే చాలా కోపం కట్నం కోసం అమ్ముడు పోవడమేమిటి సంతలో పశువుల్లాగా? అనుకునేవాణ్ణి. కట్నం పేరుతో వేలకు వేలు గుంజడం నాకిష్టం లేదు అందుకే కట్నం తీసుకోనని




[illegible] మీ నాన్నగారితో

"[illegible] మీరు కట్నం లేకుండా నన్ను పెళ్ళి [illegible] రోజున మా నాన్నగారెంతగా సంతోషించారో మాటల్లో చెప్పలేను కనపడిన ప్రతి [illegible]రితోను మీ గురించి ఆయన గొప్పగా చెప్పుకునేవారు. మీరు కట్నం వద్దన్నా ఆడపిల్లను ఒట్టి చేతులతో పంపడం ఇష్టంలేక అమ్మ మెడలోని తాళిబొట్టు సరదు తప్ప నెక్లెస్ గాజులు కరిగించి నాకు క్రొత్త నగలు చేయించారు

"అదేమిటి నాన్నా!" అమ్మ వంటి మీద బంగారం కరిగించి నాకు చేయిస్తున్నావేమిటి? నాకేమి వద్దు అంటున్న నాతో -

ఈ కాలం కట్నం ఆశించని వాళ్ళెవరున్నారమ్మా? మన పుణ్యంకొద్దీ బంగారంలాంటి అల్లుడు దొరికాడు' అంటూ తెగ పొగిడారు మిమ్మల్ని అంది సీత ఆనాటి జ్ఞాపకాలు కళ్ల ముందు మెదులుతుంటే సంతోషంగా

అవును సీతా! కట్నం తీసుకోకపోవడం నా ఆదర్శం అని క్షణమాగి

సరేలే ఇప్పుడా ప్రసక్తి దేనికిగాని సీతా! మరి మన పెళ్ళయ్యాక వచ్చిన తొలి పండుగ ఇదే కదూ!మరి ఈ పండక్కుగాను మీ నాన్నగారిని మనకు ఇండో సుజికీ తీసిమ్మని అడగరాదూ? చల్లగా తన మనసులోని మాటను బైటపెట్టేశాడు మూర్తి

ఏమండీ! ఆశ్చర్యంగా వింతగాచూసిందతని వైపు సీత

ఏమిటి? ఏమిటి మీరంటున్నది? ఇండో సుజికి తీసిమ్మని నాన్నగారిని అడగాలా? నేను విన్నది నిజమేనా? ఇంకా ఆశ్చర్యం నుండి తేరుకోలేక అడిగింది సీత

అదేమిటోయ్! అంతగా ఆశ్చర్యపోతున్నావ్? పెదవులపై నవ్వు తెచ్చుకుంటూ అడిగాడు మూర్తి

అది కాదండీ! ఇండో సుజికి అంటే మాటలా? వెయ్యి రెండు వేలకు వచ్చేదేమీ కాదుగా?

ఆమె అలా అనగానే కోపం వచ్చేసింది మూర్తికి

నాకు తెలియదనుకున్నావా దాని రేటు అతని



కంఠంలో తొలిసారిగా ఆమెపై కోపం ధ్వనించింది

ఆహా అది కాదండి ఏదో చెప్పబోయింది గాని గొంతు పెగల్లేదు సీతకు

ఏదికాదు సీతా! మొదటి పండుగకు క్రొత్తల్లుడికి ఆ మాత్రం కానుక ఇవ్వలేదేమిటి మీ నాన్న! కోపాన్నణుచుకుంటూ అడిగాడు మూర్తి

హు కానుకా ఎంత తేలిగ్గా అనేశాడీయన? ఎంత కానుక అయితే మాత్రం అంత ఖరీదైనదా?మరి ఇదే కానుక పెళ్ళినాడే అడిగి వుండవచ్చుగా?

ఓహో పెళ్ళినాడు అడిగితే అది కట్నం క్రిందికి వస్తుందని అందరూ అనుకుంటారని కాబోలు అడగలేదు

ఇప్పుడైతే దాన్ని కానుక క్రింద అడగవచ్చును కున్నాడు

ఇక ఈయనగారు పెళ్ళిలో . కట్నం వద్దన్నదెందుకో? ఇదే విషయం అతన్నడగాలను కొంది సూటిగా కానీ ఆ మాటలు ఆమె గొంతులో పెగల్చుకుని బైటకు రాలేకపోయాయి

ఎందుకంటే ఆమె హైందవ నారి

భర్త నెదిరించి మాట్లాడటం ధర్మవిరుద్ధం భర్త గీచిన గీటు దాటరాదన్న సత్యం మన హైందవ స్త్రీలకు చిన్ననాటి నుండీ నర నరాన జీర్ణించుకు పోయింది

అందుకే అందుకే సీత గొంతును పెగల్చుకుని రాలేదా మాటలు గొంతులోనే కొట్టు మిట్టాడుతున్నాయి అతని ఆదర్శం వెనుక దాగిన అంతర్యం కొట్టొచ్చినట్టుగా కనపడుతుంటే ఆమె గొంతుతో పాటు మనసు కూడా మూగవోయింది

తన వైపు వింతగా చూస్తున్న భార్యతో

అదేవిటి అలా చూస్తున్నావ్? దయ్యాన్ని చూస్తున్నట్టు? కసిరినట్టుగా అన్నాడు మూర్తి

ఆ అబ్బే ఏం లేదు వూ చెప్పండి' అంది తనను తాను కంట్రోలించుకుంటూ

మళ్ళీ చెప్పాలా హు అంటూ నిట్టూర్చి

రేపు పూరెళతాం కదా! వీలు చూసుకుని ఇండో సుజికి కావాలని మీ నాన్నగారిని అడుగు

అలా గే ఏమనాలో తెలియక తలవూపింది సీత

ఏయ్ మొద్దూ! అలాగే అని గంగిరెద్దులా తలవూపడం కాదు నేను అడిగానని మీ నాన్నతో అనకు నీ వడిగినట్టే అడుగు

ఏమని ? అతని మాటలామె కర్థం కాలేదు

ఖర్మ అంటూ నుదురు కొట్టుకుని అది కూడా నేనే చెప్పాలా? నాకు ఇండో సుజికి కొనివ్వండి మామగారూ! అని నేనడిగితే బాగుండదు నీవే మీ నాన్నగారితో నాన్నా! ఆయనకు ఆఫీసు చాలా దూరం సైకిల్‌లో వెళ్ళిరావడం కష్టంగా వుంటుంది సుజుకి కొనిస్తే సాయంత్రాలు ఆయన త్వరగా ఇంటికి రావడానికి వీలుంటుంది అదీగాక ఇద్దరం ఎక్కడికైనా సరదాగా వెళ్లాలనుకుంటే గంటల తరబడి సిటీ బస్సుల కోసం కాళ్ళు పీక్కుపోయేలా నిలబడాల్సిన అవసరం వుండదు అని అడుగు ఏం! అర్థమైందా? అతను చెప్పేదాన్ని నోరు వెళ్ళబట్టి ఆశ్చర్యంతోను అయోమయంగానూ వింటున్న సీత భుజం తట్టుతూ అన్నాడు మూర్తి

నే చెప్పిందంతా విన్నావా? అని

ఆ విన్నాను పొడిగా అంది సీత

నే చెప్పినట్టు అడుగుతావా?'

అలాగే అప్రయత్నంగా తలవూపుతూ అంది సీత

వెరిగుడ్! అలా వుండాలి భార్య అంటే అంటూ ఆమెను కౌగిట్లోకి చేర్చుకున్నాడు మూర్తి సంతోషంగా

ఇంత క్రితం వరకు ఆ కౌగిలే ప్రపంచమని అదే తన సర్వస్వమని దానికి మించిన మధురానుభూతి మరేదీ లేదనీ తనంతటి అదృష్టవంతురాలే ఎవరూ వుండరని గర్వంతో పొంగిపోయిన సీత కాక్షణం

అతని కౌగిలి అలర్జీగా అనిపించగా వళ్ళు జలదరించింది

యాంత్రికంగా తన శరీరాన్ని అప్పగించింది ఎదురు తిరిగే మనసును బలవంతాన అదిమి వుంచుతూ

ఆమె మనస్థితి ఏ మాత్రం గమనించని మూర్తి ఓ అరగంటకంతా గాఢ నిద్రా పరవశుడయ్యాడు

కానీ

సీత మాత్రం రోజూలా పరవశంతో అతన్ని పెనవేసుకుని నిద్రపోలేదు అతనికి ఎడంగా జరిగి మంచానికి అవతలి కొసవైపు తిరిగి ఆలోచనల్లో మునిగిపోయింది

ఏమిటీ చిత్రం! కొద్దిసేపటి క్రితందాకా తనంతటి అదృష్టవంతురాలు ఈ ప్రపంచంలో ఎవరూ వుండరని అనుకోని క్షణంలేదు పెళ్ళైనప్పటి నుండి

కానీ

యీ క్షణం అతని అసలైన అంతర్యం తెలిసిన తరువాత కృంగిపోసాగింది తనంతటి దురదృష్టవంతురాలు లేదంటూ

పెళ్ళి సమయంలో తీసుకుంటే కట్నం – పండుగ సమయంలో అయితే కానుక హు ఎంతటి యుక్తి!

అటు ఆదర్శవాది అంటూ అందరిలో గొప్పగా పేరు సంపాదించాడు అందరి దాకా ఎందుకు? తను కూడా కొద్ది సేపటి క్రితం వరకూ అలాగనే అనుకోలేదూ?

కానీ ఇప్పుడు అతని కోరిక విన్నాక అతనంటే ఏవగింపు కలుగ సాగింది

హు ఆయన అడిగితే నాన్నగారి ముందు నామోషీగా వుంటుందని తనను అడుగ మంటున్నాడు

ఎంత లౌక్యం! ఇటువంటి మనుషులు కూడా వుంటారని తొలిసారిగా తెలుసుకుంది

తను మాత్రం నాన్న నెలా అడుగుతుంది?

ఈయనగారు కట్నం వద్దన్నందుకు అమ్మ వంటిమీది బంగారు కరిగించి ఆరు తులాలు పెట్టి తనకు నగలు చేయించారు

ఇన్నాళ్ళ సర్వీసులో బ్యాంకులో దాచుకున్న పదివేల రూపాయలలో తన పెళ్ళి ఖర్చుకు గాను ఎనిమిదివేల దాకా వాడారు నాన్న ఇప్పుడు తను 'సుజికి' కావాలంటే దానికోసం నాన్న అప్పు చేయక తప్పదు

అయినా ఇప్పుడు నాన్నగారు అప్పు చేస్తే మరో రెండేళ్ళకు తన చెల్లెలు పెళ్ళిడు కొస్తుంది అప్పుడు దాని పెళ్ళెలా చేస్తారు?

తమ్ముడి భవిష్యత్తేమిటి?

నాన్నగారి ఆర్థిక స్థితిగతులు తెలిసిన తను నోరు తెరిచి ఎలా అడుగుతుంది? అడుగక పోతే యీయనగారేమంటారో?

ఇందాక తను సుజికి అంటే మాటలా? అన్నందుకే కోపగించుకున్నా డీయన మరి తను నాన్న నడగకుంటే ఏమంటాడో? తొలిసారిగా భర్త అంటే భయం వేసింది సీతకు

జీవితం అంటే ఇన్ని చిక్కు సమస్య లుంటాయా! అనుకొని ఆశ్చర్య పోయింది ఆవేదన చెందింది

ఆ రాత్రంతా కలత చెందిన మనసుతో నిద్రకు దూరమైంది సీత పుట్టింటికి వెళుతున్నానన్న సంతోషమే కరువైంది దామెకు

* * * *

సాయంత్రం నాలు గ్గంటల వేళ హాలు గుమ్మం ముందు చాపపై కూర్చుని సీతకు జడ అల్లుతుంది సరస్వతమ్మ

ఆమె కెదురుగా సుబ్రహ్మణ్యంగారు, మూర్తి కుర్చీలలో కూర్చుని ఆపీసు విషయాలు మాట్లాడు కుంటున్నారు

హాలు ముందున్న వరండాలో కూర్చుని సీత తమ్ముడు సతీష్ సుమతీ శతకం లోని పద్యాలు కంఠతా పడుతున్నాడు గట్టిగా

అక్కరకు రాని చుట్టము

గదరా సుమతీ!

అంటూ చదివి మరో పద్యాన్నెత్తు కున్నాడు

మాటకు ప్రాణము సత్యము

గదరా సుమతీ!

అలా గట్టిగా గొంతెత్తి చదువుతున్న వాణ్ణి

అంత గట్టిగా ఇల్లెగిరి పోయేలా చదువకురా నాన్నా! అవతల మీ నాన్నగారు బావగారు మాట్లాడు తున్నారు కాస్త నెమ్మదిగా చదువు అంటూ కొడుకును మందలించింది సరస్వతమ్మ

అబ్బ పోమ్మా! గట్టిగా చదువుతే గాని పద్యాలు రావు సాయంత్రం మేష్టారికి ప్రైవేటులో అప్పగించాలి అంటూ మరింత గట్టిగా చదువ సాగాడు

అల్లుని మంచితనంబు గొల్లని సాహిత్య విద్య

మహిలో సుమతీ! అంటూ చదువుతుండగా

ఒరే సతీష్! ఆపు గట్టిగా అరిచినట్లే అన్నారు సుబ్రహ్మణ్యంగారు

ఆ పద్యం విన్న మూర్తి ఖంగు తిన్నాడు

ఆ పద్యంలోని అర్థాన్ని గ్రహించి భర్త ఏమనుకుంటాడో? నని భయపడ్డ సీత మూర్తి వంక చూసింది

మూర్తి తనను తాను సంబాళించు కుంటున్నాడు

సుబ్రహ్మణ్యం గారికా పద్యం విని కోపం వచ్చింది

ఇక చాల్లే నీ పద్యాలు లే లేచి వెళ్ళి ఆడుకోఫో అంటూ కసరుతున్న తండ్రిని తొల్లిబోయి చూసి ఆడుకోవడానికి వీదిలో కెళ్ళిపోయాడు సతీష్

మామగారి మాటలు విన్న మూర్తి తేరుకుంటూ

# ఆదర్శం మాటున..

ఆదేవిటండి అవి మంచి పద్యాలుగా చదువనివ్వండి ఎందుకలా కసురారు పాపం! ఆ పద్యంలోని భావాన్ని గ్రహించి లోలోన మందుతున్నా పైకి ప్రశాంతంగా అన్నాడు మూర్తి మామగారితో –

నీకు తెలియదులే మూర్తి! ఆ సుమతీ శతకం రచించిన మహాను భావుడికి నిన్ను చూపించి చూడవయ్యా! వేలకు వేలు కట్నాలు గుంజుతున్న ఈ కాలంలో పైసా కట్నం కూడా ఆశించని నా అల్లుని మంచితనం చూడు! అందరి అల్లుళ్ళను కలిపి ఒకేలా కవి గట్టకు అని మందలించే వాణ్ణి అన్నాడాయన నవ్వుతూ

మామగారి మాటలకు భుజాలు సర్దుకున్నాడు మూర్తి

## "స్మృతి"

చిగిర్చని జీవిత
వసంత వృక్షం మీద
ఎటు నించో హఠాత్తుగా
ఎగిరి వచ్చిన
అందమైన సీతాకోక చిలుకలు
రామ చిలుకలు
అనుకోకుండా వాలి
రెండు పిచ్చి పాటలు పాడి
అర్థాంతరంగా ఎగిరి పోతాయి!
గూడు చిన్నబోతుంది
శూన్యం శిశిరమై
వృక్షపు వస్త్రాల్ని ఒలిచేసి
నగ్నంగా నిలబెట్టాక
వృక్షం
ఆకాశానికి మొండి చేతుల్ని చాచి
సిగ్గుతో చిగురైపోతుంది!!!

—బి వి ఆర్ రెడ్డి

తండ్రి మాటలను విన్న సీత మాత్రం

'హు . . పిచ్చి నాన్నా! ఆ మహాకవి వ్రాసినది జీవిత సత్యం లోకం తీరును బాగా ఆకళించుకునే ఆ పద్యం వ్రాశాడాకవి అని మనసులోనే అనుకుని నిట్టూర్చింది సీత

తల్లి జడ అల్లగానే లేచి ముఖం కడుక్కోవడాని కెళ్ళింది సీత మూర్తి కూడా ఆమెననుసరించి బాత్‌రూమ్ లోనికి వెళ్లబోతున్న ఆమెతో

సీతా! నే నలా బైటి కెళ్ళొస్తాను ఇప్పుడే ఆడుగు

అంటూ చిన్నగా చెప్పి బట్టలు మార్చుకుని వెళ్ళిపోయాడు మూర్తి

సీత ముఖం కడుక్కుని వచ్చి టాయిలెట్ అయి చెల్లెలికి జడ అల్లుతున్న తల్లి ప్రక్కన కూర్చుంది

- ఏమ్మా సీతా! రేపే కదా పండుగ మూర్తి రాగానే వెళ్ళి బట్టలు తెచ్చుకోండి అన్నారు సుబ్రహ్మణ్యంగారు

అలాగే నాన్నా! అంది సీత తలవంచుకుని

ఎంతిమ్మంటా వమ్మా ?

మీ యిష్టం నాన్నా

దాన్నడుగుతే దానికేం తెలుసు ఉంది? ఓ అయిదు వందలిచ్చి పంపండి అంది సరస్వతమ్మ భర్తతో

అయిదు వందల కేం బట్టలొస్తాయే ఈ కాలంలో? అయినా అమ్మాయి పెళ్ళయ్యాక వచ్చిన మొదటి పండుగ కదా ఇది కాస్త ఖరీదైన బట్టలు తీసివ్వద్దూ? అందునా అల్లుడుగారు కానీ కట్నం కూడా పుచ్చుకోలేదు అలాంటపుడు మనం మనంగా గుడ్డలు పెట్టకుంటే ఏం బాగుంటుంది? అంటూ భార్యను మందలించారాయన

ఆయన అలా మందలించగానే కోపం వచ్చింది సరస్వతమ్మకు

హు ఇదొకటి పట్టుకున్నారు గట్టిగా ఏం కట్నం తీసుకోకపోతే మాత్రం మనమేమైనా తక్కువ చేశామా? అమ్మాయికి ఆరు తులాల బంగారం వేశాం అల్లుడు గారికి సూటు బూటు వాచీ వుంగరానికి గాను మూడువేల రొఖ్ఖమిచ్చాము ఇవన్నీ కట్నానికి సరితూగుతాయి ఇకపెళ్ళి ఖర్చులు సరేసరి మీరేమో మాటకు ముందు మా అల్లుడు కట్నంతీసుకోలేదని పెద్ద బడాయిగా చెబుతున్నారు అదే నాక్కోపం తెప్పించేది అంది సరస్వతమ్మ

అబ్బ నోరు ముయ్యవే నీకు తెలియదు గాని అతను కట్నం వద్దన్నాక ఆ మాత్రమైనా మనం పెట్టకుంటే ఏం బాగుంటుంది ఇక సరేలే పూరుకో అల్లుడుగారొస్తారేమో అతను వింటే బాగుండదు అంటూ కూతురివైపు చూసి

సీతా! వెయ్యి రూపాయలిస్తాను అల్లుడిగారికి ఇష్టమైన బట్టలు తీసుకున్న తరువాత నీకు నచ్చిన చీర తీసుకో డబ్బులు చాలకుంటే తర్వాత నేనిస్తానని చెప్పు మనం వాడుగ్గా బట్టలు తీసుకునే మహాలక్ష్మి క్లాత్‌స్టోర్స్‌కు వెళ్ళు అన్నాడాయన

తల్లి దండ్రుల సంభాషణను అందాకా మౌనంగా విన్న సీత లోలోనే మదనపడసాగింది

తల్లి అన్న మాటల్లో నిజం లేకపోలేదు తనకు పెట్టిన బంగారంతో సహా పెళ్ళి ఖర్చులతో కూడా కలిపితే ముప్పైవేలయ్యింది. అదే ఏ పొరుగింటివాళ్లో కట్నం ఇస్తే ఏ తంటా వుండేదికాదు ఆ కట్నమే ఇచ్చివుంటే ఇప్పుడు తన భర్త ఇందో సుజికీ అడగమని కోరేవాడే కాదు కొనిమ్మని తండ్రిని తనెలా అడుగ గలదు?

అయినా తండ్రి స్థితి గతులన్నీ తనకు తెలియనివి కావుగా?

తను అడిగితే తండ్రి దృష్టిలో ఈ క్షణం దాకా ఎంతో వున్నత ఆదర్శమూర్తిగా వున్న తన భర్త చులకనైపోతాడు

భగవాన్! ఈ సమస్యకు నీవే పరిష్కారం చూపాలి అని మనసులోనే భగవంతున్ని స్మరించింది

అడగాలంటే అటు తండ్రి ఆర్థికస్థితి అడుగకుంటే భర్త ఏమంటాడో నన్న భయం ఈ



# వోల్టాస్ లాంటి మరొక రిఫ్రిజిరేటర్ కోసం వెదకిచూడండిక...

## లోకంలో సగం చుట్టూ తిరిగిరావల్సొస్తుందిక.

రిఫ్రిజిరేటర్ల సంగతెత్తితే, మీరు వోల్టాస్ కొనడం అన్నిటికన్నా మంచిదిక మిగతా రిఫ్రిజిరేటర్లన్నీ కలిసికూడా దీనికిగల అంతర్జాతీయ స్థాయికిగాని ప్రత్యేక లక్షణాలతోగాని, లాభాలతోగాని సరితూగలేవు మరి

కేవలం వోల్టాస్ 165 లీటర్ల రిఫ్రిజిరేటర్లోనే పూర్తి తీరులో గల ఆటోమేటిక్ డీఫ్రాస్టింగ్ సిస్టమ్ వుంది అలా డీఫ్రాస్ట్ అయిపోయిన నీళ్ళు వాటంతట అవే ఆరిపోతాయి

వోల్టాస్ రిఫ్రిజిరేటర్ చూడటానికైతే నాజూకుగా అలా సన్నగావుంటుంది గాని, నిజానికి లోపలగనక చూస్తే కావలసినంత విశాలంగా వుంటుంది— యీ పొందిక పాలియురేథీన్ ఫోమ్ ఇన్సులేషన్ వల్ల వచ్చింది దాంతోబాటే యిది కీటకాలను ఏమాత్రం పెరగనివ్వదు, దరికి చేరనివ్వదిది

వోల్టాస్ యొక్క ఏ బీ ఎస్ కేబినెట్, డోర్ లైనర్లూ దృఢమైన గీతలు పడకుండా వుండేలావుంచే పదార్థంతో చేయబడ్డాయి

వోల్టాస్ రిఫ్రిజిరేటర్, ఆధునికమైన పొడరు కోటింగు ప్రక్రియతో పెయింట్ వేయబడింది ఇది తుప్పు పట్టదు, పెక్కులూడదు, పాలిపోదు

వోల్టాస్ 165 లీటర్ల రిఫ్రిజిరేటర్ మీరు ఎంచుకోగల రంగుల్లో దొరుకుతుంది.

300 లీటర్ల డబుల్ డోర్ మోడల్, అంతర్జాతీయ స్థాయీ హోదాకి చెందిన రిఫ్రిజిరేటరు

వోల్టాస్ యొక్క శక్తివంతమైన కంప్రెసర్‌కి ఏడేళ్ళ గ్యారంటీవుంది

వోల్టాస్ రిఫ్రిజిరేటర్ దీనికి మరేదీ సాటిలేదిక








రిఫ్రిజిరేటర్

**అన్నింటికన్నా మేలైనదే కావాలనుకుంటే**

ULKA VR 101 86 TEL

ద్వంద్వ భావనల మధ్య అడకత్తెరలో పోకచెక్కలా నలగసాగింది సత మనసు చివరికి తండ్రిని అడగరాదనే తీర్మానించుకుంది

* * *

మూర్తి బజారు నుండి రాగానే గదిలోకి పిలిచాడు సతను

బిక్కు బిక్కు మంటున్న గుండెలతో వెళ్ళింది సత

గది తలుపులు చేరవేసి ఏమోయ్? ఏమన్నారు మీ నాన్న? నవ్వుతూ అడిగాడు

ఆ మాట వినగానే క్షణ కాలం ఆమె హృదయం స్పందించింది క్షణమాలోచించి ప్రస్తుతం నాన్న వద్ద అంత డబ్బు లేదం టండి! తడబడుతూనే అబద్ధ మాడేసింది

ఆ సమాధానం వినగానే బుస్సుమంటూ ఎగిరిపడ్డాడు మూర్తి కోపంతో

ఏమిటి? పైసా కట్నం ఆశించని నేను కేవలం ఒక్క చిన్న కోరిక కోరితే డబ్బు లేదంటాడా మీ నాన్న? అంటూ మండిపడ్డా డు

ఏమండీ! మీకు పుణ్యం వుంటుంది గట్టిగా అనకండి అమ్మ వింటుంది! అంటూ బంగారుగా భర్తను ప్రాధేయపడింది సత

తండ్రి బజారు కెళ్ళాడు తమ్ముడు చెల్లాయి ట్యూషన్ కెళ్ళారు వంటింట్లో అమ్మ ఒక్కతి మాత్రం వున్నా ఆమెకు వినపడుతుం దేమోనన్న భయం కలిగిం దామెకు

ఆమె అలా అనగానే మూర్తి కూడ తన పొరపాటు తెలుసుకున్నాడు తను గట్టిగా ఈ విషయం గురించి సతతో చర్చిస్తే తనే ఇండో సుజికీ ని సత చేత అడిగించినట్లు తెలుస్తుంది అనుకుని నెమ్మదిగా అన్నాడు

అయితే డబ్బెప్పు డుంటుందట మీ నాన్నగారి వద్ద? ముఖం చిట్లిస్తూ అడిగాడు

ఏమో? నిదానంగా చూద్దాం లేమ్మా అన్నారు ఇదిగో వెయ్యి రూపాయ లిచ్చారు మనల్ని బట్టలు తెచ్చుకొమ్మని అంటూ సూట్‌కేసులో దాచిన డబ్బు

# ఆదర్శం మాటున

తీసి అతని చేతి కందించింది

హు అంటూ నిర్లక్ష్యంగా ఆ డబ్బు తీసుకుని జేబులో కుక్కు కున్నాడు మూర్తి

భారంగా నిట్టూర్చింది సత

* * * *

అత్తవారింటికి పండక్కు వెళ్ళి వచ్చినప్పటి నుండి సతను సాధించడం మొదలు పెట్టాడు మూర్తి

కట్నం అడగక పోవడం ఒకసాకుగా దొరికిందతనికి చీటికి మాటికి ఆ మాటే అంటూ కట్నం కూడా ఆశించని నాకు కేవలం కేవలం ఒక్క సుజికీ తీసివ్వడాని కేడుస్తున్నాడు మీ నాన్న అనేవాడు ఆమె తల్లి దండ్రులను ఎత్తి పొడిచినట్లుగా మాట్లాడేవాడు

అది సత మనసు నెంతో గాయపరచ సాగింది ఆ మాటలు వింట్లూ లోలోనే కుమిలిపోసాగింది

రోజు రోజుకూ అతననే మాటలకు బాధపడుతున్న సతలో సహనం పూర్తిగా నశించింది

చివరికి ఒకరోజు ఆవేశంగా భర్త నెదిరించింది

కానీ కట్నం తీసుకోలేదు అంటూ ప్రతిసారి మీరు గొప్పగా చెప్పు కుంటున్నారు గానీ కట్నం తీసుకోనంత మాత్రాన మా వాళ్ళు మీకు ఏం తక్కువ చేశారు? వున్నంతలో ఘనంగానే పెళ్ళి చేశారు మీ సూటు బూటు వాచీ వుంగరానికి గాను మూడు వేల రొఖ్ఖం ఇచ్చారు నాకు ఆరు తులాల బంగారం పెట్టారు ఇవన్నీ కట్నానికి ఏ విధంగాను తీసిపోవు అంది కోపంగా

ఆమె అలా తన నెదిరించి మాట్లాడు తుందని కలలో కూడా అనుకోని మూర్తి క్షణ కాలం నివ్వెర పోయాడు అంతలోనే కోపం ముంచు కొచ్చింది

వూ( పరవాలేదే? ఎదిరించి మ ట్లాడేదాకా వచ్చావన్న మాట అవును నువ్వు బి ఎ పాసయ్యావు కదూ! ఆ మాత్రం మాట్లాడక పోతే ఎలా

అయినా సతా! నేనేమి మీ వాళ్ళను నాకు వాచి పెట్టండి వుంగరం పెట్టండి మీ బిడ్డకు బంగారం పెట్టండి అని అడుగ లేదే?

అతని మాటలు విని నివ్వెర పోయింది సత

అంటే అంటే ఆ బంగారం పెట్టక పోయినా నన్ను వివాహం చేసుకునే వారా? అనుమానంగా అతని వంక చూస్తూ అడిగింది

లక్షణంగా చేసుకునే వాణ్ణి అంతేగాని నేనేమి మీ నాన్నను బంగారం పెట్టమని డిమాండ్ చెయ్య లేదు అన్నాడు

అయితే యీ బంగారం మీద మీ కెలాంటి కోరికా లేదా? విస్మయంగా అడిగింది

నో నో సీరంగా అన్నాడు మూర్తి

కానీ మనసులో మాత్రం తను కట్నం అడగనందుకు ఆ మాత్రం బంగారైనా పెడతారని ఎప్పుడో వూహించాడు ఆ వూహే నిజమైంది

మరి నా కినాళ్ళు యీ విషయం మాట మాత్రమైనా అనలేదే మండీ? నాకు పెట్టిన యీ బంగారాన్ని కూడా ఆశించని మీరు నిజంగా ఆదర్శమూర్తు లండీ అంది సత ఆనందంగా

అదే క్షణాన ఆమె సమస్యకు పరిష్కారమార్గం కూడా లభించింది

అవునోయ్! ఆదర్శం నా వూపిరి మరి ఇటువంటి నాకు కేవలం ఒక్క సుజికీ కొనివ్వమని అడగడంలో తప్పుందా?

అబ్బే! ఏ మాత్రం లేదు! అంటున్న సత కంఠంలో రవంత వ్యంగ్యం తొంగి చూసింది

ఏమండీ! రేపే నన్ను మా వూరికి పంపండి నాన్నగారితో చెప్పి మీ కిష్టమైన ఆ సుజికీ కొనే ఏర్పాటు చేస్తాను

నిజంగానా సతా! నమ్మలేనట్లుగా చూశా డామె వైపు

నిజం మీ మీదొట్టు అంది సత అతని తలపై చెయ్యి వేస్తూ

థాంక్యూ! మైడియర్! అంటూ ఆనందంతో ఆమెను ముదు పెట్టు కున్నాడు గాఢంగా

* * * *

పుట్టింటికి వెళ్ళిన వారం రోజుల కంతా సత నుండి ఉత్తరం వచ్చింది మూర్తికి

నాన్నగారు మీకు సుజికీ కొన్నారు వెంటనే శలవు పెట్టి రండి అంటూ

ఇంకేం

మూర్తి మనసు దూది పింజలా గాలిలో తేలిపోసాగింది ఆ వుత్తరాన్ని చూసిన మరు క్షణం నుండే

రెక్కలు కట్టుకున్నట్లు ఆ మరునాడే అత్తవారింట రివ్వున వాలాడు మూర్తి ఆఫీసుకు శలవు పెట్టేసి

వరండాలోనే దర్శన మిచ్చింది అతని కిష్టమైన ఇండో సుజికి ఎరుపు రంగుది

అబ్బ తనకు నచ్చిన రంగు!

థాంక్స్! సతా! మనసులోనే భార్యకు అభివాదాలు తెలుపు కున్నాడు



VVD

ఊహాలలో విహరించే
నవయౌవన సుందరాంగి
ఆమె హృదయాన్ని దోచుకున్నది ఎన్నెన్నో
లల్లనల్లన సాగే అందాల సెలయేరు
హాయి హాయిగ వీచే చల్లని మలయ మారుతం
హృదయాన్ని చూరగొన్న సొగసైన చెలికాడు
రంగు రంగుల కోమల కుసుమాలు
నిగ నిగలాడే సుదీర్ఘ శిరోజాలు
ఆ శిరోజాలకు
వి.వి.డి. కొబ్బరి నూనె



VVD-3/86




# వి.వి.డి. కొబ్బరి నూనె

*సహజ శిరోజాల యౌవన రహస్యం*

V.V.D

అది చూడగానే అతని ఆనందానికి పట్టపగ్గాలు లేవు

తనను చూసి సాదరంగా ఆహ్వానిస్తున్న అత్తమామల ముఖాలు పరిశీలనగా చూసి తృప్తి చెందాడు మూర్తి

ఎందుకంటే సుజికీ కొన్నామన్న బాధగాని విచారంగాని మచ్చుకైనా కనిపించ లేదు పైగా మరింత గౌరవంగా మాట్లాడారు వాళ్ళు

ఆ రాత్రి గదిలోకి చేరిన భార్యను చూసి సంతోషంగా

సీతా! ఎలాగైతేనేం మొత్తానికి సాధించావే అన్నాడు

ఇందులో నేను సాధించిం దేముంది లెండి ఇంతకూ బండి బాగుందా? అతని ప్రక్కనే కూర్చుంటూ అడిగింది

లేకేం! నీ అంత చక్కగా వుంది అంటూ ఆమెకు దగ్గరగా జరిగి

ఇదేమిటో యు! నేను వచ్చినప్పటి నుండి చూస్తున్నా పెద్ద ముత్తైదువులా ఆ పమిటేమిటి భుజం చుట్టూ కప్పుకుని తిరుగు తున్నావ్? అంటూ సీత భుజాల చుట్టూ కప్పుకున్న పమిట కొంగును లాగి వేసిన అతను ఒక్కమారుగా షాక్ తిన్నట్టుగా ఫీలయ్యాడు

ఏమిటి? ఏమిటిది సీతా? నీ మెళ్ళో యీ పసుపుతా డేమిటి? అంటూ అడిగాడు ఆత్రంగా

అతని ప్రశ్నలకు మెత్తగా నవ్వింది సీత

ఎందుకలా విస్తుపోతారు? మీకు బంగారు పైన ఎలాగూ ఆశ లేదుగా అందుకే ఒక్క బంగారు గాజు మినహా మిగిలిన అయిదు తులాలు నాన్న వద్దంటున్నా అమ్మించాను మీ సంతోషం కన్నా నాకి బంగారం ముఖ్యం కాదు అందుకే అమ్మించి మీ కిష్టమైన సుజికీ తెప్పించాను అంది

ఆ నోరు వెళ్ళబెట్టేశాడు మూర్తి

అదేవిటి? అలా విస్తుపోతారు? అంది సీత

ఆడవాళ్ళకు బంగారమంటే విపరీతమైన మోజు ప్రాణం కూడా అటువంటిది సీత తన సంతోషం కోసం తన వంటిమీది బంగారం సైతం అమ్మించిందనగానే అతని మన...

## ఆదర్శం మాటున

తనపైఆమెకు గల ప్రేమకు

ప్రేమ నిండిన కళ్ళతో తనవంక చూస్తున్న భర్తను చూసి తేలిగ్గా నిట్టూర్చింది బంగారం అమ్మా ననగానే ఎక్కడ కోప్పడతాడో ననుకుని భయపడిందింతసేపు అతనేమనక పోయేసరికి కాస్త ధైర్యం వచ్చి తన మనసులోని విషయాన్ని చెప్పేసింది

చూడండి! మీరు కట్నం లేకుండా నన్ను వివాహం చేసుకుని అందరిచేత ఆదర్శమూర్తి అని కొనియాడ బడుతుంటే నేనెంతగా సంతోషంతో పొంగిపోయేదాన్నో మీకు తెలియదు నా అదృష్టానికి నేనెంతగా మురిసి పోయేదాన్నో గర్వపడేదాన్నో కూడా మీకు తెలియదు అటువంటి నేను మీరు సుజికీ కొనిమ్మని నాన్నగారిని అడుగమనగానే ఎంతో బాధపడ్డాను నా

అంచనాలు తలక్రిందులై నందుకు కుమిలి పోయాను కానీ నేనిక్కడికి వచ్చే ముందు రోజు మీ నాన్న బంగారం పెట్టకున్నా నేను నిన్ను పెళ్ళి చేసుకునే వాణ్ణి అని మీరనగానే నా మనసెంతో తేలికైం దాక్షణాన అప్పుడే నాకు యీ బంగారం అమ్మించి మీకు సుజికీ కొనివ్వాలని నిర్ణయించుకున్నా మీ సంతోషం బంగారం కన్నా విలువైంది నాకు మీకు చెపితే మీరు ఒప్పుకోరని ఇక్కడికి వచ్చాక బండి కొన్నాక మీతో చెప్పాలని తీర్మానించుకున్నా నేను నా వంటిమీద బంగార మమ్ముతానంటే నాన్న ఒప్పుకోలేదు కానీ నేనే మొండిగా ఒప్పించాను

ఇకపోతే మీరు సుజికీ కొనిమ్మని వుగాది పండుగకు వచ్చినపుడు నాన్నని మీ రడుగమన్నా నేనడగ లేదు ఎందుకో తెలుసా? నేనా విషయం అడిగితే అది తప్పక మీ ప్రోద్బలమే అని నాన్న అనుకుంటారు మిమ్మల్ని ఎంతో వున్నతంగా వూహించు కుంటున్న ఆయన నేను సుజికీ అడిగిన మరుక్షణమే మీ గురించి నీచంగా అనుకుంటారు ఎంత కంటే ...

ఆ దబ్బు లాగాలని చూస్తున్నా రనుకుంటారు అందుకే అందుకే మీరడగమన్నా నాన్నను నేనడగలేదు కారణం మీరు నాన్నగారి దృష్టిలో ఆదర్శమూర్తిగా వున్నతవ్యక్తిత్వం గల వారిగా నిలిచిపోయారు ఆ భావన ఆయనలో కలకాలం అలాగే వుండాలనే నా కోరిక ఏ భార్య అయినా తన భర్త అందరి దృష్టిలో వున్నత మూర్తిగా వుండాలనే కోరుకుంటుంది ఇందులో నా తప్పుంటే క్షమించండి అంది సీత తలవంచుకుని

సీతా! ఆనందంతో అప్రతిబుడై చూశా డామె వంక మూర్తి

తన గౌరవాన్ని తన వ్యక్తిత్వాన్ని కాపాడ్డం కోసం తన వంటిమీది బంగారాన్ని సైతం అమ్మించి మామగారి దృష్టిలో తను గొప్పగా నిలవాలని ఆశించిన భార్యపై అంతులేని ప్రేమానురాగాలు కలిగాయి మూర్తికి

సీతా! నా కళ్ళు తెరిపించావు నిన్ను భార్యగా పొందిన నేనెంతో అదృష్టవంతున్ని అన్నాడు మనస్ఫూర్తిగా ముప్పిరిగొన్న మమతాను రాగాలతో భార్యను అక్కున చేర్చుకొంటూ

తేలికపడ్డ మనసుతో అతని గుండెలకు తల ఆనించుకుని నిట్టూర్చింది సీత

* * * *

ప్రయాణమై వెళుతున్న కూతుర్ని చేరబిలిచి తన మెడలోని మంగళసూత్రపు సరడును కూతురి కిచ్చింది సరస్వతమ్మ

అమ్మా! ఏమిటిది! నీవు పసుపుత్రాడు కట్టుకుని నాకి సరుడిస్తావా? అంది బాదగా సీత

ఫరవాలేదమ్మా! నాకేం పెద్దదాన్ని పసుపుత్రాడు వేసుకున్నా ఎవరేమనుకోరు నిన్ను బోసిమెడలో ఎలా పంపుతా ననుకున్నావే? అంది సరస్వతమ్మ కూతురి తలపై చెయ్యి వేసి నిమురుతూ

ఆ మాటలు వింటున్న మూర్తి అంతరంగం సిగ్గుతో ముడుచుకు పోయింది కట్నం తీసుకొని తనకంటె ఆదర్శమూర్తిగా అతని అంతరంగాన

# సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? – చర్చ

## అభిలషణీయమే !



సెక్స్ ఎడ్యుకేషన్ యొక్క ఆవశ్యకతను నొక్కి వక్కాణించాయి- నాగార్జున విశ్వ విద్యాలయ విద్యార్థినీ విద్యార్థుల వ్యాసాలు మన సమాజంలోని ప్రస్తుత పరిస్థితులను నిశితంగా పరిశీలించి చూస్తే మన విద్యా విధానంలో సెక్స్ ఎడ్యుకేషన్‌ను ప్రవేశపెట్టడం సర్వే సర్వత్రా శ్రేయస్కరం అనిపించక మానదు

'దేవుడిచ్చిన ఫలాన్ని తుంచేయడం పాపం అనే కుటుంబ నియంత్రణా వ్యతిరేకులైన బొమ్మలు అశ్లీల సాహిత్యంలో మ్రగ్గి చౌకబారు విజ్ఞానంతో నిర్వీర్యమైపోతున్న యువత సామూహిక మానభంగాలలో సుఖాన్ని వెదుక్కునే ప్రబుద్ధులకు ఆటపట్టయిపోతున్న మన సమకాలీన సమాజం సెక్స్ పరంగా ఎడ్యుకేట్ కావలసిన అవసరం ఎంతయినా ఉంది.

ఇప్పుడిప్పుడే యవ్వన ప్రాంగణంలో అడుగుపెట్టే భావి భారత పౌరులైన బాల బాలికలను చౌకబారు ఆలోచనల నుంచి తప్పించి వారి విలువైన కాలాన్ని వ్యర్థం కానీయకుండా వారికి మానవ జననాంగాల వ్యాపార ధర్మాలను విప్పిచెప్పి శాస్త్రీయ పరమైన అవగాహన కలిగించటం అభిలషణీయమే. తద్వారా వారు పైశాచిక కృత్యాలబారి పడకుండా మానవతా విలువలు కలిగి ఉత్తమ పౌరులుగా రూపుదిద్దుకుంటారనడంలో సందేహంలేదు.

–పాట్నీడి చక్రరావు, కొత్తరోడ్, విశాఖపట్నం

## లోపం తీరాలంటే....?



సెక్స్ మానవ జీవితంలో ఒక ప్రధానం అయిన విషయం. మనం అన్ని రకాల సమస్యల గురించి, విషయాల గురించి నేర్చుకుంటున్నప్పుడు సెక్స్‌ను కూడా తప్పక నేర్చుకోవలసిందే! సెక్స్ పట్ల సరిఅయిన అవగాహన లేకపోవడం వల్ల ఎన్నో కుటుంబాలు నాశనమవుతున్నాయి.

కొంతమంది చెబుతుంటారు పిల్లలకు ఇప్పటి నుండే సెక్స్‌ను గూర్చి చెబితే వారు చెడిపోయేందుకు ఆస్కారమున్నదని మనిషి చిన్నతనంలో ఎలా పెరుగుతాడో పెద్దయ్యాక కూడా అలానే ప్రవర్తిస్తాడు

బయటి ప్రపంచం నుండి నేర్చుకున్న వాటి నుండి దుష్ప్రభావం వారిపై పడకముందే తల్లిదండ్రులు సెక్స్ గురించి ఆరోగ్యకరమైన నైతికపరమైన విధానంలో తమ పిల్లలకు తెలియజెప్పవలసి ఉంది కానీ వారందుకు సిగ్గుపడుతూంటారు ఆ లోపం తీరాలంటే సెక్స్ ఎడ్యుకేషన్ అవసరం

–చింతా సురేష్‌బాబు సింగరాయకొండ

## దురభిప్రాయం పోతుంది



మనిషికి తిండి ఎట్టా నీరు గూడు ఎంత అవసరమో సెక్స్‌కూడా అంతే అవసరం సెక్స్ నేరంకాదు పాపం అంతకన్నా కాదు జీవితంలో ఆనందాన్ని, సౌఖ్యాన్నీ, మధురానుభూతినీ కలిగించేది కూడా సెక్సే. ఇప్పుడు లభ్యమవుతున్న చౌకబారు సెక్స్ సాహిత్యం, సినిమాలు, బ్లూఫిలింలు యువతీయువకుల్లో ఉద్రేకాల్ని రెచ్చగొట్టి, వారి మానసిక పరిణితిపై చెడు ప్రభావం కలుగజేసి, పెడమార్గం పట్టిస్తున్నాయి. కాబట్టి ప్రభుత్వమూ, విద్యా సంస్థలూ, మేధావులు 'సెక్స్ ఎడ్యుకేషన్' అవసరాన్ని గుర్తించాల్సిన సమయం వచ్చింది. విద్యా సంస్థల్లో యువతీయువకులకు వేర్వేరుగా ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించడం ఎంతో ఉత్తమమైనవిధానం. విద్యలో పరిజ్ఞానాన్ని పొందిన యువతీ యువకులు వారి భావి జీవితంలో సాంసారిక జీవితాల్లో వెలుగు నింపుకుంటారు. ఆడ లేక మగపిల్లల పుట్టుకకు స్త్రీయే కారణమనే దురభిప్రాయం 'సెక్స్ ఎడ్యుకేషన్' వల్ల తప్పకుండా రూపుమాసిపోతుంది.

-సూర్యదేవర జోగేశ్వరరావు ఇబ్రహీంపట్నం

## అనవసరం



సెక్స్ అనేది పనిగట్టుకొని పాఠాలు చెప్పించుకుని నేర్చుకునేంత గొప్ప విద్యకాదు. ప్రకృతి నేర్పే ఎన్నో విద్యలలో సెక్స్ ఒకటి.

సెక్స్ అంటే కొందరిలో ఉండే భయాన్ని, అసహ్యాన్ని పారద్రోలాలంటే సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమని కొందరు వాదిస్తున్నారు. అలా సెక్స్ మీద భయం ఉన్నవాళ్ళు నూటికి ఏ పదిమందో ఉంటారు ఆ పదిమందికోసం మిగతా 90 మంది మీద బలవంతంగా సెక్స్ పాఠాలు రుద్దటం అనవసరం

సెక్స్ పట్ల కొందరికున్న భయాలను డాక్టర్లు పారద్రోలగలరు సిగ్గు వలన డాక్టర్ల దగ్గరకు వెళ్లలేరనవచ్చు డాక్టరుతో చెప్పుకోవటానికే సిగ్గుపడే వారు వందమందిలో కూర్చొని సెక్స్ పాఠాలు మాత్రం వినగలరా?

ఆ మధ్య ఎక్కడో చదివాను అమెరికాలో సెక్స్ విచ్చలవిడిగా ఉండటం వలనే ఆర్థికంగా అంత ముందంజ వేసిందని ఈ మాట వింటే నవ్వు వస్తున్నాది అసలు సెక్స్ పెరిగితే ఆర్థికంగా ఎలా ఎదుగుతామో తెలియదు కానీ ఇటు రోగాలకు అటు జనాభాకు నిలయంగా మాత్రం మారతాము

కనుక సెక్స్‌లాంటి సున్నితమైన వానిని పాఠాల రూపంలో వల్లించి, పాడు చేసేకంటే, పడకటింటికే పరిమితం చేస్తే పవిత్రంగా ఉంటుందని నా అభిప్రాయం.

-టి. కమలాకరప్రసాద్, విశాఖపట్నం

## ప్రమాదభరితం



సెక్సు విజ్ఞానం విదార్థి దశ నుండి బోధించడమే పాశ్చాత్య దేశాలార్థికాభివృద్ధికి కారణమనడం శోచనీయం!

అమెరికాలాంటిదేశాల్లో జరుగుతున్న సెక్సు నేరాలకంటే మనదేశపు శాతం తక్కువే. సుఖవ్యాధులు, యిప్పటి యియిడ్సు వ్యాధి వ్యాప్తి చెందిందెక్కడనుండి!

వాత్స్యాయన కామసూత్రాలు యిచ్చే సునిశిత సెక్సు విజ్ఞానం కంటే ఏ పాశ్చాత్య సెక్సు గ్రంథ వివరణ యివ్వగలదు? మన పురాణగాథలు కావ్యాలు భౌగోళిక చారిత్రిక సన్నివేశాలతో బాటు ఋతువుల ప్రభావం జన్యు సమ్మేళనాల వల్ల కలిగే సంతతి ధీమంతం వగైరా ఎన్నెన్నో శాస్త్రీయ విషయాలు అందిస్తున్నాయి అందుచేత మనకు కావలసింది మన కావ్యాలు అర్థం చేసుకొనే విద్య

సెక్సు జ్ఞానం జీవిత అంతర్వాహినిగానే ఉండాలి గాని మాంసం తింటున్నామని ఎముకలు మెడకు వేళ్లాడేసుకోవడం ఏహ్యం

కాబట్టి సెక్సు జ్ఞానం పేరుతో స్వేచ్ఛా కామ యువతలో పెంచడం ప్రమాదభరితం

ఎస్ ఎస్ రామవర్మ / విజయనగరం



"పరాజిత"తో తులసి

## త్వరలో "ప్రళయం"

"బాల్యంలో నే ఇల్లు వదలి వెళ్ళి మిలిటరీలో చేరి, పదిహేనేళ్ల తర్వాత స్వస్థలానికి తిరిగొచ్చిన ఓ యువకుడు ఒక జమిందారు అహంకారానికి, అమానుషత్వానికి తన తమ్ముడు బలియైపోయిన

విషయం తెలుసుకుని ప్రళయం సృష్టిస్తాడు సంచలనభరితమైన ఇతివృత్తం అన్నారు సాయిచంద్ ఈయన సమర్పించే సాయి ఎస్ కమర్షియల్స్‌వారి ఈ చిత్రంలో ఈయనతో పాటు చరణ్‌రాజ్ వేలు రాళ్ళపల్లి జీవా చలపతిరావు నర్రా రామరాజు బెనర్జీ సాయికుమార్ చిత్ర విజయ జానకి రాణి లక్ష్మిప్రియ ప్రముఖ మలయాళ విలన్ టి జి రవి నటించారు కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వం రాజసేన సంగీతం కె వి మహదేవన్ నిర్మాత డాక్టర్ త్రిపురనేని రమేష్‌బాబు నిర్వాహణ కె రాధాకృష్ణ

## అడవిరాజా రెండో షెడ్యూల్

వన్య మృగాలను సైతం ఎంతో ఆత్మీయతతో చూసుకునే ఫారెస్ట్ ఆఫీసర్‌గా శోభన్‌బాబు ఓ ఎన్నారు మొదటి షెడ్యూల్ పూర్తయింది

# సినిమా



తిరుమలై అడవుల్లో ఊటీలో మే 12ను చి జూన్ 15 వరకు రెండవ షెడ్యూల్ చివరి షెడ్యూల్ జూలై 1 నుంచి 15 వరకు అన్నారు కె మురళీమోహనరావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కైకాల సత్యనారాయణ సమర్పించే రమా ఫిలిమ్స్ వారి ఈ చిత్రంలో రాధ సత్యనారాయణ ప్రభాకరరెడ్డి గొల్లపూడి మారుతీరావు నూతన్‌ప్రసాద్ గిరిబాబు వీరభద్రరావు రాళ్ళపల్లి చలపతిరావు శ్రీలక్ష్మి



పరశురాముడులో కృష్ణ, కీర్తి

## శేషాలు

-జి. వి. జి.

కాకినాడ శ్యామల మాస్టర్ అర్జున్ నటిస్తున్నారు సత్యానంద్ వేటూరి చక్రవర్తి కె ఎస్ హరి బాస్కరరాజు నాగేశ్వరరావు సత్యం సతీం సాహుల్ కోటేశ్వరరావు పట్టాబి శ్రీనివాసరావు జ్యోతింద్రనాధ్ ప్రభృత సాంకేతిక వరంతో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న కె నాగేశ్వరరావు పారెస్ట్ ఆఫీసర్ ప్రేమకు నోచుకున్న ఏనుగులు కోతి చిలక ఎలుగుబంటి కూడా ఈ చిత్రంలో పాల్గొం



ఆదిదంపతులు లో జయసుధ అక్కినేని

ఉన్నాయి అన్నారు

### వంశీ లేడీస్ టైలర్

రాకెట్ యుగంలో అడుగెట్టినా– రాతియుగం నాటి మూఢనమ్మకాలను వీడని వారి ఛాందసత్వాన్ని వినోదపరంగా వివరించే అపురూపమైన ఈ కథలో శృంగారం కూడా చోటు చేసుకుంది అన్నారు వంశీ ఈయన కథ స్క్రీన్ప్లే దర్శకత్వంలో కె శారదాదేవి నిర్మించే స్రవంతి మూవీస్ వారి ఈ చిత్రంలో రాజేంద్రప్రసాద్ శుభలేఖ సుధాకర్ కనకాల దేవదాస్ మల్లికార్జునరావు ప్రదీప్ శక్తి మాలి థమ్ అర్చన వై విజయ దీప గౌరి మరో నవనటి పాత్రధారులు తనికెళ్ళ భరణి మాటలు సీతారామశాస్త్రి పాటలు ఇళయరాజా



# పాఠకులకి సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు!

తెలుగు సినీ ప్రేక్షకుల అభిమానాన్ని విశేషంగా చూరగొని 1985 వ సంవత్సరానికి ఉత్తమనటిగా ఎన్నికైన సుప్రసిద్ధ నటీమణి విజయశాంతి ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తారని తెలియ చేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంభించే ఈ శీర్షికకి తమ ప్రశ్నలని పంపవలసిందిగా పాఠకులని కోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో విజయశాంతి ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నకి ప్రతివారం ఆమె ఆటో గ్రాఫ్ ఉన్న కలర్ ఫొటో బహుమతిగా లభిస్తుంది

(ఈ శీర్షికకిప్రశ్నలని పంపే వారు క్రింద ఇచ్చిన కూపన్ పూర్తి చేసి విజయశాంతి సమాధానాలు ఆంధ్రసచిత్రవారపత్రిక గాంధినగరం, విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి
ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాసి పంపాలి విడిగా రాసిన వాటిని పరిశీలించటం జరగదు
పాఠకులు ఉత్సాహంతో ఈ అవకాశాన్ని ఉపయోగించుకోగలరని ఆశిస్తున్నాము -సం)

కూపన్

## ఆంధ్రసచిత్ర వారపత్రిక
## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న . ______________________________

______________________________

______________________________

పంపిన వారి పేరు ______________________________

పూర్తి చిరునామా ______________________________

______________________________

______________________________

(Continued column)

సంగీతం, హరి అనుమాలు ఛాయ, తోటయాదు శిల్పం, అనిల్ మల్నాడ్ కూర్పుతో వేమూరి సత్యనారాయణ నిర్మాణ సారథి.

## ఎం. ఎస్. రెడ్డి చిత్రావళి

మంచి వైపు, మంచి ఆలోచనల వైపు ప్రజలను నడిపేదే మంచి సినిమా - అనే ఉత్తమాభిరుచి గల నిర్మాత, సహజ కవి, మధుర వక్త, ఎం. ఎస్. రెడ్డి "పల్నాటి సింహం" తర్వాత మరికొన్ని చక్కని చిత్రాలను ప్లాన్ చేశారు.

డాక్టర్ రావూరి భరద్వాజ కథ సమకూర్చిన "ఓ ప్రేమ కథ"లో ప్రేమగా రాధిక, నాయకుడుగా సర్వదమన్ బెనర్జీ, ఇతర పాత్రలలో సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు




ఆదిగాగల వారు పాల్గొంటున్నారు మల్లెమాల మాటలు, పాటలు రాశారు ఎం రంగారావు సంగీత దర్శకుడు రాజశ్రీ దర్శకత్వంలో జూన్ నుంచి షూటింగ్.

అక్టోబర్‌లో ప్రారంభమయ్యే కిన్నెరసాని ప్రకృతిలో పుట్టి పెరిగిన ఒక ప్రకృతి కన్య ప్రణయగాథ. ఆ కన్య సుహాసిని కోడి రామకృష్ణ దర్శకుడు కిన్నెరసాని ప్రాజెక్ట్ ప్రాంతంలో మొత్తం చిత్రీకరణ జరుగుతుంది

నవంబర్ డిసెంబర్ మాసాల్లో కృష్ణ హీరోగా ప్రారంభమయ్యే భారీ చిత్రానికి కె రాఘవేంద్రరావు దర్శకుడు

ఇవికాక "ప్రతాపరుద్రుడు చారిత్రాత్మక చిత్రం, కోడిరామకృష్ణ దర్శకత్వంలో పల్లెలో గోపాలుడు" హిందీ చిత్రం నిర్మించడానికి కౌముది అధినేత సన్నాహాలు చేస్తున్నారు

(66వ పేజీ చూడండి)


రాధా మాధవ చిత్ర
శ్రీవేమన చరిత్ర
నిర్మాత
మండవ గోపాలకృష్ణ
దర్శకత్వం
సి.యస్.రావు B A, Litt
సంగీతం సత్యం
ఫోటోగ్రఫీ హరి అనుమోలు

# జయసుధ సమాధానాలు



**మాధవీలత, హన్మకొండ**

'సుహాసిని' గురించి మీ అభిప్రాయం.

మంచి నటి!

**జి. రమణీమోహన్, కడప**

పురుషుడు స్త్రీని , స్త్రీ పురుషుడ్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికి ఎంత కాలము పడుతుందంటారు?

వారి వారి అభిప్రాయాల్ని బట్టి వుంటుంది.

**జి మురళీధర్, కర్నూలు**

ఇన్నేళ్ల మీ సినీ జీవితంలో సంపాదించింది ఏమిటి?

మీ వంటి చక్కని అభిమానుల యొక్క అభిమానం

**నాగండ్ల వెంకటేశ్వరరావు, అమ్ముపాలెం; పి వి సతీష్‌కుమార్, హనుమాన్‌జంక్షన్**

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారైన నందమూరి తారక రామారావు గారిపై మీ అభిప్రాయం ఏమిటి?

చాలా మంచివారు అన్నదే నా అభిప్రాయం!

**వరప్రసాద్, ముత్తుకూర్**

మీ నట జీవితంలో తారాస్థాయిని దేన్నిబట్టి అందుకోగలిగారు?

అభిమానులను అలరించే నటన సమయస్ఫూర్తితో!

**వై. యల్. రమణ, పులిచెర్ల**

అక్కినేని వారసుడు 'అక్కినేని నాగార్జున'పై మీ అభిప్రాయం?

అభివృద్ధిలోకి రాగల మరో చక్కని మంచి నటుడు.

**వై. బాలాజీ, చిత్తూరు**

మీరు నటించే ప్రతి చిత్రంలోని ప్రతి పాత్రలోనూ జీవంపోసి నటిస్తారు మీ సొంత చిత్రం ఏదన్నా ఉందా?

ప్రతి చిత్రం సొంత చిత్రమనుకునే నటించాలి. ప్రతి పాత్రను అర్థం చేసుకుని ఆ పాత్రకు న్యాయం చేయాలన్నదే నా అభిప్రాయం తమ . పర భేదాలు అనేవి నాకు లేవు

**పి. యస్. వి ప్రసాద్, రాజమండ్రి**

మిమ్మల్ని ఝాన్సి లక్ష్మి పాత్రలో చూడాలని వుంది నా కోరిక తీరుతుందా?

చక్కని పాత్రల్లో చూడొచ్చు ఝాన్సి పాత్రల్లో నటించాలంటే నేనూ చూడాల్సిందే! వీలయితే వచ్చే సం రము మీ కోరిక నెరవేరుతుందేమో!

**ఎ. క్రాంతి, శృంగవరపుకోట**

నాటి చిత్రాలకూ నేటి చిత్రాలకూ స్త్రీ పాత్రలో ఎంతో తేడా కన్పిస్తుంది కారణం చెప్పగలరా?

మారుతున్న జనరేషన్ 'పెరుగుతున్న ట్రెండ్

**టి కృష్ణవేణి, కరకుదురు**

సినిమా హీరోయిన్లు తమ నిజ జీవితంలో చేసుకున్న వివాహ జీవితాలపై మీ అభిప్రాయం?

సదభిప్రాయమే!

**యస్. వెంకటేశ్వరరావు, హైదరాబాద్-7**

కర్ణునికి కవచకుండలాలు భారం కానట్లే నటునికిగానీ, నటికిగానీ సినిమా జీవితం భారం కాదని నా ఉద్దేశ్యం అదే నిజమైతే మీరెందుకు సినిమారంగం నుండి విరమించాలనుకున్నారు?

నేనింకా నట జీవితం నుంచి విరమించలేదుగా!

**క్రాంతి, విజయనగరం**

స్త్రీ సమస్యాత్మక చిత్రమంటే అనవసర క్లబ్ డాన్సులు ద్వంద్వార్థ పాటలతో చిత్రాలు తీసే యీనాటి నిర్మాతలకు ఏ శిక్షవిధించాలి?

ఏ తరహా చిత్రాలు కావాలో మరి మీరు చెప్పొచ్చుగా?

**డి నందకిశోర్, హైదరాబాద్**

మీకు కవలపిల్లలు పుడతారని నాకు కల వచ్చింది మీ అభిప్రాయం?

మీ అభిమానానికి నా కృతజ్ఞతలు.

☐

ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎంపిక కాలేదు.

-సం

డా॥ అక్కినేని నటించు

దాసరి నారాయణరావు



జయసుధ సమర్పించు

JSK జె.యస్.కె. కంబైన్స్

# ఆదిదంపతులు

నితిన్ కపూర్

సెల్వరాజ్-సత్యం-కృష్ణ-చలం-భీశెట్టి



# అభిమాన తారలపై అభిప్రాయం

బాలనటిగా చిత్రరంగ ప్రవేశంచేసి తారాపథంలోకి దూసుకుపోయిన అందాలతార, అగ్రశ్రేణి హీరోయిన్ శ్రీదేవి నా అభిమాన నటి పదహారేళ్ల వయసు, బంగారక్క, దేవత, కార్తీక దీపం, ఆకలిరాజ్యం, ప్రేమాభిషేకం మొదలయిన చిత్రాలలోని ఆమె నటన ఎంతో ప్రశంసనీయం ముఖ్యంగా 'వసంత కోకిల' చిత్రంలో కమలహాసన్‌కు దీటుగా ఎంతో చక్కని నటన ప్రదర్శించింది 'వసంత కోకిల'



చిత్రంలోని ఆమె పాత్రకు ఆమేసాటి అని చెప్పటానికి అత్యుత్తమమయిన ఆమె నటనే నిదర్శనం! కాని ఈ మధ్య ఆమె నటించిన చిత్రాలు మునుపటి చిత్రాల స్థాయిలో ఉండటంలేదు. అవి కూడా అతి తక్కువ సంఖ్యలో వస్తున్నాయి. హిందీ చిత్ర రంగంలో ప్రవేశించినప్పటినుండీ తెలుగు - చిత్రాల సంఖ్య తగ్గిపోయింది. ఇది ఆమె అభిమానులకు చాలా నిరుత్సాహకరమైన విషయము. ఇకమీదనైనా తెలుగు చిత్రసీమకు దూరమవకుండా కళాత్మక విలువలున్న చిత్రాలలో ఉత్తమమయిన పాత్రల నెన్నుకుని నటించి, గ్లామర్ తారగానే కాకుండా, సహజనటిగా రాణించాలని, తెలుగు ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోవాలని శ్రీదేవి అభిమానిగా ఆకాంక్షిస్తున్నాను.

—కొండూరి సుజాత, బాకారం,
హైదరాబాదు

* * *

డైనమిక్ హీరోయైన శ్రీ చిరంజీవిగారు నా అభిమాన నటుడు. ఆయన నటించిన అన్ని చిత్రాలు చూసాను, చూస్తుంటాను. నిజంగా స్టెప్స్, మరియు ఫైట్స్ విషయంలో ఆయనకు ఆయనేసాటి. కాని ఈ మధ్యకాలంలో (ఖైదీ తరువాత) ఆయన



ధరించిన పాత్రలు ఒకే విధంగా వుండి అభిమానులకు, అందరికి నిరుత్సాహాన్ని అందజేస్తున్నవి కావున ఇకమీదట నుండి ప్రతి ఒక్క చిత్రానికి మార్పులు చేకూరేలా చూసుకొని మమ్మల్ని ఆనంద పర్చగలరని ఆశిస్తున్నాను

ఎం లక్ష్మీనారాయణ, బరంపురం,
(ఒరిస్సా)

* * *

నా అభిమాన నటి సుమధుర హాసిని సుహాసిని ఆ నాటి సావిత్రి వారసురాలు మొన్నటి వాణిశ్రీ, మొన్నటి వాణిశ్రీ వారసురాలు యిప్పటి జయసుధ, యిప్పటి జయసుధ వారసురాలు నేటి మేటి సుహాసిని అని నటభూషణ్ గార్చిచే జ్యోతిష్యం చెప్పించుకున్న సుహాసిని కట్టు బొట్టు తీరులో తెలుగు సంస్కృతిని కనబరుచు చుండుట వలనే, తెలుగు ప్రేక్షకుల ఆదరాభిమానములను చూరగొన్నారనుటలో సందియము లేదు. ఆమె "జాకీ"లో హుషారుగా, "పట్నం పిల్ల— పల్లెటూరి చిన్నోడు"లో అల్లరిగా, "స్వాతి"లో ధీరురాలిగా, "స్రవంతి"లో సహనశీలిగా, "లేడీ డాక్టర్"లో సహజమైన స్త్రీగా, "సింధు భైరవి"లో సంగీత ప్రియురాలిగా ఏ విధమైన పాత్రనైన మెప్పించ గలనని నిరూపించారు. ఆమె కుటుంబపరమైన సినిమాలలో నే కాక ముందు ముందు పౌరాణిక, వీరనారీమణుల పాత్రలను కూడ పోషించాలని కోరుకుంటున్నాను. సుహాసిని డబ్బింగ్ కాకుండా స్వయముగా సంభాషణలు చెబితే బాగుంటుంది.



ఆమెకు యీ అభిమాని యిచ్చే చిన్న సలహా— కనసం పది సంవత్సరముల వరకైనా సినీ పరిశ్రమ నుండి నిష్క్రమింప వలదని.

కాజ హనిత, యన్. ఆర్. పేట,
ఏలూరు.

* * *

ఏ పాత్రలో నైనాసరే.... లీనమైపోయి... ఆ పాత్రకుపూర్తిగా న్యాయం చేకూర్చి నటనలో తనకు తానే సాటి అనిపించుకునే నటి... జయసుధ.. సావిత్రి, వాణిశ్రీలతోనే వెళ్ళిపోతున్న ఆ నాటి పాత్రలకు ఈ నాడు జయసుధ అవలీలగా పోషిస్తూ... అందర్ని మెప్పిస్తోంది. అల్లరి పిల్లగా చలాకీ నాయికగా బరువైన పాత్రలు పోషిస్తూ నిబ్బరమైన నటిగా ప్రతిపాత్రనూ ఛాలెంజ్‌గా తీసుకొని ఆ పాత్రకు జీవంపోసే నటి జయసుధ, 'సుజాత' పేరుతో చిత్రరంగంలో ప్రవేశించి 'జయసుధ' పేరుతో ఆంధ్రప్రేక్షకుల గుండెల్లో నిలిచిపోయింది ఒకసారి జయసుధ చిత్ర రంగం నుంచి విరమించాలనుకున్నారు కానీ, అఖిలాంధ్ర ప్రేక్షకలోకం అభిమానాన్ని కాదనలేక మళ్లీ ఆ నిర్ణయం మార్చుకున్నందుకు ఆమెకు మా కృతజ్ఞతాభివందనం అపూర్వమైన నటిగానే ఆమెను చూస్తున్న మనం అతిత్వరలో ఆమెను దర్శకురాలిగా కూడా చూడబోతున్నాము ఆమె దర్శకత్వం వహించే చిత్రం ఆమెలాగే, అందంగా, ఆత్మస్థైర్యంతో నిర్మించే ఆదిదంపతులు...



అపూర్వంగా. వుండాలనీ వుంటాయనీ ఆశిస్తున్నాము జయసుధలాంటి శ్రీపురూపమైన నటి లభించడం నిజంగా తెలుగు ప్రేక్షకులు చేసుకున్న అదృష్టం ముందు ముందు ఆమె యింకా ఎన్నో ప్రతిష్టాత్మకమైన పాత్రలు పోషించాలనీ ఎన్నో కళాత్మకమైన చిత్రాలు నిర్మించాలనీ, మంచి చిత్రాలను దర్శకులురాలిగా అందించాలనీ ఆశిస్తున్నాను

—వై ఉదయ్‌కుమార్, రాయదుర్గం

* * *

నటన అన్న పదానికి అర్థం చెప్పగల నటి కుమారి భానుప్రియ ఆమె నటనంటే నాకు చాలా ఇష్టం ప్రారంభ చిత్రం 'సితార' లోనే చక్కటి నటన హావభావాలు ప్రదర్శించి అందరినీ మెప్పించింది. ఆమె ఎటువంటి పాత్రనయినా పోషించగలదు అనటానికి "అన్వేషణ", ప్రేమించు పెళ్లాడు, 'అమెరికా అల్లుడు ఉదాహరణలు గృహలక్ష్మి, ముసుగుదొంగ లాటి గ్లామర్ పాత్రలు వెయక మంచి నటన హావభావాలు ప్రదర్శించటానికి అవకాశమున్న పాత్రలు ధరించాలని మనవి



ఆలాపన'లో వారి పాత్ర సితార, అన్వేషణ లను మరిపించగలదని అనుకుంటున్నాం

—సింగం దత్తాత్రేయమూర్తి,
లాయర్‌పేట, ఒంగోలు □

# వారఫలం

13-6-1986 శుక్రవారం నుండి 19-6-1986 గురువారం వరకు

★ **మేషం :** పెద్ద మొత్తంగా చేతికి అందవలసినది పలుచబడిపోతుంది వ్యాపారాన్ని బాగా పెంచాలని అదికంగా వస్తువులు సేకరించుకొంటారు సమయానికి డబ్బు అందుటలో ఎలాంటి ఆక్షేపణలేదు స్త్రీలకు ఉద్యోగరీత్యా అనుకూలం, మిత్ర సమాగమం, శుభ కార్య ప్రస్తావనలు

★ **వృషభం :** మీ వలన యింతకుముందు సహాయం పొందినవారు మరలా సహాయంకోరి సిద్ధమవుతారు ఉంటే యివ్వటం మంచిదేగాని, మీకూ వ్యాపారాలకు, వ్యవహార సమర్థనకు అంతో యింతో అవసరమేగా' ద్రవ్యార్జన యందు ఎంత చాకచక్యం అవసరమో, ఖర్చుచేసేటప్పుడు అంత జాగ్రత్త అవసరం. స్త్రీలకు ఉద్యోగరీత్యా పెంపు

★ **మిధునం :** ఇతరుల వ్యవహారాలలో జోక్యం పుచ్చుకోకండి కాలం అనుకూలంగా లేనపుడు అనవసరమైన వ్యవహారాలకు పోకండి చేస్తున్న వృత్తిని జాగ్రత్తగా చూచుకోండి మాట పట్టింపులు రాకుండా చూచుకోండి స్త్రీలకు చేయక, చేయక చేసిన వ్యవహారం కష్టదాయకం గ్రహించాలి

★ **కర్కాటకం :** మిత్రులు కాని, కాకపోని మీ వ్యవహారాలు గమనిస్తూ ఉంటారు మిమ్ముల కొంత తికమక పాలు చేయాలని చూస్తూ ఉంటారు ఉద్యోగరీత్యా కూడా చిక్కులు రానున్నవి. జాగ్రత్తగా సంచరించాలి కాస్త రాబడి హెచ్చింది గదా!అనుకొంటే, అంతకు ఖర్చు కూడా కనిపిస్తుంది స్త్రీలకు వృత్తియందు, ఆరోగ్య-మందు సుఖ సౌఖ్యాలందు పెంపు కనిపిస్తుంది

★ **సింహం :** ధర్మ కార్యాచరణమునకు సరియైన కాలం పరుల వ్యవహారాలందు జోక్యం పుచ్చుకొనుట శ్రేయస్కరంకాదని గ్రహించాలి, ఉత్తముల సాంగత్యానికి ప్రాకులాడుటయందు పట్టుదల విడవకండి స్త్రీలకు: అనుకొన్న విధంగానే ఉద్యోగమందు పెంపు కనిపిస్తుంది అప్పులుంటే రాబట్టుకొనుటకు అదునైన కాలం

★ **కన్య :** అన్ని విదాలా మేలైన కాలం సాహిత్య రంగాన బాగా అనుకూలత కనిపిస్తుంది ఇతరులను అవగాహన చేసికొని సంచరించుట అవసరం 'శని' గ్రహం బాగా అనుకూలంగా ఉన్నాడు వృత్తియందు వికాస ముంటుంది ఉద్యోగమందు పెంపు గల సమయం వారాంతాన ఆర్థికంగా దనాదాయం స్త్రీలకు అంతో యింతో చేతికి డబ్బు అందుతుంది రాజకీయంగా కొంత స్తిమితం చిక్కుతుంది ధనాఢ్యుల స్నేహం లభిస్తుంది

★ **తుల :** ఏ విధంగా వెనుకటి వారాలకన్నా 'ఉత్సాహజనకమైన వారం' అని అనుకొనుటకు వీలులేదు ఆశ్రయించి ఒకానొక వ్యవహారం సానుకూలం చేసికొగలరు స్త్రీలకు ఆదాయలోపం, ఆరోగ్యలోపం

★ **వృశ్చికం :** రాజకీయంగా ఈ దినాలు మీకు అనుకూలంగావు ఇచ్చిన డబ్బు రాబట్టుకొనుటకే కాలం సరిపోతుంది బంధుమిత్రుల సహాయం అపేక్షించినా అందని సమయం వృత్తియందు చికాకులున్నవి సమర్థుల స్నేహం వదలుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి స్త్రీలకు స్థిరాస్తిని గూర్చిన గొడవలు రేకెత్తగలవు

★ **ధనుస్సు :** వ్యాపారం బాగా జరుగగలదని, వ్యవహారం మీకే అనుకూలం కాగలదని, చేర్చి పెట్టిన రొఖం సమయానికి ఉపయోదపడగలదని, డబ్బు వ్యయం చేయటంలో ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిదని గ్రహింపగలుగుతారు స్త్రీలకు ఆదాయం, పనులందు అనుకూలం, ముఖ్యుల కలసికొనుట కవకాశం

★ **మకరం :** ఎందరో కావలసిన వారున్నారు ఎందరో డబ్బు యివ్వవలసిన వారున్నారు ఏం లాభం? సమయానికి ఒక్కరూ అక్కరకు రారని గ్రహింప గలుగుతారు మీరు మాత్రం పరోపకారం చేయటం మానుకోకండి ఆ గుణం మీ నైజగుణం స్త్రీలకు పరోపకారచింతన శుభవార్తాశ్రవణం, ఆరోగ్యమందు పెంపు చెప్పదగిన అంశాలు

★ **కుంభం :** వృత్తియందు ఏ మాత్రం పెంపు కనిపించదు వ్యాపార రీత్యా అనవసరపు గొడవలు, లాబాపేక్షకు పోయి చిక్కులు కొనితెచ్చుకోగలరు, కుటుంబంలో కలతలు రాకుండా, అనవసరపు ఖర్చులను పైబెట్టుకోకుండా చూచుకోవాలి స్త్రీలకు ఉద్యోగంలో మాటలు పడకుండా, తప్పులు చేయకుండా వారం గడపాలి

★ **మీనం :** మానశికంగా ఏమి బాగుండదు ఏ వ్యాధి లేకున్నా ఏదో ఉన్నట్లుగా బాదపడుతారు చాలమందికి రావలసిన డబ్బు అందకపోవటంతో చికాకు కనిపిస్తుంది అనవసరంగా మిత్రులతో గాని, పరిచితులతోగాని తగాదాలు రాగలవు ఒకదాని వెంట ఒకటిగా గ్రుక్క త్రిప్పుకోలేని యిబ్బందులు రావచ్చు స్థితియందు పెంపు కనిపించక పోవటం బాదాకరమే స్త్రీలకు నిశ్చితమైన శుభ కార్యాలు వాయిదాపడటం, వ్యర్థపుటాలోచనలు, వృధా కాలక్షేపం

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



అమృత్‌సర్‌లోని బంగారు గుడి ఆవరణలోకి పోలీసులని పంపించి శిక్కుల మత పరమైన బావాలకి బాద కలిగించారన్న ఆరోపణపై శిక్కుల ఉన్నతపీఠం అయిన అకాల్ తఖ్‌కి



చెందిన అయిదుగురు ప్రధానార్చకులు పంజాబ్ ముఖ్యమంత్రి, అకాలీదళ్ అధ్యక్షుడు అయిన శ్రీ సూర్జిత్‌సింగ్ బర్నాలాని దోషిగా నిర్ణయించి శిక్ష విదించారు ఆ శిక్షలో ఒక భాగంగా ఈయన వారంరోజులపాటు ఢిల్లీ సహ వివిద ప్రాంతాలలో ఉన్న గురుద్వారాలలో భక్తుల పాదరక్షలని శుభ్రం చేసారు ప్రచారంకోసం కాకుండా మతం మీద తమకి ఉన్న గౌరవంతో ఈ ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి అంగీకరించారు స్వార్థంకన్నా సేవకి ప్రాముఖ్యం ఇచ్చే రాజకీయవాదులు అరుదుగా ఉన్న ఈ కాలంలో బర్నాలా నిర్వహించిన ఈ సేవా కార్యక్రమం చెప్పుకోదగినది ఈ సేవా కార్యక్రమం తమలో ఎంతో ఉదాత్తమైన బావాలని కలిగించిందని, అంతఃశక్తిని పెంపొందించిందని, వైయ్యక్తిక క్షాళనకి ఈ శిక్ష తమకి వరప్రసాదం వంటిదని అన్నారాయన



శ్రీమతి డాలీ బసు పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసు కోడలు. శ్రీ ఉత్పలేందు చక్రవర్తి తీసిన టెలివిషన్ చిత్రం 'రంగ్'లో ఈమె ఒక పెయింట్ కంపెనీ జనరల్ మేనేజర్ భార్య పాత్ర పోషించింది 50 నిమిషాల పాటు సాగే ఈ హింది చిత్రం ప్రముఖ బెంగాలీ రచయిత సమరేష్‌బోస్ రాసిన నవల 'రంగ్' ఆధారంగా నిర్మింపబడింది జూన్‌లో జాతీయ కార్యక్రమాల ద్వారా దూరదర్శన్ ప్రేక్షకులకి దర్శనమిచ్చే ఈ టెలివిషన్ చిత్రం బహుళజాతి సంస్థలు కొన్ని అనుసరించే అక్రమ మార్గాలని బహిర్గతం చేస్తుంది □

# సీరియల్

# బలి కోరిన ప్రేమ

ఎం.జి.సౌజన్య

(గతసంచిక తరువాయి)

ఆయిదు రూపాయల చేంజ్ అందుకుంటూ ఒక విషపు నవ్వు ముఖాన చిలకరించుకుని, ఏవిఁటి మేడమ్ సడన్‌గా రూటు మార్చారు అటు రోడ్డు బాగుండదేమో? అన్నాడు రెండర్థాలు వచ్చేట్టు, రవికాంత్

దారి బాగుండలేదని ప్రయాణం ఆగుతుందా! పర్వాలేదు అక్కడికే వెళదాం! అంది అన్నపూర్ణ దృడంగా

ఆ హోటల్లో రూఫ్‌గార్డెన్‌లో టేబిల్ రిజర్వేషన్ దొరుకుతుందో లేదో! అన్నాడు కాంతిభూషణ్

ప్రయత్నిస్తే పోయే దేముంది!" బీ క్విక్! అంది అన్నపూర్ణ

ట్యాక్సీ పావుగంటలో హోటల్ పామ్‌గ్రోవ్‌కు చేరుకుంది

అన్నపూర్ణ రిసెప్షన్‌లో మాట్లాడి లిఫ్ట్‌లో పైకెళ్ళింది

అయిదో అంతస్తులో వున్న ఆ రూఫ్‌గార్డెన్ ఎంతో చల్లటి వాతావరణంలో ఆహ్లాదంగా వుంది

విదేశీయ పాప్ సంగీతం మంద్రస్థాయిలో వినబడుతోంది

ఇక్కడ చాలా హాయిగా వుంది డియర్! అన్నాడు కాంతిభూషణ్ కొంచెం ఆనందంతో వుండటం అన్నపూర్ణకూ ఆనందం కలిగించింది

సారీ మేడమ్! మిస్ అవంతిగారికి ఫోన్ వచ్చింది' అంటూ ఒక వెయిటర్ వచ్చి మెల్లిగా చెప్పాడు అన్నపూర్ణ లేచి టెలిఫోన్ బూత్ ఉన్న వైపు నడిచింది

అక్కడ రవికాంత్ ఎదురు చూస్తున్నాడు

నువ్వేనా ఫోన్‌చేసింది? ఎలిచింది? అంది అతని వైపు కోపంగా చూస్తూ

అది తెలుస్తూనే వుందిగా! అయితే యితనేనన్నమాట ఆ బంగారు పిచ్చుక!" పాపం గుడ్డివాడల్లే వుంది!? అన్నాడు మాటల్లో సానుభూతి కనబరుస్తూ

అన్నపూర్ణకు వళ్ళు మండి, నా వ్యక్తిగత విషయాలు నీ కనవసరం! నన్ను డిస్టర్బ్ చేయవద్దని ముందే నిన్ను హెచ్చరించాను!" ఇక నీ దారి నీది నా దారి నాది! అంది అక్కడి నుంచి వెళ్ళిపోయే ప్రయత్నంలో

**జరిగిన కథ-10:** ప్రమాదవశాత్తు మీంటల్లో పడటంవల్ల కాంతిభూషణ్‌కి కళ్ళు పోయాయి. అవంతి స్థానంలో అవంతిగా అన్నపూర్ణ కాంతిభూషన్‌తో నటించడం ప్రారంభించింది. ఎవరో అజ్ఞాత వ్యక్తి ఫోను చేయగా రమాదేవి, అన్నపూర్ణ హోటల్ ఏషియాకు బయలుదేరారు ఆ అజ్ఞాత వ్యక్తి రవికాంత్ అతనితో తనకిక ఎలాంటి సంబంధం లేదని కచ్చితంగా చెప్పి వచ్చేస్తుంది అన్నపూర్ణ అవంతిగా నటిస్తున్న అన్నపూర్ణతో మంచుతుఫాను ముందురోజు హిమాలయాలు దిగివస్తుండగా జరిగిన సంఘటన చెప్పసాగాడు కాంతిభూషణ్ తనపై ఏవిధంగా హత్యానేరం మోపబడింది, తరువాత నిర్దోషియని రుజువై ఏ విధంగా విడుదలయింది చెప్పసాగాడు కాంతిభూషణ్ మాజీ పోలీసాఫీసరు, కాంతిభూషణ్ మేనమామ గిరి రాకతో అన్నపూర్ణ పరిస్థితి సంకటంలో పడింది అన్నపూర్ణ, కాంతిభూషణ్ డిన్నర్‌కని హోటలుకి బయలుదేరిన టాక్సీ డ్రైవరు రవికాంత్ అవడంతో అన్నపూర్ణ షాక్ తింది

నీ మాట నేను కాదంటానా? నీకు మంచి దారే దొరికింది " ఇక ఏ దారీ దొరకనివాణ్ణి నేనో!" సరే నా దారేదో నేను చూసుకుంటాను అయితే దానికి కొంత ఖర్చవుతుంది! అన్నాడు

ఖర్చేమిటి? అంది అన్నపూర్ణ అతని మాటల్లో ఆంతర్యం అర్థంకాక

ఇదిగో మన పెళ్ళికి రిజిష్ట్రార్‌లో మనం సంతకాలు చేస్తున్నప్పటి ఫోటో! ~ది మనం దండలు మార్చుకుంటున్నప్పటి ఫోటో " ఇది నేను నీ మెడలో తాళి కడుతున్నప్పటి ఫోటో! చెప్పాడు మూడు ఫోటోలు చూపుతూ

ఆ ఫోటోలు చూస్తూనే అన్నపూర్ణకు తల తిరిగి పోయినట్లనిపించింది

అయితే ఇవి చూపి బ్లాక్‌మెయిల్ చేస్తావా? అంది వచ్చే కోపాన్ని దిగమింగే ప్రయత్నంలో

దానికి నువ్వు ఏ పేరు పెట్టినా అభ్యంతరం లేదు!" కోట్ల ఆస్తికి నువ్వు వారసురాలివి కాబోతున్నావు!" అందులో కొంత నాకిస్తే నీ కిబ్బం దేమీ వుండదు! అన్నాడతను

అయితే చివరికి ఈ స్థాయికి దిగజారావన్న మాట? అంది అతని వైపు అసహ్యంగా చూస్తూ

ఏం చేసేది! ఎంతో కష్టపడి కూడబెట్టిన డబ్బు మొత్తం ఒక్క కేసుతో సముద్రపు అలల తాకిడికి పిచ్చిక గూళ్ళు కొట్టుకొని పోయినట్లు కొట్టుకు పోయాయి!" డబ్బు మొత్తం నా పేరున వుంటే లాభం లేదని మొత్తం నీ పేరున ట్రాన్స్‌ఫర్ కూడా నీకు తెలియకుండా చేయించాను! ఏం లాభం!! నా ప్రయత్నానికి దోహదం చేయవలసింది పోయి ఘోరంగా ద్రోహం చేశావు!" ఇప్పుడు నేను పూటకు రికాణా లేని బికారిని! ఈ పరిస్థితికి ఎవరు కారణం!? నువ్వు కాదా!? నేను అన్ని కోట్లకు నిన్ను అధికారిని చేసి కాపాడుకుందా మనుకుంటే తెలివి తక్కువగా ఆ డబ్బంతా ప్రభుత్వపరం చేస్తావా? అన్నాడు కసిగా

'నీతో ఇంకా పశ్చాత్తాపం వస్తుందను కున్నాను! కాని నీలో అలాంటిదేమి లేకపోగా ఇంకా ఆ మోసాన్ని ఆ విధంగా నువ్వు డబ్బు కూడ బెట్టిన విధానాన్ని సమర్థించు కుంటున్నావా? లోకంలో బ్రతకటానికి డబ్బు కావాలి " కాని డబ్బే లోకం కాదు!" ఐ హేట్ యూ! అంది అక్కడి నుంచి నిష్క్రమించబోతూ

ఆమెను బలవంతంగానైనా ఆపి, తను చెప్పవలసిన మాటలు చెప్పాలని ఆమెకు ఎదురెళ్ళి ఆమెను అటకాయించినట్టు ఆపి, చూడు అన్నపూర్ణా! నాకు నీతులు కాదు కావలసింది ! నీ దారికి నేను శాశ్వతంగా అడ్డు తొలగి పోతాను నాకో నాలుగు లక్షలు ఇప్పించు! అది పెద్ద మొత్తమేం కాదు! అన్నాడు

నాలుగు లక్ష లనేప్పటికి అన్నపూర్ణ అతన్ని పసిపిల్ల అదాటున భయంకరమైన దిష్టిబొమ్మను చూసినట్టు చూసింది

ఏమిటి అంత ఆశ్చర్య పోతావ్!" కోట్ల రూపాయలకు నిన్ను అధిపతిని చేసి, అవసరమైతే నేను జైలుకైనా వెళ్ళటానికి సిద్ధపడితే చివరికి నేను జైలు కెళ్ళటం జరిగింది కాని నువ్వు మాత్రం అంత డబ్బూ ప్రభుత్వానికి అప్పజెప్పి శిక్ష పడకుండా తప్పించు కున్నావ్!" ఇప్పుడు నువ్వో బంగారు పిచ్చుకని పట్టి కోటిక పడగెత్తబోతూ నీ వల్ల బికారి అయిన నాకు భిక్షగా నాలుగు లక్షలడిగితే బిగుసుకు పోతున్నావ్! అన్నాడు రవికాంత్ అన్నపూర్ణను విమర్శిస్తూ.

'నువ్వు ఏం చెప్పినా నేను నాలుగు లక్షలు కాదు గదా నాలుగు రూపాయలు కూడా ఇవ్వలేను!" ఇవ్వను .!! నీ వల్ల నేను ఎంత పతన మవ్వాలో ఎన్ని అవమానాలు పొందాలో అన్నీ పొందాను " అంది మొండిగా

ఆ మాటలతో పిచ్చివాడైన రవికాంత్ అంతవరకు చేతిలో సిద్ధంగా వుంచుకున్న కత్తి మెరుపు వేగంతో తీసి బటన్ నొక్కాడు కత్తి తళతళలాడుతూ వేట తిన్న నాగుపాము బుస కొట్టినట్టు ఒక్కసారిగా బయటికి వచ్చింది

'ఇదిగో అన్నపూర్ణా! నా చివరి నిర్ణయం విను! రేపు సాయంత్రం ఆరింటి లోపల బీచిలో నీ కాంటిన్‌కి నే కోరిన డబ్బు తెచ్చి మర్యాదగా ఇచ్చావా సరే! లేదా ముందు ఆ గుడ్డివాణ్ణి తరువాత నిన్ను ఈ లోకం నుంచి శాశ్వతంగా పంపి వేస్తాను! అనేక హత్యల కేసుల్లో జైలుకు వెళ్ళిన పెద్ద రికార్డిస్ట్‌ని!" టేక్ కేర్! అంటూ అక్కడి నుంచి నిష్క్రమించాడు

అన్నపూర్ణకు గుండె కొట్టుకోవటం స్పష్టంగా వినిపిస్తోంది

ఆమెకు భూమి తిరిగినట్టు. .. కళ్ళు ఏదో మగత కమ్మినట్లనిపించింది?

రవికాంత్ మోసగాడనే తెలుసు!

కాని ఇప్పుడు అతని నగ్నరూపం.... స్పష్టమైంది.

అతను నిజంగానే పచ్చి నెత్తురు తాగే పరమ కసాయి వాడు.

ఏం చేయాలో తోచక అన్నపూర్ణ శిలాప్రతిమలా నిలబడి పోయింది.

"ఏమ్మా ఇక్కడ నిలబడ్డావు! ఆ అబ్బాయి ఎవరు?" అంది అప్పుడే అక్కడి కొచ్చిన రమాదేవి.

ఆమె.... రవికాంత్, అన్నపూర్ణతో కోపంగా మాట్లాడిన చివరి మాట విన్నది, వెళ్ళటం చూసింది!

అన్నపూర్ణ తొట్రుపడి, రమాదేవి అక్కడికి రావటం ఆశ్చర్యం వేసి, "అతను ట్యాక్సీ డ్రయివరు! ఛేంజ్ లేదంటాడు.... దానివల్ల అయిన ఆలస్యానికీ ఎక్స్ట్రాగా మీటరు చార్జిమ్మంటాడు! తన ధోరణే తనది....!! మన మాట చెవి కెక్కించు కోడే!" అంది తగవు కారణం చెబుతూ.

"అంతేనమ్మా! ఈ రోజుల్లో ఆటో వాళ్ళతో టాక్సీల వాళ్ళతో వేగలేకుండా వున్నాము! మీరు హోటల్ డాల్ఫిన్‌కి వెళ్ళారని తెలిసి అక్కడి కెళ్ళాను! అక్కడ లేకపోతే.... అన్ని రూఫ్‌గార్డెన్ హోటళ్ళు తిరగాలని నిర్ణయించుకుని ముందు ఇక్కడి కొచ్చాను!" అంది.

ఆమె అలా రావటం వెనక ఏదో బలవత్తరమైన కారణం ఏదో వుందేమోనని అన్నపూర్ణకు అనిపించింది.

ఆమె వూహించినట్టే కాసేపటికి రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్ గిరి కూడా అక్కడ ప్రత్యక్షమయి, "మా సిస్టర్ మీ కోసం ఇంత పెద్ద పట్నంలో ఎక్కడెక్కడ తిరుగుతుందో నన్న భయంతో నేను వచ్చేశాను!" అన్నాడు, తన రాకకు కారణం అడగకుండానే చెబుతూ.

* * * * *

అందరూ టాక్సీలో తిరిగి వస్తుండగా ట్యాక్సీ ఓ గుడి ముందు ఆగగానే, "అమ్మా! అవంతీ ఇది.... దుర్గమ్మ గుడి....!! అబ్బాయికి తిరిగి త్వరలో నే స్వస్థత చేరాలని దేముడికి దండం పెట్టుకు వద్దాం దిగమ్మా!" అంది ముందు తాను దిగిన రమాదేవి.

అన్నపూర్ణ దిగి గుడి ప్రాంగణంలోకి రాగానే, "అమ్మాయ్! అన్నపూర్ణా.... మీ అమ్మ నీ కోసం మనింటి కొచ్చింది....!! ఆమె ఆరోగ్యం బాగో లేదట!! ఆమె ఖర్చులకు డబ్బిచ్చి పంపాను. ఈ వివరాలు ఏమి మా అన్నయ్య ప్రక్కనే వుండగా చెప్పటానికి వీలు లేదు కదా!? అందుకే నీకు చెబుదామని ఈ హోటల్ వెతుక్కుంటూ రావలసి వచ్చింది! ఇందాక నీతో ఘర్షణ పడుతున్న యువకు డెవరు?" అంది, రమాదేవి మళ్ళీ.

అన్నపూర్ణ గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లయి, ఇక ఆమెతో దాచి లాభం లేదని, నిజం ఆమెకు చెప్పేసింది.

అదంతా విన్న ఆమె...."!! ఔనమ్మా! ఇలాంటివి సహజమే!! మనం డబ్బివ్వటం ఆలస్యం చేస్తే ఆ దుర్మార్గుడు– అన్నంత పనీ చేస్తాడేమో?" అంది భయంగా.

"అయితే.... అంత డబ్బు ఆ దుర్మార్గుడికి ఇచ్చేస్తారా? వాడికొకసారి అలా ఇస్తే మళ్ళీ రాడని ఏమిటి? ఇదే అలవాటుగా ఇక బ్లాక్ మెయిలింగ్ మొదలు పెడతాడేమో?" అంది, తన భయాన్ని బయట పెడుతూ.

"అయితే.... మా అన్నయ్య రిటైర్డ్ పోలీస్ ఆఫీసరేగా.... వాడి సాయం తీసుకుంటే?" అంది రమాదేవి.

"బ్లాక్ మెయిల్ చేసి డబ్బు సంపాదించాలని పథకం వేసినవాడు.... వాడి జాగర్తలో వాడుండకుండా వుంటాడా?.... మరి నేనెవరో– నేను వచ్చిన పని మీ అన్నయ్య గిరిగారికి తెలిస్తే!?"– అడిగింది అన్నపూర్ణ భయంగా.

"ఇంకా ఆ రహస్య మెందుకు! నిజం వాడికి చెప్పటం వల్ల జరిగే నష్టం మన కేముంటుంది?" అడిగింది, రమాదేవి.

అన్నపూర్ణ కొద్ది క్షణాలు మౌనంగా వుండి, "మీ అన్న గిరిగారికి నేనెవరో తెలుసు!" అంది. ఆ మాటలతో క్షణం విస్మయం చెందిన రమాదేవి, "అయితే ఇంకా భయం దేనికి.... మరి.... రవికాంత్ విషయం మా అన్నయ్యకు చెప్పలేదా?!!" అంది రమాదేవి.

"ఆ అవకాశం నాకు రాలేదు!" నన్ను రవికాంత్ ఇలా బ్లాక్‌మెయిల్ చేసున్నాడంటే.... నేనూ రవికాంత్ కలిసే ఇలా బ్లాక్‌మెయిల్ నాటకం ఆడుతున్నామనే అనుమానం వస్తుందనే నా భయం!" అంది అన్నపూర్ణ.

"అలాంటి అనుమానం రాకుండా నేను చూసుకుంటాను!! పద !" అంది రమాదేవి.



## బలికోరిన ప్రేమ

"మనం గుడిలో పలికని వచ్చాం... కొబ్బరికాయ పగల గొట్టి నైవేద్యంతో వెళ్ళొద్దూ!" అంది అన్నపూర్ణ. రమాదేవి ఆ మాటలను వెంటనే అమలు పరచింది.

అన్నపూర్ణ ప్రక్కనే వుండి అన్నీ వింటుండంగా రఘాదేవి వాళ్ళ అన్నయ్య గిరికి విషయాలన్నీ పూసగుచ్చినట్టు వివరించింది.

అన్నపూర్ణ ఏ పరిస్థితిలో రంగ ప్రవేశం చేసిందో చెప్పింది. అంతా విన్న గిరి–

"ఇప్పుడు అన్నపూర్ణను అడ్డం పెట్టుకుని..., ఆ రవికాంత్ బ్లాక్‌మెయిల్ చేయటానికి తప్పక ప్రయత్నిస్తాడు!! వాడి ఆటలు శాశ్వతంగా కట్టించకపోతే వాడెంతకయినా తెగిస్తాడు!" అన్నాడు.

"అందుకే:... మీరే ఏదైనా పథకం వేసి.... ఈ సమస్య పరిష్కరించాలి!" అంది. అన్నపూర్ణ. గిరి ఆలోచనలో పడ్డాడు.

"రమాదేవీ! నువ్వు డబ్బు అన్నపూర్ణ ద్వారా పంపించు..!! తరువాత కార్యక్రమం నేను చూసుకుంటాను!" అన్నాడు గిరి, చివరికి.

అన్నపూర్ణ, రమాదేవి, గిరి నిర్ణయాన్ని హర్షించినా వాళ్ళ భయాలు వాళ్ళకు లో లోపల వుండి పోయాయి.

అన్నపూర్ణయితే "గిరిగారూ!! వాడసలే అన్నింటికీ తెగించిన దుర్మార్గుడు....!! మీరు కాస్త జాగర్తగా వ్యవహరించాలి!" అంది భయంగా.

"ఇలాంటివి.... నా కలవాటే నమ్మా....!! ఇక ఆ విషయం నాకు వదిలేయండి!! మీ రిప్పుడు చేయవలసింది.... మన కాంతిభూషణ్‌కి కంటి చూపు తిరిగి తెప్పించే ప్రయత్నం!" అన్నాడు గిరి.

కంటి చూపు విషయం.... గుర్తు రాగానే రమాదేవి, అన్నపూర్ణ కలత చెందారు.

"అబ్బాయి కళ్ళు ఆపరేషన్‌కి అవసరమైతే ఫై దేశాల కైనా వాడని తీసి కెళదాం అన్నయ్యా!" అంది రమాదేవి.

"అలాగేనమ్మా....!! అలాగే....!" అన్నాడు గిరి. అన్నపూర్ణ ఆ మాటలకు సంతోషించింది.

అన్నపూర్ణ సూట్‌కేస్‌లో డబ్బు పెట్టుకుని ట్యాక్సీలో బీచ్‌లో వున్న కేంటిన్‌కు బయలు దేరింది. ఆమె బయలు దేరటానికి ముందే రిటైర్డ్ పోలీస్ ఆఫసర్ గిరి తను తీసుకోవలసిన జాగర్తలు తీసుకుంటానని, భయపడాల్సిన పనిలేదని ఎన్నో విధాల ధైర్యం చెప్పి ఆమె ఎలా నడుచుకోవాలో సూచన లిచ్చి పంపాడు.

అన్నపూర్ణ ఆ ధైర్యంతో మొండిగా బీచ్‌లోని క్యాంటిన్ ముందు ట్యాక్సీ దిగింది.

రాత్రి ఆ టైంలో క్యాంటిన్‌లో కంటే, జనం క్యాంటిన్ ఆరుబయట కుర్చీలో కూర్చుని ఒంటా ఐస్‌క్రీమ్‌లు, రకరకాల శీతల పానీయాలు, కేక్స్‌లు తింటూ ఆనందిస్తున్నారు.




"రవికాంత్ ఈ ప్రాంతాన్నే ఎన్నుకున్నాడు.... ఇందులో ఏదైనా ప్రత్యేకత వుండి వుండాలి!' అనుకుంది అన్నపూర్ణ.

క్యాంటిన్‌లోకి అడుగులు వేస్తుంటే ఆమెకు గుండె దడగా వుంది.

లోపల కుర్చీలో ఎదో మూలమూల ఒకళ్ళు ఇద్దరు జంటలు తప్ప పెద్దగా జనం లేరు.

అన్నపూర్ణ సూట్‌కేస్‌తో ఒక టేబిల్ దగ్గర కూర్చోగానే, "ఏం ఆర్డర్!" అంటూ సర్వర్ వచ్చాడు.

"ఒక్కగోల్డ్‌స్పాట్!! బాగా చల్లగా వుండాలి!" అంది అన్నపూర్ణ ఆర్డరిచ్చి.

సర్వర్ అది తెచ్చి ఇవ్వగానే, స్ట్రాతో అది పీలుస్తూ, రవికాంత్ ఎప్పుడొస్తాడో అంటూ ఎదురు చూస్తూ కూర్చుంది.

ఆమె పావు గంట కూర్చున్నా అతను వచ్చే సూచనలు కనిపించ లేదు.

కాలం గడుస్తున్న కొద్దీ ఆమె ఆతురత పెరుగుతోంది.

"ఈ డబ్బు రవికాంత్ తీసుకుని మళ్ళీ వచ్చి ఇలాగే బెదించి డబ్బు అడుగుతాడేమో?" అని ఒక ప్రక్క ఆందోళనగా వుంది ఆమెకు.

"రవికాంత్ ఆటలు సాగకుండా.... గిరి.... ఆట కట్టించ గలడా?" ఇలా డోలాయమాన మవుతున్న మనసుతో అన్నపూర్ణ కూర్చుని వుంది.

ఇంతలో ఓ కుఱ్ఱవాడు, "ఇదిగో నండి! ఈ ఫోటో లో వున్న మనిషి మీకు ఈ కవరు ఇవ్వమని చెప్పి వెళ్ళాడు!" అన్నాడు.

ఆ కవరు, ఆ ప్యాస్‌పోర్ట్ సైజు ఫోటో లో వున్న రవికాంత్‌ను చూడగానే అన్నపూర్ణ చేతులు వణికాయి.

వెంటనే ఆమె కవరు తీసింది.

అందులో వున్న ఉత్తరంలో ....

"డియర్!

మన ఒప్పందం ప్రకారం నువ్వు తెచ్చిన సూట్‌కేస్ రామక్రిష్ణ మిషన్ కాంపౌండ్ ప్రక్కనే పార్క్ చేయబడి వున్న 5333 ఏ.డి. టాక్సీ వెనక సీటులో వెంటనే వుంచు! అది చేరవలసిన గమ్యం చేరుతుంది. నేను అన్న ప్రకారం మనిద్దరం దంపతులమనే సాక్ష్యాలిచ్చే ఫోటో నెగిటివ్‌లు ఈ కవర్‌లోనే వున్నయ్! ఈ ఫోటో నెగిటివ్‌లు శాశ్వతంగా తొలగిపోతే మనిద్దరి మధ్యా బంధాలు తెగిపోయినట్టే! నేను కోరినది అందగానే నేనూ ఈ దేశం విడిచి శాశ్వతంగా వెళ్ళిపోతాను....!! నేను కోరిన సాయం అందించటంలో ఏ విధమైన మోసం జరిగినా.... పర్యవసానాలు చాలా దారుణంగా వుంటయ్! ఇది ఒక శ్రేయోభిలాషగా ఒక మంచి సూచన.... లేదా.... హెచ్చరిక!

ఇట్లు,

నీ హితుడు.

అని వుంది.

అన్నపూర్ణ ఆ ఉత్తరం చదివి జాకెట్లో కనబడకుండా దాచుకుంది.

గిరి చెప్పినట్టే "బ్లాక్‌మెయిల్ చేస్తూ డబ్బు అడిగిన మనిషి అతను చెప్పిన సంకేత స్థలంలో ఎప్పుడూ ఆ డబ్బు కోసం తనుగా వుండడు. తన తరఫున.... తన ఆచూకీ చెప్పలేని.... లేక తెలియని ఏ మనిషి సాయమో పొందుతాడు! అలా చేయటం తనకు క్షేమమని భావిస్తాడు!"– అని చెప్పిన మాటలు ఎంత నిజమో ఆమెకు అర్థమైంది.

అన్నపూర్ణ క్యాంటిన్ లోపలి నుంచి బయలు దేరి రామకృష్ణ మిషన్ కాంపౌండ్ గేట్ దగ్గరి కెళ్ళింది. అక్కడ అప్పటికే ఓ కారు స్టార్ట్ చేయబడి వుంది.

ఆమె కారు లోపలికి తొంగి చూసింది.

లోపల అంతా చీకటిగా వుంది!

ఉత్తరంలో రవికాంత్ కోరిన విధంగా సూట్‌కేస్ కారులో పెట్టింది.

కారులో సూట్‌కేస్ పడీపడక మునుపే కారు స్టార్టయింది.

తృటిలో అది టర్నింగ్ తిరిగి చీకట్లో కలిసి పోయింది.

వెంటనే మరో నల్లకారు అక్కడికి రావటం, అదంతా చోద్యంగా చూస్తూ నిలబడ్డ అన్నపూర్ణ చెయ్యి పట్టి కారు లోపలికి ఎవరో బలంగా లాగటం జరిగింది.

జరిగిందేమిటో తెలిసి ఆమె అరిచే లోపునే నోటికి ఎవరో కర్చీఫ్ నొక్కినట్లనిపించింది! కర్చీఫ్‌లో ఏదో క్లోరోఫాం వాసన వచ్చింది. ఆమె గాలి పీల్చుకునే లోపున ఆమె బాహ్య స్మృతి కోల్పోయింది.

ఆమె అలా ఎంతసేపుందో తెలియదు! కళ్ళు తెరిచేప్పటికి ఆమె ఓ సోఫామీద వెల్లకిలా పడుకొని వుంది. చెదిరిన బట్టలతో కాళ్ళూ చేతులు ప్లాస్టిక్ తాళ్ళతో బంధింప బడి వున్నాయ్!

ఎటూ కదలటానికి వీలులేని పరిస్థితి అది.

వళ్ళంతా సూదులతో పొడిచినట్టు మంటలు. కాళ్ళూ.... తొడలు నొప్పిగా వున్నయ్.

ఏమయింది తనకు?!?

తను.... శీలాన్ని కోల్పోయిందా?

రవికాంత్.... తను.... అపస్మారకంలో వుండగా....!!?.... మైగాడ్...." అనుకుంది అన్నపూర్ణ తన కేమయిందో తెలియక.

ఆ ఆలో చనే ఆమెకు భయంకరంగా వుంది!

★ ★ ★ ★

"హలో డియర్!" అంటూ రవికాంత్ వచ్చాడు. అన్నపూర్ణ అతనివేపు భయంగా చూసింది. అతని చేతిలో ఆటో మేటిక్ ఫ్లాష్ కెమెరా వుంది.

"మై డియర్ అన్నపూర్ణా!! మంచిగా చెబితే నా మాట వినలేదు కదూ!? అందుకే ఇలాంటి వింత శిక్ష విధించాను. ఇదిగో ఇప్పుడు నీతో నేను నటించే ప్రేమ ఫోటో లు. నీ కాబో యే అత్త గారికి.... ఆయన అన్న రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్‌తో పాటు.... అన్ని పోలీస స్టేషన్‌లకూ పంపుతున్నాను!" అంటూ ఆటో మేటిక్ కెమెరాని ఒక చో ట ప్రత్యేకమైన యాంగిల్‌లో పెట్టి, చొ క్కా తీసి వేసి రకరకాల భంగిమల్లో ఆమెతో ఏకాంతం గడుపుతున్నట్టు ఫోజులు పెట్టాడు.

ఆటో మేటిక్ కెమెరా క్లిక్ క్లిక్ మంటూ ఫోటో లు తీసింది.

రవికాంత్ లేచి చొ క్కా తొ డుక్కుని "డియర్ అన్నపూర్ణా! నీ భవిష్యత్తు శాశ్వతంగా నాశనం చేయటానికి వీటిలో ఏ వొక్క ఫోటో అయినా చాలు!! ఇది ఆటో మేటిక్‌గా కలర్ ఫోటో తీసే ఇన్‌స్టాంట్ కెమెరా?" అన్నాడు, ఆ కెమేరాలో అప్పటికేసిద్ధమైన ఫోటో లను బయటికి తీసి.

"నేనేం పాపం చేశాను....!? ఎందుకు నన్ను ఇలా హింసిస్తున్నావ్?" అంది విలపిస్తూ అన్నపూర్ణ.

"నేను కోరిన డబ్బు ఇవ్వటానికి వస్తున్నట్టు ఆ గిరిగాడికి ఎందుకు చెప్పావు? నాలుగు లక్షల డబ్బు ఇస్తున్నట్టు వస్తూ, అందులో డబ్బుకు బదులు పాత న్యూస్ పేపర్ల కట్టలు తెస్తావా? ఈ పన్నాగమంతా ఆ పోలీస్ ఇడియట్ అయిడియా యేనా? అందుకే అనుభవించు!! నువ్వు చేసిన మోసానికి ఇవిగో ఈ గదినిండా విష సర్పాలు పడేసి వెళుతున్నాను! ఆ పోలీస్ గాడితో పాటు ఆ రమాదేవి- అవిడ కొడుకు అంతూ చూసే వస్తాను!! ఈ సోఫామీద నుంచి కదిలి అడుగు క్రిందకు వేస్తే.... ఈ మిన్నాగులు నీ ప్రాణం క్షణాల్లో తీస్తయ్!" అన్నాడు అక్కడి నుంచి వెళ్ళిపోతూ.

అన్నపూర్ణకు సోఫా క్రింద బుసలు కొడుతున్న పాములు చేస్తున్న శబ్దాలు ఘో రంగా వినిపిస్తున్నయ్!

రవికాంత్ ఎంత దుర్మార్గుడో.... ఒక మనిషిని హింసించి ఆనందించటంలో ఎంత శాడిస్ట్‌గా ప్రవర్తిస్తాడో, ఒక మనిషిని శాశ్వతంగా పతనం చేయటానికి ఎలా వెనకాడడో.... దానికి అతను ఎలాంటి నికృష్ట మార్గాలు అనుసరిస్తాడో, అర్థమవటంతో ఆమె హృదయం బాధగా రోదించింది. తనకంటే ముందు.... కాంతిభూషణ్‌ని, ఆమె తల్లిని.... పోలీస్ ఆఫీసర్ గిరిని ఏఏ కుట్రలు పన్ని చంపటానికి ప్రయత్నిస్తాడో నన్న ఆదుర్దా ఆమెలో అధిక మైంది!

కాని తను ఈ పరిస్థితిలో చిక్కుకుని వుండి ఏం చేయగలదు!?

తనతో కలసి ఏకాంతంలో ప్రేమ నటిస్తూ తీసిన ఫోటో లు రవికాంత్ ఏదో ఎత్తుగడతో తీసి వుంటాడు.

వాటిని తన స్వలాభం కొసం ఏ విధంగానైనా వాడుకోవటానికి వెనుదియడు.

అతనాశించిన డబ్బు అంది వుండక పోవటంతో అలా బరితెగించినట్టు ప్రవర్తిస్తున్నాడు!

అతనెంత మొండి పట్టుదల కలవాడో అన్నపూర్ణకు బాగా తెలుసు! అయినా తను ఏం చేయలేని అసహాయిని!

ఇలా ఆలో చిస్తూ బాధపడుతున్న అన్నపూర్ణ సోఫా మీదకు ఒక పాము జరజరా ప్రాకి బుసకొడుతూ వస్తున్నట్టు తెలుసుకుంది. భయంతో అమె బిగుసుకు పోయినట్టుగా అయిపోయింది. (ఇంకాఉంది)




**కె ఆర్ పాల్వంచ**

★ మా జన అచార ప్రకారం తండ్రిపోయాక కర్మకాండ చూశాను ఇది దారుణం మూఢత్వ చర్య ఈ పద్ధతి ఎలా మారుతుంది?

● కర్మకాండలు నేను చూడలేదు నేను- తద్దినం కాని కర్మగాని జరగడం చూడలేదు మా నాన్నగారి కిలాంటివి నమ్మకం లేదు ఆయన పోయినప్పుడు - కూడా ఏం జరిపించ లేదు (అయినా ఆయన త్రిశంకుస్వర్గానో- నరకానో వేలాడు తున్నారని అనుకోడం లేదు మేం) కొత్త తరం ధైర్యం చేసి వీటికి స్వస్తి చెప్పాలి అదొక్కటే దారి

**ఎన్ ఎస్ బి కోటబొమ్మాళి**

★ రామలక్ష్మిగారూ మానసికంగా బాధపడేవారికి ప్రేమ ఒక పెద్ద ఔషధం అంటారు ఇది ఎంతవరకు - నిజం?

● ప్రేమకాదు- సైకియాట్రిస్ట్ - దివ్య ఔషదం ప్రేమ మానసికార్బాటాన్ని పెంచుతుందే గాని తగ్గించదు అందుకే ఆరోగ్యవంతులు ప్రేమించాలి ఆరాట పడేవారు- మానసిక వైద్యుని సంప్రదించాలి

**యు ఎమ్ కొంకుదురు**

★ ప్రస్తుతం అమలులో వున్న కుల ప్రాతిపదికపై రిజర్వేషను మంచిదా- లేక వేరేదైనా పద్ధతి మంచిదా?

● రిజర్వేషనులు ఆర్థికంగా వెనుకబడిన తనంపైవుంటే- ఇంతకంటే న్యాయం జరుగుతుంది కులం- కులంగా వెనకబడి ఎన్నాళ్ళుంటుంది? అందులోంచి వ్యక్తులు ముందుకు పోరా?!

★ కవిత్వం రాయాలంటే ముఖ్యంగా ఏం నేర్చుకోవాలి?

● కవిత్వం రాయడం!!

★ జ్ఞాపక శక్తిని పెంచుకోవాలంటే ఏం చెయ్యాలి?

● మననం చేసుకుంటూండాలి

**జె పి బి ఖుర్దారోడ్డు**

★ మీరు మా మీద చాలా కోపంగా వుంటారు ఇంట్లో కూడా యిలాగే కోపంగా సమాదానా లిస్తారా?

● ఎవరికి?!

**వి ఎమ్ వి జగిత్యాల**

★ మీరెంత వరకు చదువు కున్నారు?

● తెలుగులో ఆంగ్లంలో అక్షరాలు నేర్చాను చేతనైనంత - వాటిని అటూ యిటూ మాటల్లా మార్చగలను

**మధు, అంబుసోలి**

★ మీరు కొన్ని ఉత్తరాలు జవాబులు చెప్పలేక పత్రికలో ప్రచురించడం లేదు కదండీ?

● చెప్పలేక కాదు కొందరి పరువు వారడిగే ప్రశ్నలతో పోవడం యిష్టంలేక బూతులు రాయడం సభ్యత అనుకోను నేను

**ఎస్ వి వడ్లమూడి**

★ నాకు మరో యిందిరను కావాలని వుంది

● దానికేం భాగ్యం- పేరు మార్చుకోండి!

**ఎస్ జె హెచ్ తంబళ్ళపల్లి**

★ మరమనుషు లెందుకు?

● సాదించకుండా వుండడానికి




**టి పి గితనపల్లి**

★ జీవితానికి కలలకి సంబందం వుంటుంది- అన్న గుడ్డి నమ్మకం లేకపోయినా ఉండక పోతుందా అన్న అనుమానం మాత్రం వుంది

● కోరికలే కలలుగా వస్తూండడం చూస్తూంటాం అదే మీ అనుమానానికి కారణం- కోరుకున్నవి కలలో వచ్చినప్పుడు - రాబోయేవీ కాబోయేవీ కలలలో రావా అని

**ఎం ఎస్ ఎన్ అనకాపల్లి**

★ స్త్రీ జాతి సానుభూతి కోసం మరింకెందుకైనా మగ ద్వేషి అయినట్టు మీ ప్రశ్నావళి చెప్తుంది విశ్వ మానవతా వాదాన్ని పెంచడానికి రచయితలు దోహదపడాలి గాని ఏ ద్వేషిగానూ పేరు తెచ్చుకోకూడదు ఏమంటారు?

● ఏమంటాను? సన్యాసినాయుడు గారిలా- ఒంటి కంటితో చూస్తుంటే?! ప్రశ్నావళి ఏ ద్వేషం కక్కదు- నిజం చెప్తుంది కాదని మీరు వూహించుకుంటే- దానికి నా బాద్యత లేదే!

**ఎం సి ఎస్ హైదరాబాదు**

★ మగాడి జీతం ఆడదాని వయస్సు అడగ కూడదంటారు నేను అడుగుతున్నా- మీ వయసెంత?

● 55!! (కాని నేను నీ జీతం ఎంత అని అడగను - సభ్యత కాదని!)

**జి వి జె విచిపేట**

★ ఈ సమాజంలో వేటి కుంది విలువ?

● సాదించిన విజయానికి వుంది - దానికి పాలో అయిన మార్గానికి లేదు!

**సి హెచ్ ఎన్ నిడదవోలు**

★ ఈ రోజు మానవుడు సాదించలేనిది లేదు కాని ప్రాణం కాపాడుకోలేక పోతున్నాడు

● ప్రాణం తను పోయలేదు కదా- అంచేత అది తన చేతిలో వుండడం లేదు

**వి ఎస్ గుంటూరు**

★ అక్కయ్యా! ఆదర్శ ప్రేమికులలాగా ఆదర్శ స్నేహితులు వున్నారా?

● ఆదర్శ ప్రేమికుల కంటే- స్నేహితులే ఎక్కువ వుంటారు - ప్రేమికుల కొచ్చే కీచులాటలు వీరికి రావు కనుక

★ స్నేహం గొప్పదా? ప్రేమ గొప్పదా? స్నేహానికి మీ నిర్వచనం?

● స్నేహించి ప్రేమిస్తే ప్రేమా గొప్పదే అవుతుంది ఒకరి నొకరు గౌరవించుకుంటూ- ఒకరితో ఒకరు విబేదిస్తూ కూడా స్నేహంగా వుండడమే - నిజమైన స్నేహం స్నేహితులు కార్బన్ కాపీలు కానక్కర లేదు

**ఎమ్ ఎస్ ఎల్ ఒంగోలు**

★ ఇప్పుడు వస్తూన్న సినిమాలపై మీ అబిప్రాయం?

● చూసినంత టైము కూడా పట్టడం లేదు- మరిచి పోడానికి □

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలకు, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం
వ్రాయండి.
సెరిలాక్
పోస్ట్‌బాక్స్ నం: 3.
న్యూఢిల్లీ-110 008.




SAA/FSL/379(R)/TEL



Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

గంగాధరం ఆ రోజు ఇంటికి వచ్చేసరికే రాత్రి తొమ్మిదయింది అతడిని చూచేసరికే పరిస్థితి అర్ధమయింది అతడి అర్ధాంగి పార్వతికి భర్త మనసెరిగి ప్రవర్తించే ఆడది కనుక అతడిని ఇంకేమి ప్రశ్నించలేదు పార్వతి

గంగాధరం లుంగి లోకి మారాడు కాళ్ళు కడుక్కుందుకు పెరటి వైపు వెడుతూ పార్వతీ! అన్నం వడ్డించేసెయ్, ఇంకా చూసుకోవలసిన ఫయిళ్ళున్నాయి అన్నాడు

గంగాధరం వంటింట్లోకి వచ్చాడు అప్పటికే పీటా కంచం రెడీగా ఉన్నాయి

ఒక్క నిముషం కూచోండి చారు వెచ్చ పెడతాను చెప్పింది పార్వతి

ఆ పూటకు భోజనంలోకి చారే సమస్తం అని అర్ధమయింది గంగాధరానికి

గంగాధరానికి ఉద్యోగం వచ్చేనాటికే తండ్రి గతించాడు తండ్రి ప్రావిడెంటు ఫండు వగయిరాలకు తోడు కొంత అప్పు చేసి ఉన్న ఒక్క చెల్లెలు పెళ్ళి చేసి బరువు దింపుకున్నాడు

ఇంకా మిగిలినది ఒక్క తమ్ముడు అతడి




చదువింకా ఓ కొలిక్కి రాలేదు చదువు పూర్తి చేయించి తమ్ముడిని నిలబెట్ట వలసిన బాధ్యత గంగాధరం భుజస్కంధాల మీదే ఉంది

ముసలి తల్లి ఆరు మాసాల బాబు

గంగాధరం ఓ గవర్నమెంటు ఆఫీసులో జూనియర్ అసిస్టెంటు చేతికి వచ్చే జీతం గోచీకి ఎక్కువ అంగవస్త్రానికి తక్కువ దాని మీద గడపవలసిన పొట్టలు తనతో కలుపుకుని అయిదు ఇందులో అయిదవ పొట్ట కొడుకుది ఆరు మాసాల పసి కూన వాడికి తల్లి దగ్గర పాలు లేవు బూత్ పాలు పడవు విధిగా డాక్టర్లు సూచించిన పాల డబ్బాలు కొనవలసిందే కాలం చూస్తే దిన దినానికి పెరుగుతున్న ధరలు క్షణక్షణానికి దిగ జారుతున్న బ్రతుకులుగానూ ఉంది

నిన్ననే చెప్పింది పార్వతి చంటాడి పాల డబ్బా అయిపో వచ్చిందని అప్పటికి జీతా లందుకుని పది రోజులే అయింది అయినా జేబులో ఉన్న తన్నినా ఏగాణి లేదు ఉదయం నుండి ప్రయత్నిస్తూనే ఉన్నాడు ఎక్కడా కూడా పుట్టలేదు అప్పు

ఆలోచనలతోనే భార్య వడ్డించిన చారూ మెతుకులూ మృష్టాన్న భోజనంగా భావించి అయిందని పించాడు గంగాధరం

పార్వతీ! పాల డబ్బా యివాళ తేలేక పోయాను బాధగా అన్నాడు

డబ్బాలో మిగిలిన కాస్త పొడిని కొద్ది కొద్దిగా కలిపి పడుతున్నాను రేపటిదాకా ఫరవాలేదు లెండి చెప్పింది పార్వతి

భార్య మాట వినేసరికి ప్రాణం విలవిల లాడింది గంగాధరానికి

కనీసం పిల్లవాడికి పాల డబ్బా కూడా తేలేని అసమర్ధుడి నయ్యాను పార్వతీ ఆవేదనగా అన్నాడు

పార్వతి ఏమీ మాటాడ లేదు మీలాగా గవర్నమెంటు నౌకరి యింకా చాలా మందే చేస్తున్నారు వాళ్ళంతా మీలాగే ఉన్నారా? వాళ్ళ వాళ్ళ స్థాయిని బట్టి వాళ్ళు ఆఫీసులో పని చేస్తున్న సీటుని బట్టి లాఘవంగా జీతంతో బాటు నాలం గూడా సంపాదించుకు రావడం లేదూ? వేసి వెయ్యమంటూ హాయిగా బ్రతకడం లేదూ? ఏమైనా అంటే ఆదర్శా లంటారు ఆదర్శాలు కూడు పెడతాయా అంటే ఆగ్రహం ఒలక బోస్తారు అని అందామనుకుంది పార్వతి కాని అనలేదు

తన భర్త మిగిలిన వాళ్ళలా కాక నీతిగా బ్రతుకు తున్నాడంటే పార్వతికి గర్వమే!

కాని నేటి పరిస్థితి? ఆడపడుచు పెళ్ళికి చేసిన అప్పు యింకా తీరనే లేదు మరిది చదువు ఓ కొలిక్కి రాలేదు మధ్యలో వీడో చంటి వెధవ ఊరిలో మిగిలిన పిల్లలకు హాయిగా బూత్ పాలు పడుతున్నాయి తాగి హరాయించు కుంటున్నారు అలాటిది ఈ వెధవకు అవి పడటం లేదు ఏ జమిందా రింటినో పుట్టవలసిన వెదవ కర్మకాలి తన కడుపున పడ్డాడు అనుకుంది పార్వతి

పార్వతి మౌనం భరింపరానిదిగా ఉంది గంగాధరానికి తనను నిలదీసి సాధించినా బాగుండును అనుకున్నాడు

రేపు ఎలాగైనా పాల డబ్బా తెస్తాను పార్వతి అని లేచాడు

* * * *

ఫయిలు ముందు వేసుకుని కూర్చున్నాడన్న మాటేగాని మనసు వాటిమీదకు పోవడం లేదు గంగాధరానికి కనీసం సాయంత్రానికైనా పాల డబ్బా కొనాలి లేకపోతే పిల్లాడికి పాలుండవు పాల డబ్బా కొనాలంటే కనీసం నలభై రూపాయ లుండాలి ఎవరిస్తారు?

ఇంతలో బుర్రుమని స్కూటరు శబ్దం వినిపించింది ఎదురుగా లింగరాజు వస్తూ కనిపించాడు లింగరాజుకు కూడా తన ఆఫీసులోనే ఉద్యోగం అతడి సీటు డిస్పాచ్ సెక్షను

లింగరాజూ తనూ చిన్నతనం నుండి స్నేహితులే అతడూ తనూ యించు మించు ఒకే మారు ఉద్యోగంలో చేరారు ఆనాడు యిద్దరి స్థితీ ఒకలాటిదే మరి ఇవాళ? లింగరాజు పరిస్థితి వేరు పెద్ద యిల్లు కట్టాడు ఈ రోజు కట్టిన జత రేపు తొడగడు స్కూటరు మెయిన్‌టెయిన్ చేస్తున్నాడు వాళ్ళకూ వాళ్ళకూ అప్పుడప్పుడు అప్పులు కూడా ఇస్తుంటాడని వినికిడి

మరి తనో? ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టుంది తండ్రి కాలం నాటి పాత సైకిలే ఈ నాటికి తన వాహనం ఏమిటి తేడా?

ఆదర్శాలనే ఉచ్చులోంచి బయట పడితే గంగాధరం లింగరాజు కంటె ఎక్కువే సంపాదించ గలడు అతడి సీటు కూడా అందుకు తగ్గదే అయినా గంగాధరం ప్రాణమయినా తృణప్రాయంగా విడుస్తాడు గాని తను నమ్మిన ధర్మానికి విరుద్ధంగా ఎంత మాత్రం నడవ డానికి ఇష్టపడడు మనసు దారిని మనసు ఆలోచిస్తున్నా అతడి కళ్ళు మాత్రం ముందున్న ఫయిలులోకే చూస్తున్నాయి చేతులు ఆ ఫయిలుకు సంబంధించిన నోటు వ్రాస్తూనే ఉన్నాయి

నమస్కారం గంగాధరంగారూ!

గంగాధరం తల పైకెత్తి చూచాడు ఎదురుగా కాంతయ్య కాంట్రాక్టరు కాంతయ్య

మీ ఫయిలే చూస్తున్నాను ఇదుగో యిప్పుడే ఇంజినీరుగారి దగ్గరకు పంపుతాను అని చుట్టు పక్కల అటెండరు ఎవరూ కనిపించక పోవడంతో తనే పట్టుకెళ్ళాడు గంగాధరం

మరో అరగంటలో గానే సంతకా లయిన ఫయిలు పట్టుకుని తిరిగి వచ్చాడు గంగాధరం

కాంట్రాక్టరు కాంతయ్య యాభయి రూపాయ లివ్వ బోయాడు

గంగాధరం మనసు గందరగోళ పడింది మనసు కొద్ది క్షణాల పాటు ప్రలోభానికి లోనయింది కాంతయ్య ఇచ్చే ఆ నోటందుకుంటే పిల్లాడికి పాల డబ్బా కొనగా పైగా పది మిగులు తుంది మనసు ఊగింది చేయి కూడా ముందుకు రాబోయింది

కాని నిగ్రహించుకున్నాడు గంగాధరం

'సారీ కాంతయ్య గారూ! నా డ్యూటీ నేను చేశాను దానికి దీనితో పనేమిటి? మీ కాగితం డిస్పాచ్ సెక్షన్‌కు పంపిస్తాను అన్నాడు

సరే నీ ఖర్మ! అన్నట్టు ఓ చూపు చూసి డిస్పాచ్ వైపు నడిచాడు కాంతయ్య

అన్యమనస్కంగా ఏదో ఆలోచిస్తూ కూచున్న

గంగాధరానికి ఇంజినీరు గారు రమ్మంటున్నారంటూ కబురు తెచ్చాడు అటెండరు.

గంగాధరం వెళ్ళాడు. ఇంజనీరు గారు గంగాధరాన్ని చూచి, "చూడు గంగాధరం! ఉదయం నుండి చూస్తున్నాను. ఏదో పోగొట్టుకున్న వాడిలా ఆలో చనలతో మునిగి పోయినట్టు కనిపిస్తున్నావు. డబ్బు యిబ్బంది ఏమయినా కలిగిందా?" అని అడిగారు. ఆయనకు గంగాధరం గురించి పూర్తిగా తెలుసు. పై సంపాదనకు చేయి చాచడనీ తెలుసు. అందుకే ఎవరి దగ్గర నుండి ఎటువంటి వత్తిడులు వచ్చినా గంగాధరం సీటు మార్చ లేదాయన. గంగాధరం లాంటి వాళ్ళు ఏ కొద్ది మంది ఉన్నా నేడు దేశం ఈ స్థితిలో ఉండేది కాదని ఆయన నమ్మకం.

ఆఫీసరు గారే స్వయంగా తన క్షేమ సమాచారాలు విచారించడంతో గంగాధరానికి ఏను గెక్కినంత సంబరం కలిగింది.

"అబ్బెబ్బె! అలాటి దేం లేదుసార్!" అన్నాడు అభిమానంగా.

"గంగాధరం! మొహమాట పడకు." తిరిగి చెప్పారు ఇంజనీరు గారు.

గంగాధరం కాదుకాక కాదన్నాడు. ఇంజనీరుగారు చేసేదేంలేక "సరే నీ యిష్టం" అన్నట్టు ఊరకుండి పోయారు.

గంగాధరం ఇంజనీరు గారి రూము నుండి బయటకు వచ్చేసరికి ఆఫీసు స్టాఫంతా దగ్గరలో ఉన్న హోటలుకు వెళ్ళి పోయారు.

తనూ హోటలు వైపు నడిచాడు గంగాధరం.

హోటలు గుమ్మంలోనే ఎదురు పడ్డాడు గంగాధరం కొలీగ్ సదాశివం. గంగాధరం సదాశివాన్ని చూచి, "బ్రదర్! ఓ నలభయి రూపాయ లుంటేసర్దగలరా?" అభిమానం చంపుకుని అడిగాడు.

సదాశివం విచారంగా మొహం పెట్టి, "సారి బ్రదర్! ఏమనుకోకండి: ఈ నెలలో మా శ్రీమతి పట్టు చీర కొనేసింది. దాంతో పైస లారిపోయాయి. పోనీ అంటే మన ఆఫీసులో కూడా ఏ బేరమూ తగుల లేదు." అని వెకిలి నవ్వొకటి విసిరి, "సరేగాని బ్రదర్! మీ సీటు బంగారు బాతు. మీరు వినియోగించుకోవాలే గాని మాలాటి వాళ్ళకే సర్దగలరు." అన్నాడు సదాశివం.

"సరే! ఇక మిగిలిందల్లా లింగరాజే!" స్వగతంలా అనుకున్నాడు గంగాధరం.

అది సదాశివానికి వినిపించింది. "ఏమిటి?లింగరాజు నడుగుతారా? అడగండి. నాదేం పోయింది? కాని అతడు ఊరికే మాత్రం యివ్వడు బ్రదర్! ఏదయినా తాకట్టు పెడితేనే యిస్తాడు." చెప్పాడు సదాశివం.

"బ్రదర్! మీకూ నాకూ తేడా ఉంది. లింగరాజు నన్నెప్పుడూ అలా అడగడు." ధీమా ధ్వనించింది గంగాధరం కంఠంలో.

"సరే! మీ నమ్మకాన్ని నేనెందుకు కాదనాలి. వెళ్ళి తప్పకుండా ట్రై చెయ్యండి." పొడిపొడిగా అన్నాడు సదాశివం.

సదాశివం చెప్పినది నిజమే కావచ్చు. కాని లింగరాజు తన బాల్య స్నేహితుడు కదా! తనకు కూడా తాకట్టు లేందే యివ్వనంటాడా? పైగా యింతవరకూ ఎప్పుడూ లింగరాజు దగ్గర అప్పు తీసుకోలేదు. దానివల్ల స్నేహం పాడవ వచ్చునన్నదే తన ఉద్దేశ్యం. సాయంత్రం లింగరాజింటికి వెళ్ళాలి. అడిగితే తప్పక ఇస్తాడన్న నిర్ధారణకు వచ్చాడు గంగాధరం.

ఈలోగా ఆఫీసు టయిము కూడా అయిపోయింది. ఒక్కొక్కరే తమ తమ సీట్లు సర్దుకుని వెళ్ళి పోతున్నారు. లింగరాజు కూడా స్కూటరెక్కేశాడు.

గంగాధరం కూడా లేచాడు. పాత కాలం నాటి సైకిలు దొర్లించుకుంటూ రోడ్డెక్కాడు. పాల డబ్బాకు కావలసిన డబ్బు ఎక్కడా పుట్టలేదు. పాల డబ్బా లేందే యింటికి వెళ్ళలేడు. వెళ్ళి పార్వతి మొహం చూడలేడు

తీరా లింగరాజింటికి వెళ్ళి దేహి అనేసరికి అతడు కాదంటే? కొంప మునిగిందేం ఉంది? ఇందరిచేత కాదని పించుకోగా లేంది యిక లింగరాజేనా అంత తీసి పోయింది. బాల్య స్నేహితుడే కదా? కాదనడు




ఒకవేళ కాదన్నా అంతగా బాధపడక్కర లేదని ఆలోచించాడు సైకిలెక్కాడు.

హుషారుగా లింగరాజింటి వైపు పోనిచ్చాడు గంగాధరం

గంగాధరం వెళ్ళేసరికి లింగరాజు హాల్లో టి వి చూస్తూ కనిపించాడు. గుమ్మంలోనే నిలబడి పోయాడు గంగాధరం సంకోచంగా.

గుమ్మంలో నిలబడ్డ గంగాధరాన్ని చూచాడు లింగరాజు.

"అదేమిట్రా? కొత్తవాడిలా అలా నిలబడి, పోయావు. రా! రా!" అంటూ ఆహ్వానించాడు లింగరాజు. ఇంటి లోపలి నుండి బిస్కట్లు, ఏపిలు ముక్కలు తెప్పించాడు. ఫ్రిడ్జి తెరచి కూల్ డ్రింకు యిచ్చాడు.

ఆ మర్యాదలకు ఉబ్బి తబ్బిబ్బయాడు గంగాధరం. కొంతసేపు యిబ్బందిగా కూచున్నాడు. లింగరాజును డబ్బడగాలనుకున్న మాట నోటి చివరి దాకా కనీసం ఏ వందసార్లో వచ్చి ఉంటుంది ఆ కాస్తసేపటిలోనూ కాని అడగలేక పోయాడు

మరి కొంతసేపయాక, వస్తాన్రా!" అన్నాడు సోఫాలోంచి లేచి

లింగరాజు గంగాధరం వైపు చూచి, ఏదో పని మీద వచ్చినట్టున్నావు అదెదో చెప్పకుండానే వెళ్ళిపోతున్నా నంటావు. పనేమిటో చెప్పు." అన్నాడు.

"అబ్బె! పనేం లేదులే!"

"ఊరుకోరా వెధవ మొహమూ నవ్వూనూ. నా దగ్గర కూడా మొహమాటమే?" కాస్త నిష్ఠూరం ధ్వనించింది లింగరాజు కంఠంలో

గంగాధరం కాస్త మెత్త బడ్డాడు. మిత్రుడి ఆదరానికి పొంగి పోయాడు.

"మరేంలేదురా! ఓ నలభయి రూపాయలు సర్దగలవేమోనని.... చంటాడికి...." అంటూ నసగ సాగాడు.

"పాలడబ్బా కొనాలంటావు. అంతేనా? నీ మొహమాటం మండిపోనూ!" అని లేచి లోపలకు వెళ్ళి ఓ వంద నోటుతో తిరిగి వచ్చాడు లింగరాజు. దానిని గంగాధరానికి అందించబోయాడు.

గంగాధరం ఆ నోటు అందుకోకుండా, "నాకు కావలసినది నలభయ్యేరా!" అన్నాడు.

"చాల్లేవోయ్ చెప్పొచ్చేవ్! పట్టు కెళ్ళు" అని

## షాక్

వందనోటు గంగాధరం చేతిలో కుక్కాడు లింగరాజు

గాలిలో తేలుకుంటూ యింటికి చేరుకున్నాడు గంగాధరం.

★ ★ ★ ★

జీతాలందాయి. తల్లికి జబ్బు చేసింది వైద్యం, ఖర్చులతో చేతిలో పైస మిగలలేదు గంగాధరానికి.

ఓ రోజు సిగ్గుపడుతూ లింగరాజు దగ్గరకు వెళ్ళి పరిస్థితి సాకల్యంగా వివరించి, "ఏమీ అనుకోకురా లింగరాజూ! అన్నమాట ప్రకారం నీ డబ్బు నీకు తిరిగి యివ్వలేక పోయాను." అన్నాడు గంగాధరం.

"డోంట్ బాదర్!" అన్నాడు లింగరాజు.

మరో వారం గడిచింది

ఆఫీసులో ఓ రోజు గంగాధరం దగ్గరకు వచ్చాడు లింగరాజు.

"ఒరేయ్ గంగాధరం! ఇంట్లో గ్యాస్ సిలిండరు అయిపోయిందని మనిషిని పంపిందిరా మా ఆవిడ." అన్నాడు.

ఉన్నపళాన డబ్బు తెమ్మంటాడేమోరా భగవంతుడా అని గుండె గుబుక్కుమంది గంగాధరానికి.

లింగరాజే తిరిగి అందుకుని, "మరేం లేదు. నీ సైకిలు ఒకసారి యిచ్చావంటే మా మనిషి కిచ్చి పంపిస్తాను. వాడు ఇంట్లో గ్యాస్ సిలిండరు పడేస్తాడు. రేపటికి మళ్ళీ నీ సైకిలు నీ కందిస్తాను." అన్నాడు.

"హమ్మయ్య!" అనుకుంది గంగాధరం మనస్సు.

"దానిదేం పోయిందిరా! దానికి నువ్వింతగా చెప్పాలా!" అని సైకిలు తాళం అందించాడు గంగాధరం

మూడు రోజులు గడిచాయి. సైకిలు జాడ లేదు. లింగరాజు దాని ఊసే ఎత్తడం లేదు.

ఉండబట్టలేక ఓ రోజు లింగరాజు నడిగాడు గంగాధరం.

"అన్నట్టు చెప్పడం మరిచానురా. ఆనాడు నువ్వు సైకి లిచ్చావా! మా వెధవ దాని హ్యాండిలు బారు విరగ్గొట్టాడు. ఏ రోజు కారోజే కుదరడం లేదురా. కొత్త బారు వేయించి రేపిస్తానులే." అన్నాడు లింగరాజు

మరో నాలుగు రోజులు గడిచాయి లింగరాజు సైకిలు మాట ఎత్తడం లేదు.

ఓ రోజు సాయంత్రం లింగరాజింటికి వెళ్ళాడు గంగాధరం.

ఆ రోజు కూడా లింగరాజు మర్యాదలలో ఏ తేడా కనిపించ లేదు

చివరగా యిక వెళ్ళి పోబోయే ముందు, "ఒరేయ్ లింగరాజూ! నీకు పని తొందరలో సైకిలు హ్యాండిల్ బారు వేయించడం కుదిరి ఉండదు ఆ డొక్కు సైకిలుకు కొత్త బారెందుకు? పాత దానినే వెల్డింగు చేయిస్తాను." అన్నాడు గంగాధరం.

ఆ మాటమీద లింగరాజు చిరు నవ్వు నవ్వి, "ఒరేయ్ గంగాధరం! ఆ గంగాధరుడి నివాసం వెండి కొండ మరి అతడి భార్యో? సర్వమంగళ. అయినా అతడిది బిచ్చపు బ్రతుకే

అలాగే నువ్వు పని చేసే సీటు కూడా బంగారు' కొండ నువ్వు దానిని సద్వినియోగం చేసుకోలేక పోతున్నావు.

నీ సైకిలుకు ఏమి కాలేదు " అనిపక్క నున్న షెడ్డు వైపు చూపించి, "అదిగో! అందులో నిక్షేపంగా ఉంది నువ్వు ఎప్పుడయినా పట్టు కెళ్ళ వచ్చు కాని, ఒక షరతు " ఆగాడు లింగరాజు

"ఏమిటా షరతు?" ఆత్రుతగా అడిగాడు గంగాధరం.

"ఒరేయ్ గంగాధరం! సొమ్ము ఎప్పుడూ తేరగా రాదురా. నేను నీకు వంద రూపాయ లిచ్చానా? దానికి వడ్డీగా నెలకూ నూటికి పది రూపాయల చొప్పున వడ్డీతో సహా మొత్తం సొమ్ము చెల్లించు సైకిలు అప్పుడు పట్టు కెళ్ళు. ఆ వడ్డీ కూడా నీకు కన్సెషను రేటు సుమా!" అన్నాడు లింగరాజు.

గంగాధరానికి బుర్ర గిర్రున తిరిగింది. సదాశివం చెప్పిన మాటలు దిక్కులు పిక్కటిల్లేలా ప్రతిధ్వనింప సాగాయి చెవుల్లో

లింగరాజుకు ఏ జవాబూ చెప్పలేక బేలగా చూస్తూ వెనుదిరిగాడు గంగాధరం □






एक सौ रुपये

100

ONE HUNDRED RUPEES

# జై కిసాన్ పనితనం అద్భుతం
# పొలంలో పండింది బంగారం

కారణం ఏమిటంటే, ఉత్తమ శాస్త్రీయ పద్ధతిలో తయారైన జైకిసాన్ ఎరువులు నీటిలో ఇట్టే కరుగుతాయి, మొక్కలకు వెంటనే అందుతాయి. అంచేత కొస్తంత ఎరువు కూడా వృధాగా పోదు, పూర్తిగా మొక్కలకు అందుతుంది. మరి, మీరు కూడా జైకిసాన్ ఎరువులు తెచ్చుకోండి, పొలంలో బంగారం పండించండి!

**జైకిసాన్ యూరియా 46.4% నత్రజని**

స్వచ్ఛమైన తెల్లని గుళికల రూపంలో వుండే జైకిసాన్ యూరియా 46.4% నత్రజనితో సమృద్ధమైనది. ప్రతి నేలకూ, ప్రతి పంటకూ ఉత్తమమైనది.

**జైకిసాన్ సంపూర్ణ 19:19:19**

ముఖ్యంగా ప్రత్తి, వరి, గోధుమ, చెరకు మొదలైన పంటలకూ, పొటాష్ లోపం గల నేలలకూ ఉత్తమమైనది.

**జైకిసాన్ సామ్రాట్ 18:46:0**

వర్షాధార పంటలకు ఇది అతి ఉత్తమమైన ఎరువు. ప్రతి నేలకూ. ప్రతి పంటకూ అనువైనది.

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి ఉచిత భూసార పరీక్ష సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.

---













## జై కిసాన్ రాజ్యం-ధాన్యలక్ష్మీ సామ్రాజ్యం

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇండోర్, ఆగ్రా, జువారి నగర్.

LINTAS ZUA 133 2317 TL



# డాక్టర్ సలహాలు




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు


– రాజమండ్రి

నా వయస్సు 17 సం లు నాకింకా వివాహం కాలేదు ఋతుక్రమం నెలనెలా వస్తుంది బ్లీడింగ్ కూడా మామూలుగానే అవుతుంది కాని నాలుగు నెలల నుంచి మెన్సస్ అయిన ఆరవ రోజు నుంచి 10, 12 రోజుల వరకు పొత్తి కడుపులో బొడ్డు కింద గుండ్రంగా నెప్పి వస్తున్నది నెప్పి వచ్చినప్పుడు డిశ్చార్జి అయ్యే దగ్గర మంటగాను, నరాలు బిగపట్టినట్లుగాను ఉంటుంది నెప్పి పగలుకంటే రాత్రిళ్ళు ఎక్కువగా ఉంటుంది

కన్‌జెస్టివ్ డిస్మెనోరియా లక్షణాలు ఉన్నాయేమో లేడీ డాక్టర్లకి చూపించండి. నెప్పి – మంట సూక్ష్మక్రిముల ప్రభావం వల్ల ఏర్పడతాయి. వైద్యుల సలహాపై మందులు వాడితే ఈ లక్షణం తప్పక నయమవుతుంది.

ఎస్. ఎస్ ఎస్ – విజయనగరం

కేన్సర్ ఎందువలన వస్తుంది? ఇది వంశపారం పర్యంగా వచ్చే జబ్బా? ఇందులో ఎన్ని రకాలు ఉన్నాయి? ఈ జబ్బు వచ్చేముందు శరీరంలో ఏవైనా మార్పులు కనబడతయ్యా? ఈ రోగం రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు ఏవి? ఇది అంటు రోగమా? ఆడవాళ్ళకి వచ్చే కేన్సర్ ఎటువంటిది?

కేన్సర్ ఎందువల్ల వస్తుందో కచ్చితంగా చెప్పలేము. కేన్సర్‌కి దోహదం చేసే కారణాలు మాత్రం కొన్ని తెలుసు. సిగరెట్లు, పొగాకు, మధుపానం, వాతావరణ కాలుష్యం, మొదలయినవి వీటిలో కొన్ని మాత్రమే.

కేన్సర్ వంశపారంపర్యం కాదు. శరీరంలో ఎన్నో రకాల కేన్సర్‌లు ఉన్నాయి. వాటిని ఇక్కడ వివరించటం కుదరదు. ఏ భాగంలో నైనా కేన్సర్ రావచ్చును.

దగ్గు, కఫం, డిస్చార్జి, నెప్పి– మంట మొదలయినవి శరీర భాగాన్ని బట్టి రావటం జరుగుతుంది. పై అలవాట్లని మానటమే ముందు జాగ్రత్త. లక్షణాలకి వెంటనే వైద్య పరీక్ష అవసరం. ఇది అంటురోగం కాదు. స్త్రీలకి మాత్రం జననేంద్రియాలలోను, పాలిండ్లలోను ఎక్కువగా కేన్సర్ వస్తుంది

డి పి – వాయల్పాడు

నేను కనుబొమలకి, కనురెప్పలకి నూనె పూస్తూ ఉంటాను అలా పూస్తే వెంట్రుకలు ఒత్తుగా వస్తాయా? అలా నూనె పూయటం వల్ల కంటి కేమైనా అపాయమా?

నూనె పూయటం వల్ల అపాంతర మేమి లేదు. లాభం ఉంటుందేమో కానీ నష్టం లేదు. ప్రయత్నించి చూడండి.

# మనం మరచిపోకూడని ఆనీ బీసెంట్!



1893లో ఆనీ బీసెంట్

ఆనీ బీసెంట్ (1847–1933) ఎవరో అందరికీ కాకపోయినా, కొంత మందికైనా తెలిసే ఉంటుంది భారత స్వాతంత్ర సమర చరిత్రలో ఈమె పేరు వినిపిస్తుంది ప్రపంచ ప్రసిద్ధి పొందిన బెనారస్ విశ్వవిద్యాలయానికి బీజం వేసింది ఆనీబీసెంట్! ఈనాడు ప్రపంచ ప్రజలందరి చేతా దార్శనికునిగా మన్ననలందుకొంటున్న జిడ్డు కృష్ణమూర్తి ఈమె దత్తపుత్రుడు! 1917లో భారత జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షురాలిగా ఎన్నుకోబడ్డ ఆనీబీసెంట్ స్పష్టంగా పాశ్చాత్యమహిళ ఐర్లాండ్‌కు చెందిన వ్యక్తి అయినప్పటికీ భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాలని పట్టుపట్టి బ్రిటిష్ వారితో ఈమె తలపడడం ఆశ్చర్యంగా ఉంటుంది 46 ఏళ్ల వయస్సప్పుడు భారత దేశానికి వచ్చి భారతీయ సంస్కృతి పట్ల ప్రభావితురాలై శేష జీవితమంతా ఇక్కడే గడపడం సంస్కారపరంగా భారతదేశం ఎదిగిన స్థాయిని సూచిస్తుంది

బడిపంతులు కూతురిగా పుట్టిన ఆనీ చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయింది ఇరవై ఏళ్ల ప్రాయంలో (1867) రెవరెండ్ ఫ్రాంక్ బీసెంట్‌ను పెళ్లి చేసుకొంది స్త్రీ పురుష సమానత్వాన్ని మనస్ఫూర్తిగా కోరుకునే ఆమె అందుకు పూర్తిగా భిన్నమైన మనస్తత్వం గల భర్తతో కాపురం చేయలేక పోయింది 1873 లో అధికార పూర్వకంగా విడాకులు పొందింది అప్పుడే సాంఘిక సంస్కర్త అయిన చార్లెస్ బ్రాడ్ లాఫ్‌తో పరిచయం కలిగింది ఫలితంగా దశాబ్దంపాటు స్వేచ్ఛాయుత భావ ప్రకటన, స్త్రీ భావదాస్య నిర్మూలన, కుటుంబ నియంత్రణ తదితర అంశాలపై విరివిగా రచనలను, ప్రసంగాలను చేపట్టింది అనీ బీసెంట్!

బ్రాడ్‌లాఫ్ మరణంతో ఆమె జీవితం మరో మలుపు తిరిగింది అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 1875లో నెలకొన్న థియోసోఫికల్ సొసైటీ వ్యవస్థాపకుడైన హెచ్ పి బ్లావట్‌స్కి తో ఆమెకు పరిచయం కలిగింది ఆ సొసైటీలో సభ్యురాలిగా చేరి సర్వమానవ సోదర భావాన్ని సర్వమత సమానత్వాన్ని ఆమె ప్రబోధిస్తూ దేశ దేశాలూ తిరగసాగింది అలా తిరుగుతూ భారత దేశానికి వచ్చి ఇక్కడే స్థిరపడి పోయింది

1916 ప్రాంతంలో అఖిలభారత స్వయం పాలక కూటమి ని అనీ బీసెంట్ ఏర్పరచింది బ్రిటిష్ సామ్రాజ్యం క్రిందే స్వతంత్ర ప్రతిపత్తి ఉన్న దేశంగా భారతదేశం ఉండాలని ఆమె వాంచించేది సామంత దేశంగా భారత దేశం ఉండాలన్న అభిమతం ఆమెమాటల్లో ద్యోతకమయ్యేదని కొంతమంది చారిత్రకులనే మాటలను గట్టిగా పరిశీలించాలి ఈమెకు తీవ్రవాదుల పత్తాసు ఉండేదని దాదాభాయి నౌరోజీకి దిన్‌షా వాచా రాసిన ఉత్తరం వల్ల తెలుస్తుంది అయితే లోకమాన్య బాల గంగాధర తిలక్ అంతటి వాడే అనీ బీసెంట్ చిత్త శుద్ధిని ప్రశంసించ కుండా ఉండలేక పోయాడు వీరిద్దరి వల్లా జన సామాన్యంలో స్వాతంత్రం పట్ల విద్యుత్జాగృతి కలిగిందని జవహర్‌లాల్ నెహ్రూయే స్వయంగా అన్నాడు కాంగ్రెస్ అధ్యక్షురాలిగా కూడ ఎన్నిక కావడం ఆమె కర్తవ్య దీక్షపట్ల భారతీయ కార్యకర్తలకు ఉన్న విశ్వాసాన్ని వ్యక్తం చేస్తుంది స్వాతంత్ర్యం రాకముందే ఆమె కన్ను మూసినా ఆమె అందించిన స్ఫూర్తి మాత్రం మరువలేనిదని ఎంతో మంది అంటారు

ఇటీవల థియోసోఫికల్ సొసైటీవారు అనీ బీసెంట్ పై సమగ్రమైన పుస్తకాన్ని ప్రచురించారు ఈ సొసైటీ భావాలు పరిపూర్ణత సాధించినవి కావనీ, బౌద్ధమతంలోని సందిగ్ధ భావాలు వీటికి మూలమనీ, ఇవి శాస్త్ర చర్చలో నిలవవనీ కొందరి విమర్శ అనీ బీసెంట్ కూడా స్థిరమైన భావాలను ప్రదర్శించలేదు ఆమె బాపూజీని మహాత్మా గాంధి అని పిలవ డానికి ఇష్టపడేది కాదని మిస్టర్ గాంధి అని సంబోధించేదని సమకాలికులు అంటారు ఇది ఆత్మ న్యూనతా భావమో మరి ఆత్మోద్ధతా భావమో అర్థం కాదు మహాత్ముని గొప్పతనాన్ని అంగీకరించ డానికి ఆమె మనస్తత్వ మెందుకో ఒప్పుకోలేదని పిస్తుంది అంతర్లీనంగా ఆమెలో దాగి ఉన్న ఏవో వ్యతిరేక భావాలే దీనికి కారణమని అనుకోవచ్చునేమో

ఏది ఏమైనా భారతీయులు ఆమె చేసిన సేవల పట్ల ఎప్పటికీ కృతజ్ఞతను కనబరుస్తారు అది వారి ధర్మం కూడా!

—డా జి ఆర్ బి



సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

ఈ రోజు ప్రభాకర్ చాలా సౌమ్యంగా మెత్తగా మాట్లాడుతున్నాడు సున్నితంగా అనిపిస్తున్నాడు

భోజనం చేశావా?

ఊఁ అంది సీత

అతని చేతిలో ఇంగ్లీషు మేగ్జైన్ వుంది అది ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్లకి సంబంధించినది

అట్టమీద మంచి డెడ్ కలర్స్ గ్లేసి ప్రింటులో పెద్దపులి బొమ్మ నోరు తెరచుకొని భయంకరంగా వుంది

అది కేవలం బొమ్మే అయినా ప్రాణం పోసుకొని ఎదురుగా నిల్చుందా అన్నట్టు దాని కళ్ళు ఎర్రగా చిన్న అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయ్

కోరలు వాడిగా వున్నాయ్

పంజా విప్పుకొని మీదికి దూకటానికి సిద్ధంగా గుండె అదురు పుట్టించే బంగిమలో అతి భయంకరంగా చిత్రీకరించి వుంది

చంటిపిల్లలు చూసి ఝడుసుకున్నా ఆశ్చర్యపోనక్కరలేదు

ఆ బొమ్మని వ్రేలితో చూపిస్తూ అన్నాడు ప్రభాకర్ -

సీతా! నీకు పెద్ద పులి అంటే భయమా?

సీతకి నవ్వు వచ్చింది

పెద్దపులి అంటే ఎవరికి భయం వుండదు? అయినా అసలు అదేం ప్రశ్న?

జరిగిన కథ-11 ఇద్దరి ఎల్లల తండ్రియైన ప్రభాకర్‌తో సీతకు వివాహం, జరిగింది సీతకి పిల్లలపట్ల ఉన్న శ్రద్ధ ప్రేమ చూస్తుంటే ప్రభాకర్‌కి ఆనందం కలుగసాగింది ఆ ఆనందమే అతనికి సీతంటే అభిమానం ఏర్పడేలాగా చేసింది ప్రభాకర్ స్నేహితురాలు ఆష వచ్చి వెళ్లటంతో సీత మనసు కలతపడింది సీత ప్రభాకర్‌కి భార్యలా గాక పనిమనిషిలా ఉందని ఆష అనేటప్పటికి ప్రభాకర్ హర్ట్ అవుతాడు ప్రభాకర్‌కి సీతంటే కొంచం జాలి కొండంత సానుభూతి ఉంది ఆమెపై తనకు గల మమకారం పైకి వ్యక్తంచేస్తే ఆమెకి లోకువయి పోతానని అది మనసుకే పరిమితం చేసుకున్నాడు సీతను చూడటానికి సీత తల్లి ఊర్నించి వచ్చింది తల్లి ప్రవర్తన సీతకు చికాకు కలిగిస్తుంది తల్లి ఊరు వెళ్లటంతో వాన వెలిసినట్లయింది సీతకి రోజులు గడిచేకొద్దీ ప్రభాకర్ సీతల మధ్య తియ్యని అనుబంధం ఏర్పడుతోంది ప్రభాకర్ సౌమ్యంగా మాట్లాడేసరికి సీత సంభ్రమపడింది

"చెప్పు?" రెట్టించాడు ప్రభాకర్

ఏం మీకు భయంలేదా?

అమ్మో! నాకు చాలా భయం కాని నేను అడుగుతున్నది నీ గురించి అన్నాడు కాస్త తమాషాగా నవ్వుతూ

"నాకూ భయమే అంది సీత

సింహం అంటే

భయమే

రాక్షసుడు అంటే?

(బర్త తనని ఆటలు పట్టిస్తున్నాడు)

సీతకి పెదవుల మధ్య నవ్వు దాగటంలేదు పుప్పెనలా పొంగుతూంది

కాని అతను సీరియస్‌గా అడుగుతున్నాడు

చెప్పు

భయమే

సీతా

ఊఁ

మరి మరి నేనంటే?

సీత వులిక్కిపడింది

రిచ్చపడుతూ చప్పున తల ఎత్తింది

ప్రభాకర్ సూటిగా సీత మొఖంలోకి చూశాడు

ఆ చూపులో క్రౌర్యంలేదు

సౌమ్యంలేదు

భావాలు అనిర్వచనీయంగా వున్నాయ్

సీత చప్పున తలదించుకుని చేతిగాజులు సవరిస్తూ నిశ్శబ్దంగా వుండిపోయింది

-

సీతా ?

-

నీకు నేనంటే కూడా భయమే అవునా? చిన్న గొంతుకతో ప్రభాకర్ గంభీరంగా అడుగుతున్నాడు

-

చెప్పు సీతా! నీ కంటికి నేను కూడా రాక్షసుడి లాగానే కనిపిస్తున్నానా?

సీత నుదుట సన్నగా చిరుచెమట పట్టింది

ఆమెలో ఖంగారు ఎక్కువైంది

ఎన్నడూ లేనిది ఏమిటి ఈ రోజు ఈయన ధోరణి?

విస్తుబోయింది

ప్రబాకర్ ప్రవర్తన రోజు కంటి బిన్నంగా వుంది

అతని దగ్గర సన్నగా బ్రాంది వాసన వస్తోంది

కంటి చివరలు క్రమంగా ఎరుపు రంగుకి వస్తూంది

అతని మనసు బాగుండనప్పుడే కొద్దిగా డ్రింక్ చేసే అలవాటు వుందని తెలిసింది

అయితే మరి ఈ రోజు ఎందుకు తాగినట్లు?

మనసు బాగుండలేదా?

ప్రియమైన సంధ్య జ్ఞాపకం వచ్చిందా?

లేక

గరల్ ఫ్రెండ్ ఆషా అందుబాటులో లేదా?

ఆపిల్ ముక్క మునిపంట కొరుకుతూ అన్నాడు ప్రబాకర్

సీతా! ఆ టేబిల్ మీద నా బ్రీఫ్‌కేస్ వుంది తెరచి చూడు ఏం వున్నాయో ?

సీత నెమ్మదిగా లేచి వెళ్లి బ్రీఫ్‌కేస్ తెరిచింది

దాని నిండా ప్యాకెట్లు !?

కవర్లు విప్పి చూడు వెనకనుంచి ఆజ్ఞాపిస్తున్నట్లు భర్త గొంతు వినిపించింది

సీత నెమ్మదిగా కవర్లు వూడదిసింది

చీరలు!

రకరకాల చీరలు

ఆకర్షణీయమైన రంగుల్లో అందమైన డిజైన్లలో దాదాపు డజను పైగా వున్నాయ్

సీత కళ్లు ఆశ్చర్యంతో విశాలంగా అయ్యాయి

ఇన్ని చీరలు ఒకేసారి ఎందుకు తెచ్చినట్లు?

ఏదైనా పంక్షన్ జరగబోతోందా?

ఎవరైనా ముఖ్యమైన బంధువులు వస్తున్నారా?

లేక

ఇవన్ని తన కోసమా?

ఊహుఁ కాదు

మరి ?"

సీత సందిగ్ధంలో పడిపోయింది

ఆమె మనసు సందేహాలతో కొట్టుకుంటోంది

మరొక ప్రక్క సన్నటి భయంతో నుదురంతా చిరుచెమటలు క్రమ్ముతున్నాయ్

దిక్కుతోచని దానిలా మునివ్రేళ్లతో ఆ చీరల్ని సవరిస్తూ మౌనంగా నిల్చుండిపోయింది

అలా ఎంతసేపు గడిచిందో ఆమెకి తెలియదు

సీతా! అన్న భర్త ఎలుపుకి చిన్న వులికిపాటుతో చప్పున తల ఎత్తింది

ఇలా దగ్గరగా రమ్మన్నట్లు కళ్లతోనే పిలిచాడు ప్రబాకర్



# జీవితం చేజారిందా

సీత నెమ్మదిగా టేబిల్ దగ్గర్నుంచి కదిలి అతని మంచం దగ్గరకి వచ్చింది

ప్రభాకర్ ఆమె చేతిని మృదువుగాపట్టుకున్నాడు

పడుకున్న వాడల్లా వాలుగా సగం లేచి దిండుకు ఆనుకుని కూర్చుంటూ అన్నాడు -

చూడు సీతా! ఆ చీరలన్నీ నీ కోసమే తెచ్చాను రేపట్నుంచి నిత్యం వాడుకో ఇప్పుడేకాదు నీకు ఎప్పుడు అవసరం వచ్చినా నన్ను అడుగు భయపడాల్సిన పనిలేదు ఆ సూట్‌కేస్‌లో నా కీ - బంచ్ వుంది ఇలా తీసుకురా

సీత వెళ్ళి ఆ కీ - బంచ్ తీసి అతనికి ఇచ్చింది

ప్రభాకర్ అందులోంచి ఒక కీ తీసి ఆమెకి అందించాడు

ఇది బీరువా డూప్లికేట్ కీ ఇకనుంచి నెలకింత అని ఇంటి ఖర్చుల కోసం అందులో డబ్బు పెడతాను నీకు ఏ అవసరం వచ్చినా నువ్వు ఆ డబ్బు వాడుకో నాకు లెక్కలు చెప్పవలసిన పనిలేదు తెల్సిందా? అంతేగాని ఇకపై నువ్వు దేనికి ఇబ్బంది పడకూడదు తిండి, బట్ట నగ నువ్వు ఏది కోరుకొంటే అది నువ్వు పెద్ద ఇండస్ట్రియలిస్ట్ భార్యవి అన్న సంగతి మరిచిపోకు భగవంతుడి దయవల్ల మనకి డబ్బుకి లోటు లేదు అన్నాడు

- సీత నిశ్శబ్దంగా తల వంచుకుని వింటు వుండిపోయింది

తిరిగి అతనే అన్నాడు

సీతా! నువ్వు ఇక్కడికి వచ్చి పదినెల్లు అవుతోంది కదూ?

ఊఁ

కాని నేను నీ గురించి ఏమి ప్రత్యేక శ్రద్ధ తీసుకోలేదు

నీ అవసరాలు ఏమిటో పట్టించుకొని మాటకూడా నిజమే అయినా సీతా! నాకు తెలియక అడుగుతాను అసలు నువ్వు నన్ను ఏది ఎందుకు అడగలేదు? భయపడ్డావా? నీకేం కావాలో, నీ అవసరాలు ఏమిటో నువ్వే నన్ను స్వయంగా అడిగితే ఎంత ఆనందించేవాడినో కాని,

కాని అట్లా వేరే వాళ్ల చేత చెప్పిస్తే మాత్రం నాకు ఎంతమాత్రం ఇష్టం వుండదు ఇదేకాదు ఏ విషయం అయినా సరే నీకేదయినా కావలిస్తే నన్ను అడుగు లేదంటే బీరువాలోంచి డబ్బు తీసి హాయిగా ఖర్చు పెట్టుకో లేదంటే మనం ఇద్దరం వెళ్లి బజారు నుంచి తెచ్చుకుందాం

-!?

నాకేమి ఆడవాళ్ల షాపింగ్ గురించి ఎక్కువగా తెలియదు సంధ్య తనకి ఏది కావల్సి వచ్చినా డబ్బు తీసి ఖర్చు పెట్టుకొనేది తరచూ ఫ్రెండ్స్‌తో షాపింగ్ చేసేది లేదా నన్ను అడిగేది

అసలు అంత గడవని అవసరాలు అంటూ సంధ్యకి వుండేవికాదు చీరలు నగలు అన్ని లగ్నరీగానే కొనుక్కునేది కాని లేక ఇబ్బందిపడి మాత్రం కాదు ఆమె పుట్టింటివారు కూడా బాగా ధనవంతులు అందువల్ల నాకా ఆడవాళ్ల అవసరాలు గురించి తెలియదు కాని ఇకపై మాత్రం నువ్వు దేనికి వెలితి పడాల్సిన పనిలేదు తెల్సిందా?'

గుండెల మించి బరువు దించుకున్నట్లు తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు ప్రభాకర్

ఒకటి రెండు పదాలకంటె ఎక్కువగా మాట్లాడని ప్రభాకర్ ఆ రోజు కాస్త ఎక్కువే మాట్లాడాడు కాదు పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు

కర్ర విరగకుండా - పాము చావకుండా అన్న ధోరణిలో హితవు చెప్పాడు

ఎందుకు?

సీతకి ఏమి అర్థంకాలేదు

తలా తోక లేనట్లు వుంది అతని ధోరణి

అసలు విషయం ఏమిటో అంతుచిక్కలేదు

తల వంచుకుని మౌనంగా కూర్చుండిపోయింది

వాల్చుకున్న ఆమె కనురెప్పల మాటున రెండు పెద్ద కన్నీటి ముత్యాలు రాలనా? వద్దా? అన్నట్లు కదులుతున్నాయి

అసలు ఈ రోజు ఏమిటి ఈయన ధోరణి? నేను చీరలు లేవని ఎవరికి చెప్పుకున్నాను? ఈయన పట్టించుకోవటం లేదని ఎవరితో వాపోయ్యాను ఇంతవరకు ఇరుగు పొరుగు అంటే ఎవ్వరో తెలియదు ఇంకా ఫ్రెండ్సు ఏర్పడలేదు తెల్సిందల్లా సుబ్బులు రం

చూడు

సీత చప్పున ఆలోచన్ల నుంచి తేరుకొని తల ఎత్తింది

ప్రభాకర్ తలగడా ఎత్తి చిన్న ముఖమల్ కేస్ తీసి ఆమె చేతికి అందించాడు

తీసుకో! ఇవి కూడా నీ కోసం తెచ్చాను

ఏమిటి?

తెరిచి చూడు

సీత ఒణికే చేతులతో ఆ చిన్న పెట్టె తెరిచింది

అంతే!

ఆమె కళ్ళు మిరుమిట్లు గొలిపినట్లు జిగేల్‌మన్నాయి

ఆ చిన్న పెట్టె నిండా బంగారు ఆభరణాలు

కొత్తవి చక్కటి నగిషి పనితనంతో జిగజిగా మెరిసిపోతున్నాయి

మంగళసూత్రాలు గుచ్చుకోవటానికి సన్నటి నులకతాడు దానితో పాటే పొడవుగా చిన్న లాకెట్‌తో వున్న నాజూకైన పనితనంతో నల్లపూసల గొలుసు అరడజను బంగారు గాజులు, మరొక చిన్న ఎర్రని కాగితంలో రెండు పేటల ముత్యాల దండ వుంగరం చెవులకి రెండు రకాల ఇయర్ స్టడ్స్!

సీత కొద్ది క్షణాలు విభ్రాంతిగా వుండిపోయింది

తీగలు తెగిన వీణలా ఆమె మనసంతా మూగబోయినట్లు అయ్యింది

మొగం చిన్నబోయింది

ఇప్పుడు ఇవన్ని ఈయన ఎందుకు తెచ్చినట్లు?

ఎవరైనా ఏమైనా అన్నారా?

తానుగా ఎవరికి చెప్పుకోలేదే?

నిజానికి తనకి ఇలాంటి వ్యామోహాలు కూడా ఎక్కువగా లేవు

మరి • ఇంత హఠాత్తుగా ఈయన ఇవన్నీ తనకోసం ఎందుకు తెచ్చినట్లు?

అత్తగారు ఏమైనా ఉత్తరం వ్రాసిందా?

ఎంత లేదన్నా పది - పదిహేనువేలు విలువ చేస్తాయి

ఒక్కసారి ఇంత డబ్బు తనకోసం ఎందుకు ఖర్చుపెట్టినట్లు?

ఈ పేదరాలు సీత తన భార్య అనుకుందుకు ఆయనకి అవమానం అనిపించిందా?

అసలు ఏం జరిగింది? -

తుపాను వచ్చే ముందు సముద్రం ఆటు-పోటు ఎత్తినట్లు ఆమె గుండెల్లో సంచలనం

సీతా భర్త భుజం పట్టి కుదుపుతుంటే వులిక్కిపడింది సీత

ఆలోచన్ల నుంచి తేరుకొని ఏమిటి? అన్నట్లు అతనికేసి చూసింది

ప్రభాకర్ చిన్నగా నవ్వాడు

ఏమిటి ఇంత ఆలోచన? ఇవన్ని నీ కోసమే తెచ్చాను నా సెలెక్షన్ నచ్చలేదా? లేక

సీత ఖంగారుగా తల తిప్పింది

ఆహఁ అదికాదు నాకు ఇప్పుడు ఇవన్ని ఎ ఎందుకు?

ఎందుకేమిటి? ఇవన్ని నీ కోసం ఎప్పుడో తేవాల్సిన మాట నా బిజినెస్ వ్యవహారాల్లోపడి ఏమిటో అశ్రద్ధ చేశాను అమ్మ మళ్లి వస్తుందేమో ఆవిడ చూసుకొంటుంది అనుకున్నాను కాని ఆవిడ రాలేదు సరే అని నిన్న మా ఫ్రెండ్ షాపింగ్ చేస్తుంటె నేను చేశాను చెప్పు మరి ఇంతకి నీకు నా సెలెక్షన్ నచ్చిందా?

ఊఁ కాని ఇంత విలువైన

అతను మృదువుగా నవ్వాడు

ఆప్యాయంగా ఆమె చేతిని పట్టుకొన్నాడు

సీతా! నీకంటె విలువైనవా ఆ నగలు? కాదు తల్లి లేని పిల్లల్ని తల్లికంటె ఎక్కువగా లాలించి ఆదరిస్తున్నావు వాళ్ళిద్దర్ని మళ్లి ఇంత ఆరోగ్యంగా ఆనందంగా చూస్తాననుకోలేదు నీకు ఏమిచ్చినా నా ఋణం తీరదు అన్నట్లు నీ కోసం ఒక చిన్న డైమండ్ బ్రోచ్ ఆర్డర్ ఇచ్చాను వన్ మంత్‌లో వస్తుంది

# విజయ్

భారతదేశపు నెంబర్ 1 ఐరన్
9 మోడల్స్‌లో లభిస్తుంది.




























**Vijay**®

*a friend of your family*

Jaisons/AMA/86/84

## జీవితం చేజారిందా

ఏదైనా ఫంక్షన్స్‌లో పెట్టుకుందుకు బావుంటుంది ఇవి మాత్రం ఇక నుంచి నిత్యం వాడుకో

'సంధ్య నగలు లాకర్సులో చాలా వున్నాయి కాని అవి తీసి వాడటం నాకు ఇష్టంలేదు సంధ్య ఆస్థి అంతా మంజుకే చెందాలని నా కోరిక అందుకే నీ కోసం ఇవి ప్రత్యేకంగా కొన్నాను మరి నీకు నచ్చినట్లేనా?

సీత ఊఁ అనలేదు. ఆఁ అనలేదు స్తబ్ధురాలు అయిపోయింది

వూపిరి తియ్యటం కూడా మరిచిపోయి కదులు మెదులు లేని సజీవ శిల్పంలా అలాగే భర్త మొఖంలోకి చూస్తూ వుండిపోయింది

కాని అప్పటికే ప్రభాకర్ నెమ్మదిగా ఆమె చేతులకి గాజులు తొడిగి వ్రేలికి వుంగరం పెట్టాడు

మెడ మీద అతని వ్రేలి కొసలు తగులుతుంటే వులిక్కిపడి ఆ గొలుసు అందుకుని తనే హుక్స్ పెట్టుకుంది

ప్రభాకర్ పెదవులపై అందంగా ఒక సన్నటి చిరునవ్వు తొణుకుతుంటే రెండు నిమిషాల సేపు రెప్ప వాల్చకుండా అలాగే దీక్షపట్టినట్లు ఆమెకేసి చూశాడు

పెళ్లి అయిన తరువాత అంత ఆప్యాయంగా అంత సునిశితంగా సీతని చూసిన మొదటి క్షణం

ఆ రోజు సీత ఇస్త్రీ చేసిన సన్నటి జరి తెల్ల చీర కట్టుకుంది

ఆ చీర పెళ్లినాటి తలంబ్రాల చీర

తల నిండా జాజి పూలదండ గుచ్చి పెట్టుకుంది

పెరట్లో రెండు మూడు జాజి పందిర్లు వున్నాయి అవి రోజు బుట్టలకొద్ది పూలు విరగబూస్తాయి అక్కడికి వచ్చినప్పటి నుంచి సాయంత్రం కాగానే ఆ పూలన్నీ పెద్ద దండ కట్టి సగం దేముడి పటానికి వేసి, మిగతా సగం తను మంజు పెట్టుకోవటం బాగా అలవాటైంది సీతకి

చీకట్లు పడుతున్నకొద్ది జాజి మొగ్గలు అరవిరిసి ఘుమఘుమ పరిమళాలు విరజిమ్ముతుంటే సీతకి ఒక అలౌకికమైన ఆనందం!

ఆమెకి చిన్నప్పట్నించి పూలంటే ఎక్కువ ఇష్టం

అందునా ఆ జాజులు అంటే ఇంకా ఇష్టం అలా ప్రభాకర్ ఎదురుగా తల వంచుకొని కూర్చున్న సీత మెడమించి ఆ పూలదండ కొద్దిగా భుజాల మిదుగా ముందుకి జారింది

ఆకుల మాటున ఒదిగిన ఏందెలా ఆ క్షణంలో ఆ అలంకరణలో సీత .. అతని కంటికి ఎంతో ముగ్ధమనోహరంగా, స్త్రీత్వానికి మారు రూపంగా కనబడింది

నెమ్మదిగా ఒంగి తన బలమైన చేతులు ఆమె నడుం చుట్టి బిగించి ఆమె మిదుగా చెయ్యి చాచి లైట్ స్విచ్ ఆఫ్ చేశాడు

ఆ ప్రేమకి . ఆదరణకి సీత హృదయం ఆర్ద్రం అయ్యింది.

ఆమె విశాలమైన రెప్పల మాటున వెచ్చగా కన్నీళ్ళు

ఆ రాత్రి భర్త అపురూపమైన ప్రేమ సీత గుండెపై స్వాతి జల్లులా కురిసింది!

అంతవరకు భర్తగ అతని అధికారం, దర్పమే తెలుసు

కాని

అసలైన అతని అనురాగాన్ని, మృదుత్వాన్ని చవి చూసిన మొదటి క్షణం అది

ప్రతీ రోజు ఈయన తనతో ఇలా ఎందుకు ప్రవర్తించరు? ఇన్ని చీరలు నగలు కొనియ్యనక్కరలేదు కాని కొంచెం ఆప్యాయత, కాస్త అనురాగం చూపి సౌమ్యంగా మాట్లాడితే తన మనసు ఎంత ప్రశాంతంగా వుంటుంది?

మూసుకున్న సీత కనురెప్పల మాటు నుంచి జలజలా కన్నీళ్ళు జారాయి

(ఇంకా ఉంది)

# బామ్మగారి బొంబే యాత్ర

డాక్టర్ పి.వి. రమణ




అంతకు మునుపు దాకా స్వర్గదామంగా, సకలార్థక సాధకానికి పరమ క్షేత్రంగా కన్పించిన ఆ చిన్ని పట్టణం, ఇప్పుడు బోసి బోసిగా, నాసినాసిగా కన్పించసాగింధి బామ్మగారికి కేవలం కన్పించటమే కాదు, ఆ చిన్ని పట్టణంలో కాలు బయటకు పెట్టాలన్నా, కళ్యాణ వేడుకల్లో పాల్గొనాలన్నా ఆమెకు చీదర పుట్టసాగింది వీధి నీళ్ళ పంపుల దగ్గర ఆడతనం మరిచిపోయి అరచుకొనే స్త్రీల అలగాతనం, ఆ అరుపుల కంగాళీ కేళి మోతాదు మించి, జుట్టూ జుట్టూ ఒడిసి పట్టుకొని సాగించే దొమ్మరి ఫైటింగ్‌లూ, ముష్టియుద్ధాలు ముదనష్టపు బూతుకూతలు బామ్మగారికి కంపరం కల్గిస్తున్నాయి 'చీ మురికి సంత' అనుకొనేంత చీదర పుట్టిస్తున్నాయి అయితే ఒకప్పుడు ఈ పెట్రేగిపోయిన బజారు కొట్లాటలే ఒక తెలుగు ఫైటింగ్ సినిమా చూస్తున్నంత సంబరంగా సరదాగా ఉండేది ఆమెకు ఆ సరదాలోనే, ఆ సందడిలోనే తనక్కావాల్సిన రెండు బిందెల మంచినీళ్ళు అతిలాఘవంతో, లౌక్యంతో పట్టుకొచ్చుకొనేది బామ్మగారు పూర్వం ఇప్పుడా లాఘవం చూపాలన్నా, తన గొప్పతనం హెచ్చుతగ్గులు వివరించి తన రెండు బిందెల నీళ్ళూ ఆ గందోళి గుంపు నుండి సాధించుకు తెచ్చుకోవాలన్నా బామ్మగారికి మహారోతగా ఉంది ఏమిటి కారణం? సింపుల్, బామ్మగారు బొంబే పోయొచ్చింది ఉట్టొట్టినే పోయి రావటం కాదు ఆ మహా పట్టణంలో ఉద్యోగం చేసే మనుమడి దగ్గర రెండు నెలలు సకల భోగాలూ అనుభవించి వచ్చింది ఆ మహాపట్టణం కీలు కీలూ దర్శించి వచ్చింది పరామర్శించింది, మాటలా?

బారెడు పొద్దెక్కినా, తెగ బారెడు జనసందోహంతో హోటళ్ళూ, రోడ్లూ కిటకిట మంటున్నా తనకు సంబంధమే లేనట్టు ముసుగుతన్ని తాపీగా కునుకు తీసే రంగనాథం ఇప్పుడు తెలతెలవారక మునుపే త్రుళ్ళిపడి లేస్తున్నాడు ఎవరో తరుము కొస్తున్నట్టు, మరెవరో కొరడాలతో వేధిస్తారన్నట్టు ఆదరాబాదరా కాలకృత్యాలు అయినవని పించుకొన్నాడు బావి దగ్గర స్నానాదికాలు కానిస్తున్నాడు తత్తరపాటుతో ఈ పరుగు పందెంలో ఒక్క క్షణం ఆడదామంటే అతనికి చెప్పలేనంత భయం పీకుతుంది ఒక్క రంగనాదం విషయమే కాదు, ఆ కొంపలో అద్దెకుంటున్న నాలుగైదు కాపరాల వాళ్ళ పోకడా ఇదే తెల్లవారిందాకా తెరిపి లేకుండా తత్వగీతాలు పాడుకొనే రిటైర్డ్ పద్మనాభంగారి నుండి, పసిపిల్లలైనా, పచ్చి బాలింతలైనా ఈ కవాతులోనే తర్ఫీదవుతున్నారు అటూ ఇటూ పొందిక లేకుండా అడ్డదిడ్డంగా అల్లుకుపోయిన ఆ కొంపలో తలా ఒక రెండు గదుల్నాటి అరల్ని ఒక్కొ కుటుంబం ఆశ్రయించింది ఆ అరలే వారికి ఇంద్రభవనాలైనా గంధర్వ మందిరాలైనా వీళ్ళందరిది ఒకటే ఆరాటం తెల్లవారే లోపలే ఆ కొంప ఉమ్మడి ప్రాకారంలోని అన్ని పనులూ అయిపోవాలి సమస్తమూ సద్దు మణిగిపోవాలి అప్పుడు గాని వాళ్ళ గుండెలు కుదుట పడవు తొందర తొందరగా పనులు తెముల్చుకోవాలన్న ఆరాటంలో ఒకరి కొకరు పోటీ పడటం, క్యూల మధ్య దూరిపోవటం తప్పని సరైంది ఈ కుటుంబాల వారందరికీ కారణం? ఈ అందరి ఉపయోగార్థం ఉన్నది ఒకే బావి, ఒకే బాత్‌రూం, ఒకే లెట్రిన్, మరో బాత్‌రూం, లెట్రిన్ ఉన్నాయి గాని, అవి బామ్మగారి స్పెషల్ కన్నెత్తి చూడటానికి వీలు లేనివే అయినా, ఆ కాపురాల పిల్ల వెదవలు అప్పుడప్పుడూ దొంగ దొంగగా ఆ స్పెషల్స్‌లోకి అడుగు పెట్టటం కద్దు ఈ వ్యవహారం పసిగట్టిన బామ్మగారు ఏకంగా అన్ని కాపురాల పై శాపనార్థ శరగోపాలు పెట్టి, తన స్పెషల్స్‌కు తాళాలు బిగించింది అసలింతే కాదు తెల్లవారిందంటే చివరకు మగవాళ్ళు గూడా ఎవరి గదుల్లో వాళ్ళు బందీలైపోయి దొంగల్లా గడపటం, మాటలు మానేసి గుసగుసలాడటం ఒక అలవాటుగా మారింది ఇటీవల, ఏమిటి వీరికి అవస్థ? బామ్మగారు బొంబై

పోయొచ్చింది

ఇదుగో ఈ బొంబై పోయొచ్చిన నాట్నుండి ఆ కొంపలోని మగపురుగు లందరికి ముప్పు ముంచుకొచ్చింది పెద్దగా అందామన్నా, నచ్చినవి తిందామన్నా వారికి చచ్చే భయం పట్టుకుంది తమ మగవాళ్ళు ఇట్లా పురుషత్వం కోల్పోయినట్లు ప్రవర్తించటం, దిక్కుమాలిన నంగి బ్రతుకు గడపటం ఆడవాళ్ళకు చచ్చేంత తలవంపులుగా ఉంది ఏమిటి మీరు? ఒక్క ఆడదానికి, అందునా వయసుమీరిన ఆడదానికి దడిచి ఈ అజ్ఞాత జీవితం గడపటం అసహ్యంగా లేదూ మీకు? మీరందరూ కలిసి ఆమెను అదుపులో పెట్టలేరూ? ఇంత అసమర్ధతా మీకు?' ఇవీ ఆడవాళ్ళు నిరంతరం తమ తమ గదుల్లో వొదిగిన మగవారిని ప్రశ్నించే ప్రశ్నలు

ఆవిడకు దడిచికాదు అవిడ రాకాసి నోటికి ఇది మగవారి నంగి నంగి జవాబు ఈ నత్తి నత్తి జవాబుతో నిట్టూర్పులిడిచే ఆడవారు ఏమిటీ బామ్మగారి ఈ తడాఖా? అద్దెకుండే ఈ కుటుంబాలకీ హడలూను? ఇది సింపుతే ఆవిడగారు ఇటీవల బొంబే వెళ్ళొచ్చింది వెళ్ళొస్తే ఏమిటయ్యా, ముష్టి పోస్టుకార్డు అంతకంటే ఎక్కువే పోయొస్తుంది తలుచుకుంటే, ఈగలూ, దోమలూ గూడా పోయొస్తాయి ఆవిడ ఘనతేమిటి? అంటూ ఆ కొంపలోనే అద్దెకుంటున్న ఓ అభ్యుదయవాద బ్రహ్మచారి రామాచారి ఆవేశంగా ప్రశ్నిస్తే ఆ ఘనత మా బ్రతుకుల్ని అవస్థ పెట్టేదేకాని, మాటల్తో

## ముక్తి

మనిషికి ఎన్ని బాధలున్నా
రేపు మీద ఆశే మనసుకు శాంతి
చుట్టూ ఎంత చీకటి వున్నా
చిరు దీపం వుంటేచాలు యింటికి కాంతి
సమాజం ఎంత కుళ్ళి పోతున్నా
వ్యక్తి శీలాన్ని కోల్పోక పోతేనే దేశానికి ముక్తి

–కప్పగంతుల మల్లికార్జునరావు

# బామ్మగారి బాంబే యాత్ర

చెప్పేదికాదు నాయనా, అయినా నీవు వంటరివాడివి, ఇందులో సాధకబాదకాలు నీకు తెలియవు' అంటూ బోధనలు సాగిస్తారు ఆ కుటుంబాల పురుషపుంగవులు

ఈ కొంప గాక పోతే మరో కొంపే దొరకదా? ఇంత సిగ్గుతో, బయంతో ఇక్కడ మ్రగ్గటం దేనికి?" అంటూ విసిగిపోయిన ఆడవాళ్ళు వారి వారి మగవారిపై విరుచుకు పడుతుండటం, సదరు మగవాళ్ళు మహా వేదాంతుల్లా తిట్టేదెవరూ, పడేదెవరు?' అన్న దోరణిలో బిక్క చూపుల్తో పిచ్చి నవ్వులు నిశ్శబ్దంగా నవ్వటం, ఆ నవ్వులు ఆడవాళ్ళకి మరింత అసహనాన్ని పెంచటం అలవాటైపోతున్నది ఆబగా, ఆరాటంగా ఏ అర్ధరాత్రో పిల్లిలా దగ్గరకు చేరిన మగవాళ్ళను 'ఇందుక్కూడా భయమేనా?పిల్లల్ని కనటానికీ, పెంచటానికి భయపడే ఈ కర్మేమిటండీ మీకు? మరో కొంప చూసేపాటి తెగువ, స్తోమత లేవా మీకు? అసలెందుకండీ ఆవిడంటే మీకి భయం అంటూ ఆడవారు చీదరించుకోవటం, చిర్రు బుర్రులాడటం చూసి మగాళ్ళకు తలకొట్టేసినంత అవమానమనిపించేది కనీసం ఇంటి ఆడవాళ్ళను సైతం ఊరడించుకోలేక, అటమటలాడిపొయ్యే తమ చాతకానితనానికి తమలో తామే కుమిలిపోసాగారు ఈ కుమిలిపోవటానికి, కుక్కిన పేనుల్లా గదుల్లో పడి ఉండడానికి అసలు కారణం బామ్మగారి బాంబే యాత్రేనన్న విషయం వారికి రూఢిపడిపోయింది ఆ యాత్ర ముగించుకుని ఆమె వచ్చిననాటి నుండి బామ్మగారి మనసూ, నోరూ రెండూ మారిపోయాయి మనసుకు దురుసు, నోటికి పెళుసూ అలవడ్డాయి

తెల్లవారుతున్నకొద్దీ ఈ నోటిదురుసు మరి అధికం కాజాగింది బామ్మగారిలో ఆ పల్చటి స్వచ్ఛ వెలుగుల్లో ఆ చిన్నపట్టణం, ఆ పట్టణంలోని ఆమె అస్తవ్యస్త కొంప కళ్ళముందు కన్పించటం, తాను చూసొచ్చిన బొంబైలోని మహా భవంతులు ఆమె మనోపథంలో తళుక్కుమని మెరిసిపోవటం, ఆ మెరుపుల్లో తన దీనమైన, దయనీయమైన ఇంటిని బేరిజువేసికొని నిట్టూర్పు లిడవటం, ఆ నిట్టూర్పుల్నుండి చిమ్ముకొచ్చే అసంతృప్తి

అగ్నిరవ్వల్ని ఆమె అదుపు చేసుకోలేక పోతున్నది అందుకే ఉగ్రపుడియంగా, ఏ కారణం లేకుండానే ఆమె అందర్నీ విసుక్కోవటం, విపరీతంగా మాట్లాడటం ప్రారంభించింది ప్రదానంగా ఇందుకు గురైంది తన ఇంట్లో ఉంటున్న అద్దె కాపురాల వాళ్ళు తెల్లవారి లేస్తూనే బావి దగ్గర చేరిన వాళ్ళనూ, బాత్రూమ్ క్యూలో ఉన్నవారిని విమర్శలతో ఓ పట్టు పట్టటం ప్రారంభించింది బామ్మగారు

అబ్బబ్బ పాడు సంత దరిద్రపు ఆరాటం , దిక్కుమాలిన జనం ఇదే బొంబైలో అయితే మనుషులిట్లా గుంపుకూడుతారా? వంటగదిలోకే ఝామ్మంటూ నీళ్లొచ్చి పడతాయి అయినా మంచీ మర్యాదా, ఓ పద్ధతి పాడూ తెలియని పిలాగా, అక్కడ ఇట్లా గుమిగూడతారా? బావి ఉన్నదిగదా అని నీటికోసం ఒకటే దేబిరింపు తొలగండి తొలగండి, బొంబై నుండి వచ్చిన మరునాటి ఉదయమే, తన ఇంట్లో బావి దగ్గర చేరిన అద్దె కాపురాలను, అందునా పిల్లా పీచూ, ఆడా, మగా అంతరం లేకుండా విసురుగా వడ్డించిన అష్టోత్తర శాపనార్థాలు ఇవి నివ్వెరపోయి, నిలువు గుడ్లేసుకొని చూస్తున్న మగవారిని తెమలరేం ఇక,

తెల్లవారితే చాలు అన్నీ దేబిరింపులే అంటూ మరోమారు జాడించింది బిక్క చచ్చిపోయి తమ తమ బాగాల్లోకి వెళ్లిపోయారు మగవారు నోట మాట స్తంభించిన ఆడవారు బామ్మగారికి అడ్డు తొలగి, బావి దూరంగా జరిగి నోరెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయారు తాపీగా స్నానాదికాలు ముగించుకుని, అనవసరంగా బావి చెప్టా శుభ్రంచేసి గునుసుకుంటూ లోనికెళ్లింది బామ్మగారు ఇదిగో

ఈ కొత్త అనుభవంతో ఆడవాళ్ళు దిమ్మెరపోయారు మగవాళ్ళు బెంబేలెత్తిపోయారు ఈ మహాతల్లి ఆగ్రహం ఎవరి మీదనో అర్థంగాక జుట్టు పీక్కున్నారు అందరూ గుమికూడి ఎప్పుడూ అయినదానికీ కానిదానికీ అనవసరంగా తమను తిట్టే తల్లిదండ్రులు ఇట్లా బామ్మగారి తిట్లకు వణికిపోవటం పిల్లలకు మాత్రం వింతగానూ వినోదంగానూ ఉంది, భయపడే తండ్రుల్ని ఇంకా చూడాలని ఉంది వాళ్లకు

మరో రోజు ఉదయం , లో నుండి వస్తూనే ఉమ్మడి బావి ముందు బండమీద కూర్చుని అక్కడ చేరిన కుటుంబ సమూహాలకు తన బొంబాయి ముచ్చట్లు హరికథలా అభినయించి మరి చెప్పసాగింది పనులు ఆగిపోయి డీలాపడిపోయి, మొగమాటంకొద్దీ వింటున్న ఆడామగా అందర్నీ చూసి మరింత ఉత్సాహం ఉద్భృతం చేసుకుని , పరాగ్గా ఉన్న వాళ్లను వినమని మరి గద్దించి తన బొంబాయి అనుభవాలన్నీ ఏకరువుపెట్టింది బామ్మగారు తాను ఎంతో పెట్టి పుట్టబట్టి, పుణ్యమేదో కట్టుకోబట్టి తనకా బొంబాయి దర్శన భాగ్యం లభించిందని బామ్మగారు తనను కీర్తించుకొంది మరింత రెచ్చిపోయి బొంబాయి వెళ్లిరాని వారి బ్రతుకు బ్రతుకే కాదంది వారి జీవితం అశుద్ధం వంటిదంది ఇంకా ఎన్నో అంది అయితే ఈ మాటలన్నీ బలవంతంగా భరించిన ఆడామగా అందరి మనసు కలుక్కుమంది ఆడవారికైతే కన్నీళ్ల పర్యంతమైంది

అదిగో, ఆనాటి నుండి తెల్లవారుతుందంటే భయం, బామ్మగారి శాపనార్థాలన్నీ తినాలి, ఉబుసుపోని ఉపన్యాసాలన్నీ వినాలి ఈ భయంతో నే తెల్లవారక ముందే ఏదో దెయ్యం నీడ వెంటాడుతున్నట్లు అద్దె కుటుంబాల ఆడామగా అందరూ అన్ని కాలకృత్యాలూ ముగించుకుంటున్నారు ఆత్రంతో తెల్లవారుతుందనగానే తమ తమ వాటాల తలుపులు బిగించుకొంటున్నారు

అయితే బ్రహ్మచారి రామాచారి మాత్రం తన ప్రాతః కార్యక్రమాలేవీ సమయానుకూలంగా మార్చుకోలేదు ధీమాగా తెల్లవారిం తర్వాతే స్నానం చేసేవాడు ఉగ్రరూపంతో ఉన్న బామ్మగారి వేపు నిర్లక్ష్యంగా చూసేవాడు నీవెంత నీ బొంబాయెంత అన్నట్లు చూసేవాడు, ఇది బామ్మగారికి భరించరానిదిగా ఉండేది భంగపాటు కల్గించేదిగా ఉండేది

ఏం నాయనా! ఇప్పుడా తీరింది తగుదునమ్మా అంటూ నా స్నానానికడ్డు తగుల్తున్నావ్, నీవిచ్చే ముష్టి అద్దెకు బావి అంతా తోడే స్నానం చేయాలా? ఇంత సదుపాయం ఉంటే బొంబైలో అద్దె ఎంత వసూలు చేస్తారో తెలుసా?' బామ్మగారు కస్సుమంది

'అవును, బాంబేలో అద్దె ఎక్కువే, కానైతే అందుకు తగ్గ సదుపాయాలనేకం ఇట్లా ఒక బావికోసం, బాత్రూం కోసం, లెట్రిన్ కోసం నాలుగిళ్ల వాళ్ళు తొక్కిసలాడుకోవటం అక్కడ ఉండదు అది మీరూ గుర్తించాలి నింపాదిగా బామ్మగారిని చూస్తూ చెప్పాడు రామాచారి

ఓ యబ్బో పెద్ద చెప్పొచ్చావ్, పెద్ద బొంబాయి సొంతం చూసొచ్చినట్లు, నీవనే అన్ని వసతులు సమకూరిస్తే ఆ అద్దె ఎవరిస్తారు? నీవిస్తావా?

అసలిక్కడ వసతులేమున్నాయి సత్రంలో బ్రతికినట్లు అన్నీ చంపుకుని ఉంటున్నాం అవసరమైనా రాత్రిపూట లైటు వెయ్యరాదు గోడకు మేకులు కొట్టరాదు బంధువులు, స్నేహితులు రాకూడదు, ఇంట్లో పొగ పెట్టకూడదు పెద్దగా మాట్లాడకూడదు అసలు నవ్వకూడదు ఏమిటండీ, రాజ్యాంగంలో కూడా లేని ఇన్ని నిర్బంధాలు, నిబంధనలూను మనిషన్నవాడు ఈ ఇంట్లో ఉండగలుగుతాడా? ఉన్నా సంసారం చేయగలుగుతాడా? ఉద్వేగంగా అన్నాడు రామాచారి బామ్మగారు విరుచుకుపడుతూ అంది

నిన్నగాక మొన్న పుట్టావ్, ఎన్ని మాటలన్నావ్? తప్పు అసలు నాది నీవంటి వాడికి ఇల్లు అద్దెకివ్వటం నా ఇంటికే వంకలు పెడుతున్నావ్ తక్షణం ఖాళీ చేయి లేకపోతే మర్యాదుండదు

మేమూ అంత చేతకాక ఏం లేం, ఈ ముష్టి కొంపపాటి వేరే ఇల్లు దొరక్కపోదు

ఏమన్నావ్ ముష్టి కొంపా? నీవంటి అప్రాచ్యపు శుంఠకి ఇల్లిచ్చినందుకు నాకు తగ్గ శాస్తే జరిగింది అసలు నీ వంశమేమిటో, మంచీ మర్యాదలేమిటో తెల్సుకోకుండా నెత్తికి తెచ్చుకున్నాను నీ వంటి పోకిరి వెధవలు ' ఊగిపోతున్నది బామ్మగారు

ఆపండి, మాటలంటే మర్యాదుండదు ఏదో వయసులో పెద్దవారని సహిస్తుంటే అదుపు తప్పుతున్నారు చచ్చే వయసొచ్చినా సహనం రాని జన్మెందుకు?

ఓ యమ్మో ఓ యమ్మో , ఎంతలేసి మాటలంటున్నాడు, వీడికి ఇహపరాల్లో పుట్టగతులుండవ్, కౌరవాది నరకాల్లో పడి నీలుగుతాడు, నాయనా నీవు తక్షణం ఖాళీ చేయి, ఈ క్షణమే ఖాళీ చెయ్యి నీ మొహం చూస్తే ఈ ఇంటికి కూడా శని చుట్టుకొంటుంది నాయనా నన్నేడిపించకు బామ్మగారు పూనకం పట్టినట్లు ఊగిపోతూనే చతికిలపడింది బావి చప్టా మీద విసురుగా బయటకు వెళ్లిపోయాడు రామాచారి




పది నిమిషాల్లో రిక్షాను తేవటమేమిటి, తన సామానంతా సర్ది రిక్షాలో పెట్టటమేమిటి, ఆ ఇవ్వవలసిన అద్దె ఏదో బామ్మగారివైపు విసరటమేమిటి, అంతే నిరసనగా అక్కడ నుండి రిక్షా ఎక్కి వెళ్లిపోవడమేమిటి అంతా ఓ తుఫాన్ వేగంతో చేశాడు రామాచారి దిమ్మెరబోయి చూస్తున్న బామ్మగారు తేరుకొంది అట్లా తలుపులు బిగించుకొని ఉండిపోతారేరా లోపలా ఇంతలేసి మాటలు ఆ ఎల్ల వెదవ అంటుంటే ఒక్కడూ బయటకొచ్చి వాణ్ణడ్డుకోరేం? ఇంత చచ్చి బ్రతుకుతారేం? ఆయా వాటాల వైపు అధిక్షేపంగా చూసి, ఆక్షేపణగా ఆరోపణలు చేసింది బామ్మగారు, ఎవరూ ఎంతకీ తలుపులు తీయకపోవటం గమనించిఅందర్నీ శాపనార్థాలు పెట్టింది

# ఈ·వేమన·పద్యాలు




రానిది కోరిన రాదది
రానున్నది కోర కున్న రానే వచ్చున్
తానెంత చింత జేసిన
కానున్నది కాకపోదు గదరా వేమ

ఈ తంతంతా తమ తమ గదుల్లో ఉండి నిశ్శబ్దంగా గమనిస్తున్న పిన్నా పెద్దా అందరూ గప్‌చిప్‌గా పొంగిపోయారు ఈ దెబ్బతో బామ్మగారి అహానికి సమాదే అనుకొన్నారు ఆవిడ బొంబాయి కొమ్ములకు ఇహ దమ్ములుండవనుకొన్నారు రామాచారిని ఆడవారైతే 'ఔరా' అని కీర్తించారు మనస్సులో

కాలం గడిచిన కొద్దీ అందరి ఆశలు, అంచనాలూ తారుమారు జేస్తూ బామ్మగారు మరింత పెట్రేగిపోయారు ఆ ఇల్లే తప్ప మరో దిక్కు లేదనుకొన్న వారు మరింత కుమిలిపోయారు బామ్మగారి నోటి ఆగడాలు హద్దు మీరటంతోనూ, ఆమెగారి బొంబాయి అనుభవ ప్రేలాపనలు అదుపు మీరటంతోనూ, పాపం అద్దెదారు లందరికీ

## బామ్మగారి బొంబే యాత్ర

తెల్లవారు తుందంటే భయంతో గుండెలదిరేవి ఇదంతా తన బొంబే యాత్ర ప్రభావమే ననుకొన్న బామ్మగారి మనసు పొంగేది తత్వగీతాలు పాడుకొనే రిటైర్డ్ పద్మనాబంగారికి ఆమె పట్ల ఏదో జాలి బావం కలిగి ఆమెకు జ్ఞానోపదేశం చేయాలనుకొన్నారు తెల్లవారినా, నిర్భయంగా బయటకొచ్చి బామ్మగారి ముందు నిలబడి –

తల్లీ ఈ జీవిత చరమ సంధ్యలో ఎందుకమ్మ ఇంత మౌఢ్యంగా ప్రవర్తిస్తావ్ జీవన మృత్యు తీరాల మధ్య వచ్చే ఆటుపోటు మన తాపత్రయానికి, అహంకారానికి అనుబవాలేనమ్మా పడగలెత్తి బుసగొట్టే అహంకారాన్ని అదుపులో పెట్టుకోందే ఆత్మచింతన రాదమ్మా ఆ చింతన రానిదే ముక్తి రాదు తల్లీ ఇప్పటికైనా ఈ లౌకిక లంపటాలకు దాసోహమనక, ఆత్మవివేక స్పృహతో దైవానికి దగ్గరకా తల్లీ అంటూ సాంత్వన వచనాలతో హిత బోధ చేశారు పద్మనాభంగారు

ఆమెలో ఈ మాటలు ఏ మార్పునూ తీసుకు రాకపోగా పద్మనాభంగారినే చచ్చు వేదాంతం చెప్పకు అంటూ గద్దించింది ఈ మనిషి ఈ నరకాన్ని ఎందుకు సృష్టించుకొంటున్నదో, ఏదీ నిలవదని తెలిసీ ఎందుకు ఆశ పడుతున్నదో జాలిగా అనుకొంటూ పద్మనాభంగారు వెళ్ళిపోయారు తన వాటాలోకి

ఒకనాడు ఉన్నట్టుండి ఊడిపడ్డాడు ఈ కొంప ప్రాకారంలోకి అతన్ని చూసిన పిన్నలూ, పెద్దలూ బిలబిలమంటూ గదుల్లో నుండి బయట కొచ్చి అతని చుట్టూ మూగారు ఆడవారు గది వాకిళ్ళ వద్ద నిలబడి కుశల మడిగారు మగవారి వైపు గంభీరంగా చూస్తూ అన్నాడు రామాచారి

చూడండి, మనిషి దేన్నైనా దూరం చేసుకొని బ్రతుకు సాగించొచ్చు కానీ ఆత్మధైర్యాన్ని పోగొట్టుకోకూడదు, కొన్ని సమయాల్లో పౌరుషం చూపకపోవటమూ అపరాధమే అవుతుంది ఇన్ని మాటలు ఆమె చేత పడుతూ, భయపడుతూ ఎందుకు మీరిట్లా ఈ కొంపనే పట్టుకొని వ్రేళ్ళాడుతున్నారో అర్థం కావటం లేదు కాకపోతే అద్దెలు కాస్త ఎక్కువైనా మీరు భరించలేరా "

రామాచారి ఈ ప్రబోధం నింపాదిగా భావి చప్టా మీద కూర్చొని చేస్తున్నపుడే బామ్మగారు బయట నుండి ఊడిపడింది యదార్థానికి రామాచారి తన ఇంటి వైపు పోతుండటం దూరం నుంచి ఆమె గమనించింది వెంబడించింది బయట గోడ వైపు నిలబడి ఈ తతంగమంతా గమనించింది రామాచారి మాటలూ విన్నది

ఈ హఠాత్పరిణామంతో అద్దెదారులంతా బెంబేలెత్తిపోయారు రామాచారి విసురుగా వెళ్ళిపోయాడు దిక్కు తోచనట్లు నిలబడ్డ వాళ్ళందరినీ గమనిస్తూ అంది బామ్మగారు

మీరందరూ ఇంత కాలం నుండీ ఈ ఇంటిని అంటి పెట్టుకొని ఉన్నారు ఏది ఉన్నా లోపించినా సర్దుకొన్నారు నేనన్నవీ సహించారు మౌనంగా నాకు చాలా సంతోషంగా ఉంది పెద్ద ముండను నేను మాత్రం ఎంత కాలం ఉంటాను నేను పోయే లోపల మీరు నమ్మినా నమ్మకపోయినా ఒకటి మాత్రం చేయాలనుకొన్నాను కనిపెట్టి ఉన్నవాళ్ళే కావాల్సిన వాళ్ళంటారు అందుకని మీరుంటున్న వాటాలను మీ పేరనే వ్రాసి రిజిష్టర్ చేయాలనుకొంటున్నాను ఈ మాటలు విన్న మగవాళ్ళు ముందు స్తబ్దులైపోయినా ఆ తర్వాత సంతోషంతో కొట్టుకులాడారు 'లౌక్యం తెలియని పిచ్చి సన్నాసులు అనుకొన్న బామ్మగారూ మనసులో తృప్తి పడింది విరాగి పద్మనాభం గారు మాత్రం శూన్యంలోకి చూస్తూ ఉండిపోయారు □

నాటి నుండి నేటి వరకు
మా కేశ సంపద రహస్యం






# హైదరాబాదు నోట్‌బుక్

## డాక్టర్ కె. ఎల్. రావు కాలధర్మం :-

ఆంధ్రప్రదేశ్ మే 18న ఇద్దరు ప్రముఖులను కోల్పోయింది. వారిలో ఒకరు ప్రపంచ విఖ్యాత అభియంత (ఇంజనీరు) డాక్టర్ కె ఎల్ రావు. రెండవవారు తెలంగాణాలో తెలుగు బాషా వాఙ్మయ చరిత్ర పరిశోధనకు పట్టుగొమ్మ అయిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారలు డాక్టర్ కె ఎల్ రావుగారి వయస్సు 84 సంవత్సరాలు, ఆచార్య లక్ష్మీరంజనంగారి వయస్సు 78 సంవత్సరాలు

డాక్టర్ కె ఎల్ రావు గారి పూర్తి పేరు కానూరి లక్ష్మణరావు. కృష్ణాజిల్లా కంకిపాడులో 1902 జులై 5న జన్మించారు ఆయన తండ్రి శ్రీ మల్లికార్జునరావుగారు పునాదిపాడు గ్రామ కరణం కె ఎల్ రావు మద్రాసులోని గిండి ఇంజనీరింగ్ కళాశాలలో బి ఇ డిగ్రీ పొంది, అక్కడే ఎం ఎస్ సి ఇంజనీరింగ్ పట్టాను పొందిన ప్రప్రథమ విద్యార్థి పిదప ఆయన ఇంగ్లాండులోని బర్మింగ్‌హాం విశ్వ విద్యాలయం నుంచి పిహెచ్‌డి పట్టా పొందారు లవ్‌బరో కళాశాలలో ఆచార్యులుగా పని చేశారు అప్పటి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం ఆహ్వానం పై మద్రాసుకు తిరిగి వచ్చి, ఇంజనీరుగా నియమితులయ్యారు 1950లో కేంద్ర జల విద్యున్మండలి డైరెక్టరుగా నియమితులయ్యారు ఆ పదవీకాలం పూర్తయిన పిదప ఆ మండలి సభ్యులుగా ఉన్నారు తమ ఉద్యోగ కాలంలో ఒక్క భాక్రానంగల్ ప్రాజెక్ట్ తప్ప తక్కిన అన్ని భారీ, మధ్య తరహా నీటి పారుదల, జల విద్యుత్ ప్రవాహ నిరోధక పథకాలతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రావుగారికి సంబంధం వుంది పెక్కు ప్రాజెక్టులకు డిజైన్లు కూడ సిద్ధపరచారు ప్రపంచంలోనే ఎత్తయిన, మానవ నిర్మితమైన డ్యాములలో పేరెన్నికగన్న నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణంలో ఈయన పాత్ర విశిష్టమైనది ఆయన ఐక్యరాజ్య సమితి సహజ సంపద సంఘం అధ్యక్షత, ఇంజనీర్స్ ఇన్‌స్టిట్యూట్ అధ్యక్షత, కేంద్ర నీటి పారుదల- విద్యుత్ బోర్డ్ అధ్యక్షత, ఇండియన్ నేషనల్ సొసైటీ ఆఫ్ సోషల్ మెకానిక్స్ అండ్ ఫౌండేషన్ ఇంజనీరింగ్ అధ్యక్షత, అంతర్జాతీయ భూసార సంఘం, ఫౌండేషన్ ఇంజనీరింగ్ ఉపాధ్యక్షత, అంతర్జాతీయ జల సంపద సంఘం ఉపాధ్యక్షత వంటి పెక్కు గౌరవ పదవులను నిర్వహించారు ప్రపంచమంతటా పెక్కుసార్లు పర్యటించారు ప్రపంచంలోని జల సంపదకు సంబంధించిన అపార జ్ఞానం కలవారు. ఆయన 300 ఇంజనీరింగ్ సాంకేతిక పరిశోధన పత్రాలు, వ్యాసాలు, ఇంజనీరింగ్ విద్యార్థుల కోసం పెక్కు పాఠ్య పుస్తకాలు రచించారు. ఈయన రచించిన వాటర్ వెల్త్ ఆఫ్ ఇండియా (భారత జల సంపద) విశ్వ విఖ్యాతమైంది. దీనిలో ఈయన గంగా- కావేరి లింక్ (జాతీయ జల మండలం) అనే సిద్ధాంతం ప్రతిపాదించారు. పది సంవత్సరాల క్రితం 'క్యూసెక్స్ క్యాండిడేట్ అనే పేర ఆత్మకథ రచించారు. రావుగారు పదవీ విరమణానంతరం విజయవాడ నియోజక వర్గం నుంచి లోక్‌సభకు పోటీ చేసి 1962, 67, 71లలో ఎన్నికయ్యారు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ప్రభుత్వంలోను, శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వంలోను నీటిపారుదల- విద్యుత్‌శాఖ మంత్రిగా పని చేశారు 1980లో జనతా పార్టీ అభ్యర్థిగా లోక్‌సభకు పోటీ చేసి ఓడిపోయారు భారత ప్రభుత్వం ఈయన సేవలు గుర్తించి 1963లో పద్మభూషణ బిరుదంతో సన్మానించింది డాక్టర్ రావు కొన్ని నెలలుగా అస్వస్థులుగా వున్నారు 18వ తేదీ ఉదయం 7 00 గటల వరకు ఈయన లేవలేకపోయేసరికి ఇంట్లో వాళ్ళు వెళ్ళి చూచారు మంచంలోనే మరణించినట్లు తెలుసుకొన్నారు రాష్ట్రపతి జ్ఞానీ జైల్‌సింగ్, ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు మున్నగు ప్రముఖులు డాక్టర్ రావు మరణానికి సంతాపం తెలిపారు డాక్టర్ రావు మరణంతో ఆంధ్రప్రదేశ్ విశిష్టమైన సుపుత్రుణ్ని కోల్పోయిందని, ఆయన ఇరిగేషన్ విద్యుచ్ఛక్తి రంగాలలో అసమానమైన సేవ చేశారని ముఖ్యమంత్రి శ్రీ రామారావు జోహార్లర్పించారు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రవణకుమార్, ఇతర ప్రముఖులు పుష్పగుచ్ఛాలు సమర్పించారు డాక్టర్ రావుగారి భౌతిక కాయాన్ని మే 19 ఉదయం విజయవాడకు తీసుకొని వెళ్లారు మే 20న ప్రభుత్వ లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి డాక్టర్ కె ఎల్ రావు శిలా విగ్రహాన్ని స్థాపించాలని సర్దార్ గౌతు లచ్చన్న రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరారు

## ఆచార్య లక్ష్మీరంజనం కన్నుమూత :-

నాలుగు దశాబ్దాల క్రితం మాట అప్పుడు ఉస్మానియా విశ్వ విద్యాలయంలో జాతీయ వర్గం ఉండేది దానిలో రెక్టార్ శ్రీ కిషన్‌ఛంద్, ప్రొఫెసర్ నిజాముద్దీన్, శ్రీ లక్ష్మీరంజనం మున్నగువారు ప్రముఖులు నేనేదో ఒక నౌకరికి దరఖాస్తు పెట్టుకున్నాను దరఖాస్తుతో పాటు



ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం

నన్ను లక్ష్మీరంజనంగారు శ్రీ కిషన్‌చంద్ వద్దకు పిలుచుకొని వెళ్లారు ఆయన నా దరఖాస్తు చదివి చింపి ముక్కలు చేసి చెత్త బుట్టలో పడేశారు నాకు చాలా అవమానంగా తోచి. చాల అన్యాయం చేశారు అని సవినయంగా మనవి చేశాను ఆయన ఒక నవ్వు నవ్వి. ఏమిటయ్యా. నీవు ఏదేదో చేశాను, ఎక్కడెక్కడో తిరిగాను, ఏమిటేమిటో చదివాను అనేవాడు దరఖాస్తు వ్రాసే పద్ధతి ఇదేనా? నాకీ యోగ్యతలున్నాయి నన్ను తీసుకుంటే మీ సంస్థకు లాభం సుమా? అన్న ధోరణిలో వుండాలి దరఖాస్తు- అని అంటూ తనే దరఖాస్తు వ్రాసి లక్ష్మీరంజనంగారికి చూపి, చేయి సంతకం అని నా ముందు పెట్టారు, నేను అంతా చూస్తూ ఆశ్చర్యపోయాను అది లక్ష్మీరంజనంగారి, వారి వర్గం వారి సహృదయత లక్ష్మీరంజనంగారు ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెలుగు భాషా సాహిత్య చరిత్రాది పరిశోధనలకు పునాది వేసిన మహనీయులు. ఆయన వందలాది గొప్ప శిష్య ప్రశిష్య పరం పరగల కులపతి 18వ తేదీ మధ్యాహ్నం విద్యానగర్‌లోని స్వగృహంలో మరణించారు ఈయన 1908లో తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో జన్మించారు వరంగల్లులో చదువుకున్నారు ఎం ఏ తెలుగు సంస్కృతాలలో ఉత్తీర్ణులయ్యారు మొదట వరంగల్లు కళాశాలలో ఉపాధ్యాయులుగా చేరి పిదప ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెలుగుశాఖలో చేరి, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి పి[?] ప్రొఫెసరయ్యారు 1964లో పదవీ విరమణ చేశారు ఈయన తెలుగు పాఠశాల స్థాపించారు ఆంధ్ర ప్రాచ్య కళాశాల, వివేకానంద తెలుగు కళాశాల, తెలంగాణా రచయితల సంఘం మున్నగు సంస్థలు స్థాపించారు సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం, ఆంధ్రదేశ భూగో[ళ] చరిత్ర సర్వస్వం, సంశోధితాంధ్ర మహా భారతం మున్నగువాటికి ప్రధాన సంపాదకత్వం వహించారు సిద్ధేశ్వర చరిత్ర మున్నగు గ్రంథాలు ప్రచురించారు ఆయన రచనలలో ఆంధ్రుల చరిత్ర- సంస్కృతి ఎక్కువగా జనాదరం పొందింది లక్ష్మీరంజనంగారు సహృదయులు, కార్యదక్షులు, ప్రామాణికతకు పట్టుదలగలవారు ఈయనకు సతీమణి, ఒక కుమార్తె, కుమారుడు ఉన్నారు

## ఉపశ్రుతి :-

అవనిగడ్డలో బస్సు దిగాను. గాంధీ క్షేత్రానికి బయలుదేరాను. ఏమండోయ్, బాబూ, చిల్లర తీసుకు వెళ్లండి-అని కేక వేశాడు బస్సు కండక్టరు. ఏం చిల్లర!- అన్నాను. టికెట్టు పోగా మిగిలిన చిల్లర- అన్నాడు కండక్టర్. చిల్లరా! మిగిలిన చిల్లర ప్యాసింజరుకు ఇవ్వడమా? అదీన్నీ స్వయంగా కేకేసి!-అన్నాను ఆశ్చర్యం ప్రకటిస్తూ. దీంట్లో విడ్డూరమేముంది! ఇంతకూ ఏ వూరు మీది?- అనడిగాడు. హైదరాబాద్- అన్నాను. అదా సంగతి- అన్నాడు

—తిరుమల రామచంద్ర

## నెప్టా సంగీత నృత్య పోటీలు

నెల్లూరు ఫిలిం జర్నలిస్టుల ఆధ్వర్యములో జూలై రెండవ వారములో అఖిలబారత స్థాయిలో కూచిపూడి, భరతనాట్యం, రికార్డుడాన్సులలోను, లలిత సంగితం, తెలుగు సినిమా పాటలు, హిందీ సినిమా పాటలలోను పోటిలు నిర్వహించబడును పై పోటిలకు న్యాయ నిర్ణేతలుగా సిని నృత్య దర్శకులు, సినీ సంగీత దర్శకులు వ్యవహరిస్తారు వివరాలకు సెక్రటరి, నెప్టా నాటక కళా పరిషత్, నియర్ అనితాహాల్,నెల్లూరు–524003 కి రాయవచ్చు

## "టుడే" బిళ్లల ప్రత్యేకత

మన దేశంలో ప్రధాన సమస్యగా ఉన్న జనాభా సమస్యకి పరిష్కారంగా కుటుంబ నియంత్రణకి మరో కొత్త బిళ్లలు వస్తున్నాయి మహిళలు వాడే టుడె (నొనొక్సినాల్)పేరు గల ఈ బిళ్లలు తొలిసారిగా మన దేశంలో బ్లిస్ కెమికల్స్ అండ్ ఫార్మా స్యూటికల్ ఇండియా వారు ప్రవేశ పెట్టారు అనేక సంవత్సరాలుగా 60కి పైగా దేశాల్లో ప్రజలు వీటిని వాడుతున్నారు

ఈ నొనొక్సినాల్ బిళ్లలు సమర్థవంతంగా, నిరపాయకరంగా వీర్య కణాలను నాశనం చేస్తున్నాయని ఈ రంగంలో శతాబ్దంపై నిష్ణాతులైన బ్రిటన్ లోని రెండాల్స్ దినిని అబివృద్ధి చేసారు

## అవీ ఇవీ అన్నీ

156 మంది మహిళలపై జరిపిన పరీక్షల వల్ల 75 శాతం మందికి పైగా మహిళల్లో సమర్థవంతంగా ఈ బిళ్ల అంతర్యోనిలో 5–10 ని లోగా కరిగిపోయి ఫలితాన్ని ఇచ్చింది ఇంకా అనేక పరీక్షల ద్వారా సమర్థవంతంగా పని చేస్తున్నట్లు తేలిందని మెడికల్ టెర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ కమిటీ (ఎమ్ టి ఎ కమిటి) చైర్మన్ డా ఎస్ ఎన్ డాఫ్టరి ఒక ప్రకటనలో తెలుపుతున్నారు

అంతే కాకుండా 82 శాతం మహిళలు వీటిని సులబంగా వినియోగించ గలిగారని, 88 శాతం మంది బర్తలు ఈ తరహా కుటుంబ నియంత్రణను అంగికరిస్తున్నట్లు పరీక్షలులో తేలాయి యోనిలో ఏ విదమైన ఇబ్బంది ఎవరికి ఉండదు అని తెలింది అంతకు ముందు ఇతరత్రా గర్భ నిరోదక సాదనాలు వాడిన వారిలో 72 శాతం మంది మహిళలు ఈ నొనొక్సినాల్ వినియోగం పట్ల సంతోషం కనపర్చారు

మొత్తం మీద కుటుంబ నియంత్రణ సాగించడానికి ఇతర సాదనాలతో బాటుగా నొనొక్సినాల్ బిళ్లలు ప్రోత్సహించ దగ్గవి, సులభతర మైనవి అని పోగ్సి వారి ఎం టి ఎ కమిటీ జరిపిన పరిశోదన తెలిపింది

ఎవరికి వారుగానే ఉపయోగించుకునే దిని వినియోగానికి ప్రత్యేక వైద్య సలహా అవసరం లేకపోవడం మరొక అదనపు ఆకర్షణ'



శ్రీ దాసరి నారాయణరావు పుట్టినరోజు సందర్భంగా ముఖ్యమంత్రి ఆయనని అభినందిస్తే ఎలా ఉంటుందో ఇటీవల మదరాసులో జరిగిన శ్రీ దాసరి జన్మ దినోత్సవ వేడుకలలో ప్రఖ్యాత మిమిక్రీ కళాకారుడు శ్రీ ఎం. ఆర్. ప్రసాద్ (గుంటూరు) ధ్వన్యనుకరణని ప్రదర్శిస్తున్న దృశ్యం. □




Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,
by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,
Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial: 75667




## "దేశోద్ధారకుడు" జూన్‌లో

"కారురేసుల్లో లోగడ ఎనిమిది అవార్డులు పొందిన 1933 మాడల్ ఆస్టిన్‌కారు, 'ఎ పేసేజ్ టు ఇండియా' ఆంగ్ల చిత్రంలో ఉపయోగించిన 'రథాన్ని' అతి ప్రయాసతో సేకరించి, ఈ చిత్రంలో ఉపయోగించాం. మే 8 నుంచి 12 వరకు ఆఖరి షెడ్యూల్ జరిగింది," అన్నారు ఎస్.ఎస్. రవిచంద్ర. ఈయన దర్శకత్వంలో చెరుకూరి లక్ష్మీభారతి సమర్పించే విజయభాస్కర్ ఫిలిమ్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, సత్యనారాయణ, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, గుమ్మడి, సుధాకర్, రాళ్లపల్లి, వంకాయల, కాంతారావు, చిట్టిబాబు, మాడా, టెలిఫోన్ సత్యనారాయణ, అప్పారావు, శ్రీరాజ్, అరుణ, వై. విజయ, కాకినాడ శ్యామల, సంయుక్త,

## సినిమా

(౩6 వ పేజీ తరువాయి)

మాస్టర్ రవి వగైరా నటవర్గం. గొల్లపూడి, సత్యానంద్, వేటూరి, చక్రవర్తి, నందమూరి మోహనకృష్ణ, శ్రీనివాసరాజు, శివశంకర్, జూడో 'రత్నం, మాధవరావు, ప్రసాదరావు, రామచంద్రరావు, కోటగిరి వెంకటేశ్వరరావు వగైరా సాంకేతిక వర్గంతో ధనేకుల మురళీమోహనరావు నిర్మాత.

## చిత్రీకరణ ముగిసిన "కోటిగాడు

"న్యాయానికి అర్జున్ ప్రతినిధి అయితే, చట్టానికి శరత్‌బాబు ప్రతినిధి. వీరిద్దరూ ఏకమై ఆ గ్రామంలోని పరమ దుర్మార్గుడైన [illegible] ఎదుర్కోవడంలో వీరికి నివురు గప్పిన నిప్పులాంటి రాధిక తోడవుతూంటుంది. తమిళ హిట్ చిత్రం పగల్ నిలవు' మాతృక," అన్నారు ఎస్. రామచంద్రరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి. ఎస్. ప్రసాద్ నిర్మించిన జయకృష్ణ కంబైన్స్‌వారి పై చిత్రంలో మహాలక్ష్మి, సుధాకర్, వినోద్, వేలు, వీరభద్రరావు, నిర్మల, శ్రీలక్ష్మి తతిమా నటవర్గం.

త్రిపురనేని మహారథి మాటలు, వేటూరి పాటలు, జె. వి. రాఘవులు సంగీతం, బి. కోటేశ్వరరావు ఛాయ, శ్రీనివాస్ నృత్యాలు, జూడో రత్నం సాహసాలు,

చంద్రశేఖర్– మురళి ప్రొడక్షన్, వెంకటరత్నం– శ్యాం కూర్పుతో ఎం. జగన్మోహన్ సమర్పించే ఈ చిత్రానికి కె. ప్రభాకరరావు సహనిర్మాత. □



# రిజల్ట్స్!. రిజల్ట్స్..!! రిజల్ట్స్..!!!


















Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
13–19, JUNE, '86

# అందానికి హుందాతనం ఆప్కో మేటిగుణం

కలిమికి గుర్తుగా నిలిచిన ఇంటి గదిలో
కలికితనానికి అర్థంగా నిలిచిన ఈ లావణ్యవతిని
లతలా పెనవేసుకున్న ఆప్కో చీర తనకుతాను
ఒక వింత వైభవాన్ని సంతరించుకుంది.

ఆప్కో

చేనేతలు




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోఆపరేటీవ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్-500029.

kiron/apco/86